

సంపుటము 21
సంచిక 11

# భారతి

తారణ, కార్తికము
1944 నవంబరు

## బ్రతుకు దెరువు

•

= శ్రీ విశ్వనాథ శ్రీకృష్ణ దేవరాయులు =

నామాట పాలింపవా
ప్రభూ !
నాబ్రతుకుసంగతి ఏమి ?
మహతిసంగీతియే
మదికి నింపుగ లేదు
సెలయేటి మ్రోతకే
చెవులు చిల్లులుపడెను.
మురళి వాయింపవా
ప్రభూ !
నాబ్రతుకుసంగతి ఏమి ?...

చందమామను చూడ
అందమే గనలేను
మబ్బుచూచిన గుండె
తబ్బిబ్బులైపోయె
కంటికే కనుపించవా
ప్రభూ !
నాబ్రతుకుసంగతి యేమి ?...

ఉద్యానవనములో
విహరించుదామన్న
వెన్నెట్లో సుఖపడే
పున్నమే లేదాయె
ఓదార్పరావేమయా
ప్రభూ !
నాబ్రతుకుసంగతి ఏమి ?...

చెలికాండ్ర పలుకులే
చెవిని బట్టుట లేదు
చిలుకపలుకులవలన
చిన్నతనమగుచుండె
పలుకు బంగారమా
ప్రభూ !
నాబ్రతుకుసంగతి ఏమి ?

―――

# మాతృభూమి

— శ్రీ ముదివర్తి కొండమాచార్యులు —

౧

బ్రహ్మతేజోఽమరధునీతీ
ర్థముల నాపోశనము గొనిన త్ర
యీవిశారదులైన మునులకు
కావలం బిదిరా.........

౨

పూతభాషోద్యానములలో
పుణ్యవాగమృతంబు చిందగ
భూరికావ్యసువర్ణసుమములు
పూచె విరివిగరా.........

౩

పుణ్యగంగాంభఃస్రవంతులు
పొంగిపొరలిన భూతలం బిది
సస్యలక్ష్మీవిలాసరేఖకు
స్థాన మయ్యెనురా.........

౪

దేశదేశమ్ములకు ప్రాకిన
దివ్యకీర్తిలతాలవాలుడు
బుద్ధదేవుడు జననమందిన
పుణ్యభూ మిదిరా.........

౫

పరమపాతివ్రత్యమహిమల
వరలు పుణ్యసతీమతల్లుల
పాదపద్మపరాగపటలికి
పదవి సుమ్మిదిరా.........

౬

అమరగాననదీమతల్లుల
నవని వెలయగ వెంటదెచ్చిన
త్యాగరాజభగీరథుల కిది
తావు సుమ్మిదిరా.........

౭

కటికరాతిమెడందజీవము
గ్రాలుచుండెడి యుగయుగమ్ముల
అతులశిల్పకళావిభూతికి
ఆటపట్టిదిరా.........

౮

పదును బాయని యుక్కుకత్తుల
పౌరుషము మిలుమిట్లుగొల్పిన
తెనుగువీరుల శౌర్యపటిమకు
మనికిపట్టిదిరా.........

౯

తెలుగుకవితాయువతి వలపులు
గులుకరించిన విజయనగరపు
తెలుగుదివిటీ వెలుగు బారిన
తెలుగుభూ మిదిరా.........

౧౦

ఈ యనంతపురాణభూమిలో
ఈ విశాలవిచిత్రసృష్టిలో
ధన్యజీవులు ఎందరో మును
తలలు దాచిరిరా.........

# కవితలో అతివాస్తవికత*



= శ్రీ పాలగుమ్మి పద్మరాజు =

క్రిందటి ప్రపంచమహాయుద్ధంలో ఎన్నో సాంప్రదాయాలు, ఆశయాలు, ఆశలు యూరపులో నశించిపోయాయి. లోకం పెద్ద స్మశానంలాగ కనిపించింది. అన్ని విలువలూ నశించిపోయాయి. ఈ అల్లకల్లోలానికంతకీ కారణమనుకున్న పెట్టుబడి విధానం నశించిపోలేదు సరిగదా, మరీ భయంకరంగా విజృంభించే సూచనలు జర్మనీలోనూ, ఇటలీలోనూ కనబడ్డాయి. ఆ పరిస్థితుల్లో 'డాడాయిజమ్' అనే ఒక కొత్త పోకడ కళలో ప్రారంభమయింది. ఆ పోకడ యొక్క ఆశయమల్లా ఒకటే. మామూలుగా అంతా మంచిగా పరిగణించే అన్ని విషయాలనూ అపహసించి వెక్కిరించడం; విచ్చలవిడిగా బాధ్యతలేకుండా సంచరించడం; నోటికి వచ్చినట్టు పాడితే కొత్త సంగీతం; చేతికి వచ్చినట్టు రాస్తే కొత్త కవిత్వం; ఇష్టం వచ్చినట్టు గీస్తే కొత్త చిత్రలేఖనం! ఈ ఉద్యమం అప్పటి ప్రపంచ పరిస్థితులమీద తిరుగుబాటుగా వచ్చింది. ౧౯౨౦-వ సంవత్సరంలో డాడాభక్తులంతా కలిసి పారిస్‌లో ఒక పెద్ద హోటల్లో ఒక ఉత్సవం చేశారు. అందులో ప్రదర్శించిన విషయాలు-చార్లీచాప్లిన్ ప్రత్యక్షంగా కనబడడం, "డాడా మగదా? ఆడదా?" అన్న విషయాన్ని గురించిన చర్చ మొదలయినవి. డాడాభక్తులు రంగస్థలంమీద ఒకరి జుట్టు ఒకరు పీక్కుంటారని కూడా ముందు తెలియబరిచారు. చివరికి ఉత్సవమంతా పెద్దగోలయిపోయింది. ఆ బూతుపాటలకీ, అసభ్యమయిన ఇతర ప్రదర్శనాలకీ ప్రేక్షకులు తట్టుకోలేకపోయారు. పెద్ద గందరగోళమయింది. కొట్టుకోడందాకా వెళ్ళింది. ఆ ప్రదర్శనంతో డాడాఇజం కొంచెం ఇంచుమించుగా చచ్చిపోయింది. అంతవరకూ అందులో ఉత్సాహంతో పనిచేసిన ఆండ్రేబిటన్ మొదలయినవారు ఈ ఉద్యమంతో తగాదా పెట్టుకుని లేచిపోయారు. ఈ ఉద్యమానికి సృష్టికర్త అయిన ట్రిస్టన్ జారా కొన్నాళ్లు పట్టుకు తంటాలుపడ్డా ఉద్యమంమాత్రం చచ్చిపోయింది.

'డాడాఇజం'ని అనుసరించి వచ్చింది అతివాస్తవికత. అతివాస్తవికులు తాము **'Modest registering machines'** అని చెప్పుకున్నారు. తాము ఊరికే తమ తార్కికశక్తిని కట్టిపెట్టి తటస్థులుగా ఉండి గుడ్డిగా యంత్రాల్లాగ రాసుకుంటూ పోతారు. ౧౯౨౪ లో వారు తమ ఆశయాలను ప్రకటించారు. అందులో ముఖ్యమయినవి: "మాది ఏ సాంప్రదాయాలతోటి నిమిత్తం లేని ఒక స్వచ్ఛందమైన పద్ధతి. వాస్తవికలోకాన్ని తిరిగి విచారణచేసే సందర్భంలో మా సాక్ష్యం ఏరకంగానూ పనిచెయ్యదు. మేము ఈ భూమిమీదే దేనితోనూ సంబంధంలేని ఒక స్థితిని పొందాలని ఆశిస్తున్నాము. అతివాస్తవికత అంటే అదొక కనబడని కాంతి. దాంతో మన శత్రువుల నందరినీ మనం జయించగలుగుతాం. ఈ వేసవిలో గులాబులు నీలంగా ఉన్నాయి. అరణ్యాలన్నీ గాజుతో చేసినట్టున్నాయి. భూమి ఆకుపచ్చని తొడుగు తొడుక్కున్నా నా కంత ఆకర్షకంగా కనబడ్డంలేదు. ఏదో దెయ్యంలాగ కనబడుతోంది. జీవం ఉండడం, లేకపోవడం అనేవి ఊరికే ఊహలు. అస్తిత్వమనేది ఎక్కడో అవల ఉంది."

ఈ ప్రకటనను విమర్శిస్తో లూయీ మేనిస్ అనే విమర్శకుడన్నాడు: "అస్తిత్వమనేది ఎక్కడో అవతల ఉంటే కళకూడా అవతలే ఉంది." అని.

ఇంక, అతివాస్తవికతకు పునాది మనస్తత్వశాస్త్రం. మన మనస్సులో అజ్ఞాతమయినదీ, తార్కికశక్తి లేనిదీ ఒక భాగముంది. దాన్ని

* ఆలిండియా రేడియో (మద్రాసు)వారి అనుమతిని.

మనశ్శాస్త్రపరిభాషలో 'ఇడ్' అని ఫ్రాయిడ్ పేరు పెట్టాడు. అందులో మనిషి చిన్నతనం నించీ ఒకదానికీ ఒకదానికీ సంబంధం లేని కోరికలు అణచిపెయ్యబడి గందరగోళంగా ఉంటాయి. అవి మనిషి చైతన్యంలోకి చొచ్చుకురావాలని యత్నిస్తాయి. కాని మన మనసులోనే ఇంకో భాగం మనం పెరిగి పెద్దవాళ్ళ మయినకొద్దీ పెరిగి పెద్దదవుతుంది. దాన్ని 'సూపర్ ఈగో' అంటారు. ఈభాగం బడిపంతులు వంటిది. సంఘంలోను, మనిషి చుట్టుపక్కల ఉన్న పరిసరాల్లోనూ బలమయిన కొన్ని కట్టుబాట్లు మొద లయినవాటి సారం ఈ 'సూపర్ ఈగో'లో ఇమిడి ఉంటుంది. 'ఇడ్' లోనించి పైకి పొడుచుకు రావాలని చూసే కోరికలను 'సూపర్ ఈగో' పరీక్షించి అవి అసంబద్ధ మయిన వని తోస్తే మన చైతన్యంలోకి రాకుండా తొక్కి వేస్తుంది. కాని ఆ కోరికలు బాగా బలమయినవయితే అవి పైకి వ్యక్తమయి తీరతాయి. మామూలు మనిషిలో ఈ కోరికలు స్వప్నాలలో సాఫల్యతను కోరతాయని ఫ్రాయిడ్ అంటాడు. మనోబలం తగ్గిన సందర్భాల్లో-అంటే, తాగి స్పృహ తప్పినప్పుడు, పిచ్చి ఎక్కినప్పుడు, మూర్ఛలోనూ- అవి స్ఫుటంగా వ్యక్తమవుతాయి. అతివాస్తవికుల ఆశయం ఏమంటే, తమ తార్కిక శక్తిని నిద్రబుచ్చి ఈ తెరల వెనక మరుగుపడిఉన్న మనోభాగాన్ని చూస్తూ, అక్కడ తాము చూసిన విషయాలను ఆ భాషలోనే చిత్రించాలని. మొత్తంమీద ఇది కవితా సాంప్రదాయం మీద తిరుగుబాటు. ఏ పరిభాషా లేక పోవడమే అతివాస్తవిక పరిభాష. సాంప్రదాయం కొన్ని రకాల అనుబంధాలను తప్పనిసరిగా చేస్తుంది. కవితాసాంప్రదాయంలో అలంకారాలు, ఛందస్సు, భావచిత్రణ, పదమైత్రి అన్నీ ఒకరకమయిన బలవంతాన్ని రచయితమీద పెడతాయి. అంచేత ఆ రచనలలో ప్రత్యేకాంగాలకి స్వచ్ఛంద మయిన అనుబంధం ఉండదు. మాట వెనకాల మాట, ఊహ తరవాత ఊహ స్వచ్ఛందంగా రావు. తార్కికశక్తియొక్క బలవంతం ప్రతి మాటమీదా ఉంటుంది. ఈ బలవంతాన్ని అతివాస్తవికత తొలగిస్తుందని వారి వాదం. అతివాస్తవిక రచనలలో మాటకీ మాటకీ స్వచ్ఛంద మయిన అనుబంధమే ఉంటుంది. మామూలు భాషలో చెపితే, మాటకీ మాటకీ అర్థంద్వారా సంబంధం ఉండదు.

ఈ వాదానికి రెండు పెద్ద అభ్యంతరా లున్నాయి. ఒకటి ఏ రచయితయినా తన తార్కిక శక్తిని పూర్తిగా తొలగించి చూడగలుగుతాడా? తర్కానికి నిలబడే ఊహ— అంటే పూర్తిగా అర్థమున్నది— ఏదన్నా అతనికి స్ఫురించినప్పుడు దాన్ని చటుకుని అణిచివెయ్యడమో, లేక వికృతం చేసి చెప్పడమో జరుగుతుంది. లూయీ మేనీసు అన్నట్టు "వీరికి ఛందస్సు లేదు. వీరి పరిభాష అంతా మనశ్శాస్త్రంలోది. వీరు ఉపయోగించిన వస్తువులు వేటికి సాంకేతికంగా ఉపయోగించబడ్డాయో ఆ శాస్త్ర పుస్తకాలు చదివితే తెలుస్తుంది. కాని ఇవన్నీ కొన్ని వస్తువులకీ, ఊహలకీ సాంకేతికాలని రచయిత గనక తెలుసుకున్నట్టయితే, ఆ అజ్ఞాతమనస్సు ఇంకా లోపలికి ముడుచుకుపోయి అతనికి అసలు కనబడకుండా పోవచ్చు. అంచేత ఆ మనస్సులోదంతా వ్యక్తం కావాలంటే మనం దాని మీద దృష్టిని కేంద్రీకరించడంకంటే ఇంకోవస్తువుమీదకి దృష్టిని మార్చుకుని ఆ అజ్ఞాతమనస్సుకి పైకి రావడానికి సావకాశం ఇవ్వాలి."

రెండో అభ్యంతరం క్రిస్టోఫర్ కాడ్‌వెల్ మాటల్లో చెప్పడం మంచిది. "అజ్ఞాతమయిన మనస్సుకి స్వచ్ఛందమయిన అనుబంధా లుంటాయనుకోడం పొరపాటు. ఫ్రాయిడ్, యుంగ్ మొదలైన మనశ్శాస్త్రవేత్తలు కనుక్కున్న దాన్నిబట్టి, భాషయొక్క అనుబంధాలమీద అజ్ఞాతమనస్సు ఎక్కువ బలవంతాన్ని పెడుతుంది. మామూలు సాంప్రదాయంకంటే ఆ బలవంతం చాలా ఎక్కువయినది."

అతివాస్తవికత ఒక తిరుగుబాటు అని అన్నాను. అది నాస్తికమయిన తిరుగుబాటు. అన్నీ శూన్యంలో ఆఖరవుతాయి. చివరకి అతివాస్తవికతకూడా శూన్యంలోనే ఆఖరవుతుంది. అతివాస్తవికత ఈయుగంలోని తార్కికపద్ధతికి ఫలిత మన్నాడు. జి. ఎస్. ఫ్రాజర్ ఇంకా అన్నాడు. ఇది ఒక విప్లవమేగాని ఇది నాశానికి దారితీసే విప్లవం. అతివాస్తవికుల దృష్టిలో ఈ

సంఘవ్యవస్థ ఒక యంత్రంలాగ అంతిమదశకు లాక్కుపోతుంది. ఆదశలో వైజ్ఞానికులే ఆలోచిస్తారు. సామాన్యమానవులకు ఆలోచించే అవసరమూ, సావకాశమూ కూడా ఉండవు. అప్పుడు మనిషి కేవలయంత్రమయిపోతాడు.

తెలుగుదేశంలోని అతివాస్తవికులకు ఇటీవల 'ఇన్‌స్పిరేషన్' అయిన జార్జస్‌హగ్నెట్ రచన కొకదానికి తర్జుమాకి తర్జుమా ఒకటి ఉదహరిస్తాను:

"అసలు నీ ముఖం లేదు
నా ప్రేమకు బాగా మెరుగుపెట్టారు
సముద్రం దూరదూరతీరాలను
రహస్యంగా ప్రశ్నించింది
చేతనయినంతవరకూ అనుక్షణమూ జీవితప్రతి
బింబాన్ని అద్దంలో చూస్తుండడం
జీవించడం కాదు
రెక్కలున్న చీమ నాచెవి
కన్నీళ్లు బిన్నగాళ్లు, అవి సరస్సుల్లోకి జారిపోతాయి
గది ఎండు కుండంటే దాన్ని వదిలిపోవాలిగనక"

ఈ పద్యానికి అర్థం ఏమిటని అడిగితే కవే చెప్పలేడు. ఇది అజ్ఞాతమనస్సు ఉపయోగించే పరిభాష. ఆ పరిభాష మనం నేర్చుకుని ఇందులో ప్రతీ మాటనీ పరీక్షించి అసలు ఊహ ఏమిటో మనమే కవికి చెప్పాలి. ఈ పరిభాషంతా మనశ్శాస్త్రపుస్తకాల్లో మనకు దొరుకుతుంది. ఇది మన మెదడుకి తెలిసే భాష కాదు. మెదడుకి సహజమైన తార్కికపద్ధతి ఇందులో లేదు. కాని దీన్ని అర్థంచేసుకునే తత్వమేదో మనలో ఉండేఉంటుందని అతివాస్తవికుల అభిప్రాయం.

డైలన్‌థామస్‌వంటి కొంతమంది అతివాస్తవికుల రచనలలో మామూలుగా అసభ్య మనుకునే విషయాలు ఒక చిన్న ఆచ్ఛాదనకిందనుంచి తొంగిచూస్తాయి. నా అనుమానమేమంటే వారు అసభ్యవిషయాలనుగురించే రాయాలని ముందు నిశ్చయించుకుంటారని, అవి మామూలుభాషలో చెప్పలేక కొద్దిగా మరుగుపరిచి చెపుతారని నాకు తోస్తుంది. ఆ మరుగుపరచడంకూడా వారు పూర్తిగా చెయ్యరు. వారు ఎవరిమీదో కసితీర్చుకోడానికి రాస్తున్నారా అనిపిస్తుంది.

ఈ అసభ్యతనుగురించి కవికి పూర్తిగా తెలుసనిపిస్తుంది. అటువంటి రచన స్వచ్ఛందంగా కాక ఒక బలవంతంతో రూపం దాల్చినట్టు అనిపిస్తుంది. ఇవి వింతగానూ, విచిత్రంగానూమాత్రం ఉంటాయి.

అతివాస్తవికపద్ధతిని ఉత్తమపద్ధతిలో ఉపయోగించిన రచయిత జేమ్స్ జాయిస్ అని నా నమ్మకం. కాని అతని పద్ధతి కేవలమూ అతివాస్తవికపద్ధతి కాదు. అతని పద్ధతిలో ఒక పరిపూర్ణత ఉంది. అతను మనసులోని తార్కికపద్ధతిని వదలివెయ్యడు. మనస్సులో సచేతనమయిన భాగం మొదలుకొని వెనక్కిపోయిన కొద్దీ అంతకంతకి అస్పష్టమయిపోతున్న పొరలు స్మృతిలో అనేకం ఉంటాయి. వీటి నన్నిటినీ అతడు నిర్దుష్టంగా చిత్రిస్తాడు. అతనికి తను రాస్తున్న విషయాలు అసభ్యమయినవా - సభ్యమయినవా, అందమయినవా - వికృతమయినవా అన్న చింత లేదు. అతని నిర్లిప్తత అద్భుతమయినది; నిశితమయినది.

భాష మెదడు నిర్మించింది. అంచేత ఏరచనయినా మెదడులోంచే లోపలికి ప్రవేశిస్తుంది. వెనక ఎంత గంభీరమయిన, అగమ్యమయిన లోతులున్నా పైపొరమాత్రం స్పష్టంగానే ఉండి తీరాలి. జేమ్స్‌జాయిస్‌పద్ధతి మామూలుభాషకీ, దానికి సంబంధించిన తర్కానికీ వ్యతిరేకమయినది కాదు. అతను దేన్నిగురించి చెపుతున్నాడో ఆవిషయం అతనికి పూర్తిగా తెలుసును. అంచేత అతని రచనలు మనకి పూర్తిగా అర్థమవుతాయి. అతని పద్ధతి ఉత్తమమయిన ఒక కొత్త పద్ధతి.

పాల్ ఇలార్డ్ అతివాస్తవికులకు ఒకరకంగా గురువువంటివాడు. అతని రచనలలో భావచిత్రాలు విచిత్రంగా కదులుతూ కర్రబొమ్మల్లాగ నడిచిపోతాయి. అతనికి పదజాలంమీద మంచి అధికారం ఉంది.

తెలుగుదేశంలో అతివాస్తవికత ఒక ఉద్యమంగా బయలుదేరినా అతివాస్తవికరచనలని చెప్పుకోదగ్గవి ఏమీ కనబడవు. శ్రీశ్రీ ఇటీవల రాస్తున్న పద్యాలూ, కథలూ ఎంతవరకు అతివాస్తవికరచనలో

ఆయనకే అనుమాన మని నే ననుకుంటాను. ఎంత స్వచ్ఛందంగా ఉన్నట్టు నటించినా ఆయన కొన్ని గట్టి బలవంతాలలో కట్టుబడిఉన్నట్టు నాకు అనిపిస్తుంది. కవిత ఎల్లా ఉండాలో రాస్తూ ఆయన అంటారు - "పైన చెప్పిన దంతా వెర్రికాదు, సర్రియలిజ"మని. ఇందులో వెర్రిమీద మళ్లీ ఆయన కొక వ్యతిరేకభావం. నిజానికి వెర్రికంటే సర్రియలిజం ఇంకోటి ఉండదు. అసలయిన అతివాస్తవికత మనకు కావాలంటే వెర్రివాళ్లదగ్గరకో, తాగినవాళ్ల దగ్గరకో వెళ్లాలి. వాళ్లలోనే అజ్ఞాతమనస్సు స్వచ్ఛందంగా మాట్లాడుతుంది.

"కాకి కేమి తెలుసు సైకోఅనాలిసిస్,
ఆటవెలది ద్విపద కర్తగారు,
౫, ౩౭ ఆముక్తమాల్యద"

తరవాత

"భుజంగప్రయాతం భుభుక్షాభిఘాతం
చలంగారి పాపం ప్రజామిత్రకోపం
జరుక్ నాథ జాంబక్ మిణేశాస్త్రి హంబక్
లతాంతార్ధ్రి రాగంబులం బాడిలంగా..."

వీటిలో ఛందస్సుకి సంబంధించిన స్ఫూర్తి కవికి పూర్తిగా ఉంది. మాటలు ఒకదాని వెనక ఒకటి వాటంతట అవి వచ్చినట్టు కనబడ్డా వాటిలో ఏరు కోడం ఉండితీరింది.

"కబీరుమ త్రాగిన రోమనారకై"అని ఆయన ఎంత నిర్లిప్తతతో వ్రాసినట్టు నటించినా, ఆయన హాస్యంకోసం పద్యాన్ని ఉద్దేశించినట్టు తెలిసి పోతోంది. ఆ హాస్యమే ఆయనకు తెలియకుండా అజ్ఞాతంగా ఆయనలో ఉన్నట్టయితే అది ఎంత ఎక్కువ బలవంతమయినది. ఈ క్రిందిపద్యాన్ని విన్న తరవాత ఇది నిజంగా అతివాస్తవికమా అని ప్రశ్న అందరికీ వస్తుంది.

"మ్రింగి తిమింగిలంగిల త
మిస్రగుహాంతర మీనమేష పా
రంగతులైన జొంగరము
లార, ఎరింగిన చెల్వుడీ వరి
వ్యంగము పాడు టెందుకు? వి
పంచికి కంచికి దూర మెంత వ
డ్రంగులు రంగులా గులక
రాళ్లగు మా గుడిలోని లింగముల్."

ఇల్లాంటి వేళాకోళపు పద్యాలు అనేకం ఇది వరకే వ్రాయబడి ఉన్నాయి. ఇంకా అనేకం రాయ వచ్చు. అది అసలు అజ్ఞాతమనస్సుభావంలాగ కనబడదు. తెలిసుండి వికృతంగా వ్రాసినట్టు అనిపిస్తుంది.

ఇంక శ్రీ నారాయణబాబుగారు అతివాస్తవికత అనే ముద్ర తామే వేసి కొన్ని రచనలను ప్రచు రిస్తున్నారు. కాని నాకు వాటిలో అతివాస్తవికత ఏమీ కనిపించలేదు. కొంత వక్రంగా చెప్పినా ఆయన దేన్ని గురించో స్పష్టంగా అనుకునే చెపుతున్నారని నా అనుమానం. "దరిద్ర సంగీతానికి ధూమ్యాకాశాలే తాళం చిప్పలు", "ఆకలితో ఉన్న బిచ్చగాడికి వంటింట్లో ఉల్లిపాయి వేయించిన వాసనతెగులవం", "రూపాయి చంద్రుడిలాగ అందకుండా పోవడం" మొదలయిన వన్నీ చూస్తే ఆయనకు సామ్యవాదం అభిమాన సిద్ధాంతమేమో ననిపిస్తుంది. అంత స్పష్ట మయిన సిద్ధాంతానికి ఆయన రచనలలో తావు ఇవ్వడం బట్టి ఆయన 'అతివాస్తవిక' కంటె 'అభ్యుదయ' రచయిత ఏమో నని నా అనుమానం.

మొత్తంమీద అతివాస్తవిక మని చెప్పుకోతగ్గ రచన ఏదీ తెలుగులో రాలేదని నా నమ్మకం. ఈ ఉద్యమానికి ఫలితంగా ఏ యూలిసెస్‌లాంటి బల మయిన రచన అయినా వస్తే తప్ప ఉద్యమానికి అర్థం లేదు. శ్రీశ్రీగారికి పదాలమీద అధికారం ఉంది; సహజమయిన ధోరణి ఒకటే ఉంది. ఆయన వ్రాయ బోయే రచనలతో ఈ ఉద్యమం ఫలోన్ముఖం అవుతుందని ఆశిస్తున్నాను. కాని బాధ్యతలన్నీ వదులుకుని విచ్చలవిడిగా ఇష్టంవచ్చినట్టు వ్రాయడం అతివాస్తవికతకుకూడా ప్రయోజనం లేదనీ, నిజమయిన దీక్ష, పట్టుదల, లోకంలోని అన్ని మనస్సులనూ విశ్లేషించగల తీక్ష్ణమయిన బుద్ధి అలవరుచుకుంటేగాని సరియయిన రచన రావడానికి సావకాశం లేదనీ నా హెచ్చరిక.

---

# శ్రీనాథుఁడు - కర్ణాటభాష



= శ్రీ బులుసు వేంకటరమణయ్య =

కవిసార్వభౌముఁ డగు శ్రీనాథుఁడు కొండవీటి రెడ్డిరాజుల ప్రాపున మహాభోగముల ననుభవించినాఁడు; విద్యాధికారి యైనాఁడు; అనేకుల కగ్రహారాది సమ్మానములు చేయించినాఁడు; కవితాసామ్రాజ్యసింహాసనాసీనుఁడై 'కడిమీఁదచేయు నశనము' నను, కామ్యభోగములను కల ధనమునెల్ల కర్చు చేసినాఁడు. అతనికి వెనుకచూపే లేదు.

కాల మొక్కరీతి నుండదు. కొండవీటిరాజ్యము విప్లవములపా లయ్యెను. కవిసార్వభౌముఁడు కర్చు వెచ్చములకయి ధనము నార్జింపవలసివచ్చినది. విద్యావయోవినోదము లతనిని దేశాటనమునకు ప్రేరేచినవి. పదేండ్లపా టతఁడు పడమటిసీమను, దక్షిణదేశమునను దిరుగుచు తన కవిత్వమువలన పండిత, పామరుల మెప్పును గాంచుచుండెను. ఆ సమయమున నాతఁడు చెప్పిన చాటువులే యప్పటి దేశచరిత్రమును, జనుల జీవితమును, నడువడిని తెలిసికొనుట కాధారము లగుచున్నవి. ఈకాలమున తగిన యాశ్రయము లభింపనందున కవిసార్వభౌమునికి గ్రంథరచన కవకాశము లేకపోయినది.

రాజమహేంద్రవరప్రభువు లగు రెడ్డిరాజుల యాశ్రయము దొరకువఱకును శ్రీనాథుఁ డొక్కచోట కాలూని నిలువనేలేదని చెప్పవచ్చును. శ్రీనాథునికి బాంధవుఁడును, మంత్రియు నగు బెండపూఁడి యన్నామాత్యుని మూలమున రాజాశ్రయము లభించినది. ఆయాశ్రయబలమే కవిసార్వభౌమునిచే భీమఖండ, కాశీఖండాద్యుద్గ్రంథములను చెప్పించినది.

కొండవీటి రెడ్డిరాజులవలె రాజమహేంద్రవరపు రెడ్డిరాజులును విద్యాపక్షపాతులు. వారి యాశ్రయమునను సంస్కృతాంధ్రములు సమానమగు మర్యాదతో తులతూఁగినవి. వివిధశాస్త్రపారంగతులగు విద్వాంసులును, సరసకవితాధురంధరులగు సత్కవులును రాజమహేంద్రరాజసభ నలంకరించియుండిరి. వా రంతకుమున్నె శ్రీనాథుని కవిత్వమును, పాండిత్యమును, వానివలన నాతనికిఁ గలిగిన లోకోత్తర గౌరవములను బాగుగ నెఱిఁగిరి. నాఁటినుండి నేఁటివఱకును పండిత కవిలోకమునకుఁ బరిపాటియైన పరోత్కర్షాసహిష్ణుతకు వారుమాత్రము నతీతు లౌదు రెట్లు? ఇంతియ కాదు. అట్టి మహామహుఁడు రాజమహేంద్రవరమునఁ గాలుపెట్టినచో తమ కోట మన్నుపడునని వారు తహతహపడిరి! శ్రీనాథుని కవితాప్రౌఢిమను చూపోపక "ఇది సంస్కృతము; తెలుఁగు కానేకా"దని ఈసడించిరి! జానుతెలుఁగు పదముల సొంపుకూర్పును గని "ఇది అచ్చతెలుఁ"గని అధిక్షేపించిరి!! "అచ్చతెలుఁగన్న అంత నీరసమా?" అని అందురేమో! ఆకాలమున అచ్చతెలుఁగున కట్టి గతియే పట్టినది. నేఁటి కాలమున ఆంగ్ల మాక్రమించు కొన్న స్థానము నాఁటికాలమున సంస్కృతము కైవసము చేసికొన్నది. ఆంధ్ర మన్న నాఁటికిని నేఁటికిని కూడ ఈసడింపే!!

రాజమహేంద్రవిద్వాంసు లంతతోఁ బోలేదు. పాండిత్యవిమర్శ నటుంచి వారు వ్యక్తిగతదోషములను పరిగణింప మొదలిడిరి. కాని ప్రయోజనము లేకపోయినది. అన్ని విధములను శ్రీనాథుఁడు వారికి "కొఱకరాని కొయ్య" యయ్యెను. తార్కికులపైని, సోమయాజులపయిని అతఁడు చెప్పిన పద్యములు ఈయంశములను విశదముచేయుచున్నవి. ఆపద్యముల లోని సమాధానములు ప్రతిపక్షులు నాఁటికిని, నేఁటికిని గూడ తలలెత్తకుండునట్లు చేసినవి!!

ఇక—

కవిసార్వభౌముఁడు తన పాండిత్యమును

విమర్శించువారి కొక ఘాటయిన సమాధానము నీయ వలసియున్నది. ఆసమాధానము నతఁడు భీమేశ్వర పురాణమున కుకవినిందా సందర్భమున ఇచ్చియున్నాఁడు. ఆ గ్రంథము శ్రీనాథుఁడు రాజమహేంద్రవరమునకు వచ్చినపిదప వ్రాయఁబడిన మొదటి గ్రంథ మనియు, అన్నామాత్యాంకిత మనియు విద్వజ్జనవిదితము.

ఆసమాధాన మిది (భీమఖండము, ౧:౧౩-౧౫):

"బోధ మల్పంబు; గర్వ మభ్యున్నతంబు;
కాంతి నిష్పచ్చరంబు; మచ్చరము ఘనము;
కూపమండూకములఁబోలెఁ గొంచె మెఱిఁగి
పండితంమన్యులైన వైతండికులకు.

నికటమున నుండి శ్రుతిపుటనిష్ఠురముగ
వడవికాకులు బిట్టు పెద్దఱచినప్పు
డుడిగి రాయంచ యూరకయుంట లెస్స;
సైఁపరాకున్న నెందేని జనుట యొప్పు.

ప్రౌఢిఁ బలికింప సంస్కృతభాష యండ్రు;
పలుకునుడికారమున నాంధ్రభాష యండ్రు
ఎవ్వ రేమన్న నండ్రుగా, కేల కొఱఁతె
నాకవిత్వమ్ము నిజము కర్ణాటభాష."

ఇందుఁ జివఱిపద్యమే ప్రధానము; వివాదగ్రస్తము నదియే. "నా ప్రౌఢకవిత్వము సంస్కృతము కాని తెలుఁగే కాదని కొంద అందురు; జాను తెలుఁగున కవిత్వమును చెప్పినచో అది అచ్చ (చచ్చు) తెలుఁ గని వేఱొకకొందఱు వాకొందురు. ఎవ్వరి యిష్టముచొప్పున వారి ననుకొననిండు. నాకవిత్వము సంస్కృతమును గాదు; తెలుఁగును కాదు; మఱి కర్ణాటము" అని కవిసార్వభౌముఁడు కుకవి, పండితంమన్యుల వాక్కులకు రోతపడి చెప్పెనని, యింతవఱకును వివరించిన విషయములనుబట్టి తేఁటపడుచున్నది.

'నాకవిత్వము నిజము కర్ణాటభాష' అనునది అధిక్షేపసూచకముకాని యథార్థవిషయబోధకము కాఁజాలదు.

కవిసార్వభౌముఁ డిట్లీయంశమును తెల్లము చేయుచు ధ్వనిరూపముగ అర్థాంతరమును బోధించుచున్నాఁడు. ఆఅర్థ మిది :

"ఓమూఢులారా! మీ రనుకొనినట్లు నాకవిత్వము సంస్కృతమే కానిండు; లేదా చప్పని తెలుఁగే కానిండు. దట్టిదయినను సరే: నాకవిత్వము (కర్ణ + అట) కర్ణసమీపమునఁ జరించు - అనఁగా శ్రవణానందకరమగు భాషయేసుఁడీ!"

ఇంకను ఇచట అర్థాంతరము స్ఫురించుచున్నది. "ఓమూర్ఖులారా! నాకవిత్వమున సంస్కృతాంధ్రపదములుమాత్రమే యున్నవని మీరు తెలిసికొనఁగలిగిరి. అంతే కాదు — కన్నడపదములును, తత్సంప్రదాయములును లెక్కకు మిక్కిలిగఁ గలవు"

పయి రెండు వ్యంగ్యార్థములను శ్రీనాథుని కవిసార్వభౌమతను వ్యక్తపఱచుచున్నవి.

'ప్రౌఢిఁబలికింప—' అను పద్యమున కీయర్థములే సరిపడునని తోఁచుచున్నది.

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిులుగారు తమ శృంగారనైషధపీఠికలో "'నాకవిత్వంబు నిజము కర్ణాట భాష' అని చెప్పుకొనుటం జూడఁగా ఇతఁడు ఆంధ్ర సంస్కృతశబ్దమిశ్రణమునందును, లాఁతిమెఱుఁగుల యందును కర్ణాటభాషాకావ్యమర్యాదల ననుసరించెనని తోఁచుచున్నది" అని వ్రాయుచు ప్రధానమగు వ్యంగ్యార్థము సంగతిని విడిచిపెట్టిరి.

శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు తమ పల్నాటి వీరచరిత్రభూమికలో "'నాకవిత్వము నిజము కర్ణాటభాష' అన్నవాక్య మితనికిఁ గర్ణాటభాష యందుఁ గల ప్రేమను సూచించుచున్నది" అని చెప్పి ప్రధానాంశమును జాఱవిడిచిరి.

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు వృషచైత్ర మాసభారతిసంచికలో ఈ పద్యమును విమర్శించుచు "ప్రౌఢిమలో సంస్కృతభాషవలెను, నుడికారమునం దాంధ్రభాషవలెను గనపడి, ఎవ్వ రేభాష యని చెప్పినా, నేను చెప్పిన కవిత్వము కర్ణాటభాషలోనే సుమీ!" అనునది పద్య 'తాత్పర్య' మని వివరించినారు.

అంతేకాక వారు తమ వ్యాసమున ఎడనెడ నీ క్రిందిరీతిని చెప్పియున్నారు: "భీమఖండములో మనము చర్చించు పద్యమునందు ఆంధ్రభాష, కర్ణాటభాష

భయాసార్థకము లగునట్లు చెప్పిన విషయము చూడఁగా నిచ్చట 'కర్ణాట' శబ్దమునకు కవి వేరొకయర్థమును స్ఫురింపఁజేయుచున్నట్లు తోఁచెడిని"

"ఆంధ్రలాక్షణికులు కర్ణాటశబ్దమును శకంధ్వాదిగణములోఁ జేర్చి, నిత్యసమాసవిశ్రాంతులలోఁ నీ శబ్దము నుదాహరించినారు. . . మనము చర్చించు పద్య చరణములోఁ కర్ణాటశబ్దము యతిగూర్చిన విధానము చూచినయెడల కర్ణాటశబ్దమును రెండుపదములుగా నేర్పాటుచేయవచ్చును."

'కర్ + నాట' అని కర్ణాటశబ్దము రెండుపదము లగును.'

"ఆంధ్రదేశములోఁ బ్రాగుదీచీ, ప్రాగ్దక్షిణఖండమగు ఆంధ్రకర్ణాట (కర్ + నాట=కర్నాట; కర్ణాట) మండలములోని ఆంధ్రభాషలోనే నేను కవిత్వము చెప్పితిని. ప్రౌఢిలో సంస్కృతభాషాకవిత్వము నను సరించితిని" "అని యీపద్యమునకు తాత్పర్యము."

"కర్ణాటభాషాసంప్రదాయములు శ్రీనాథుని యాంధ్రకవిత్వమునం దేమియు లేవు"

ఈ వాదముల యౌచిత్య మిఁక విమర్శింపఁబడును.

ఇదివఱకు వివరింపఁబడిన విషయమునుబట్టి 'కర్ణాటభాష' యను పదము శ్రీనాథునకుఁ గల కర్ణాటభాషాభిమానమును సూచించుచున్న దను ఉమాకాంతముగారి అభిప్రాయము నిరస్తమయినది.

'నాకవిత్వము నిజము కర్ణాటభాష' యనుగీత చరణములోని 'కర్ణాటభాష' పదమును శ్రీనాథుఁడు ఆంధ్రదేశాంతర్భాగమైన కర్ + నాట = నల్లనినాడు, అనఁగా ప్రాగుదీచీ, ప్రాగ్దక్షిణాంధ్రదేశపు భాష యను నర్థమునందే ప్రయోగించినాఁడు అను శ్రీ ఈశ్వరదత్తుగారి వాదముకూడ యుక్తిసహము కాదు.

ఏలయన—

శ్రీ ఈశ్వరదత్తుగారి యర్థమునుబట్టి—వా రనుకొనిన తెలుఁగునాడు 'కర్నాడు' కావలసియున్నది; అచ్చటి భాష 'కర్నాటిభాష' కావలెను. 'కర్ణాటభాష' కాఁజాలదు.

ఒకవేళ కర్నాడే కాలక్రమమున 'కర్ణాట' అయిన దనియు, అచటి భాష 'కర్ణాటభాష' అయిన దనియు ఒప్పుకొంద మనుకొందము. అప్పుడును పయి యర్థము పొసఁగదు.

శ్రీ ఈశ్వరదత్తుగారు కర్ణాటభాష యనఁగా ఆంధ్రభాషయే యని యర్థము చెప్పిరిగదా! ఇట్టి యెడ "నాభాష సంస్కృతముకాదు; ఆంధ్రము కాదు; మఱి ఆంధ్రమే అగును" అని యర్థము సిద్ధించుచున్నదే! శ్రీనాథుఁ డీయర్థమునే మనస్సున నుంచికొని, యిట్లు చెప్పెనని వచింపనగునా?

'కర్ణాట'పదమును 'కర్ + నాట' అను రీతిని రెండు పదములుగా విడఁదీయవచ్చుననుటకు శ్రీ ఈశ్వరదత్తుగారు నిత్యసమాసవిశ్రాంతిఘట్టము నుదాహరించుట సరికాదు. 'కర్ణ + అట' అను పదవిభాగమునసే నిత్యసమాసయతికి వలను కలుగును.

'కర్ + నాట' అను విభాగమున నిత్యసమాస యతికిఁ బ్రసక్తియే లేదు. సంయుతాక్షరయతియే అచట గ్రాహ్యము.

నిత్యసమాసయతిప్రశంస శ్రీ ఈశ్వరదత్తుగారి వాదమునకు ప్రతికూలముకూడను.

"కర్ణాటభాషా సంప్రదాయములు శ్రీనాథుని యాంధ్రకవిత్వమునం దేమియు లే"వని చెప్పవలను పడదు. శ్రీ వేంకటరాయశాస్త్రులువారు చెప్పినట్లు అందాసంప్రదాయములును కనఁబడుచున్నవి. ఆంధ్ర, కర్ణాట భాషలు అప్పుసెల్లిం డ్రనుటచే పలుకు నుడి కారమున పరస్పరము సాహాయ్యము నపేక్షించుట సహజము.

శ్రీనాథుని కర్ణాటక సంప్రదాయములు మచ్చునకుఁ గొన్ని:—

i. క్రీడాభిరామమునుండి—

౧. "బతి చెడి సంచరించెదవు
ప్రాఁబడి పోయెనె నీ వివేకమున్"

'బతిచెడి' యనఁగా 'వ్రతము చెడి' అని యర్థము. ఈ పదము శబ్దరత్నాకరములోఁ కనఁబడదు,

కిట్టెలు కన్నడ-ఇంగ్లీషు నిఘంటువులో ఈ వ్రతము అను నర్థము కల 'బతె' అను పదమున్నది. అది వ్రతశబ్దభవ మనియు అందు చెప్పఁబడినది.

౨. వంకదార.

కోటవాకిలి ముందలి వంకదారి వంకదార యని శబ్దరత్నాకరము. 'వంకదర' అనునది దీనికి సరియగు కర్ణాటపదము. అది వక్రద్వార శబ్దభవమని కిట్టెలు నిఘంటువు.

ii. హరవిలాసమునుండి—

౩. "వస్త్రములు శైలమునఁ దోఁచి" (౨-౩౧)

తోఁచు=ముంచు.

కన్నడ- తో=**To wet, to moisten.**

౪. "బొక్కణములోన నున్న
విభూతి నిచ్చి." (౨-౪౯)

బొక్కణము=సంచి.

శబ్దరత్నాకరమున ఈ పదమునకు 'విబూది సంచి' అను నర్థ మీయఁబడినది. అది సరికాదు. 'బూది బొక్కణమె?' అను సచటి ఉదాహరణమే ఈ యంశమును తెలుపుచున్నది.

కన్నడ- బొక్కణ=**A beggar's bag.**

iii. భీమఖండమునుండి—

౫. "పదియాఱు వన్నె కుందనంపుఁ దగడు" (౨-౫౫)

తగడు=బంగారులోనగువాని రేకని శ. ర.

కన్నడ– తగడు = **Metal beaten into a plate; A plate piece or sheet of metal.**

౬. "ఆ, కాశనదీప్రవాహమునఁ
గాయము దొప్పనఁ( గ? )దోఁగి."

దొప్పనఁ దోఁగుట యనఁగా దభాలున పడునట్లు మునుఁగుట.

కన్నడ – దొప్పన = **A sound imitating that of a heavy body suddenly falling or knocking against anything.**

మఱి కొన్ని పదములు—

౧. తె. దువాళి.

క. దువ్వాళి = **Rapid course; A run, a gallop.**

౨. తె. అక్కళించు.

క. అక్కడిసు=**To become small**

క. అక్కళిసు=**The muscles of the belly to be drawn in, or contracted on account of hunger etc.**

పయి యంశములను బట్టి చూచినచో శ్రీనాథుఁడు చెప్పిన 'కర్ణాటభాష' కీ క్రింది యర్థములను గ్రహింపవలసియున్నది:

i. 'నాభాష తెలుఁగును గాదు; సంస్కృతమును గాదు; కర్ణాట భాష.'

అను నది శ్లేషపూర్వక మగు వాచ్యార్థము.

ii. 'మీ రెట్లనుకొనిన నేమి? నాభాష యందఱికిని కర్ణామృత మగునది'

అనునది వ్యంగ్య మగు నర్థము.

iii. 'నాభాష కర్ణాటక భాషా సంప్రదాయములతోఁ గూడ కూడినది.'

అనునది అర్థాంతరము.

# శాకుంతల విమర్శనము

## నిర్మాణ శిల్పము



= శ్రీ నండూరి బంగారయ్య =

కావ్యమునకు వట్టవలసిన ఉత్తమలక్షణములలో నిర్మాణశిల్ప మొకటి. కావ్యవస్తువును ప్రపంచించు చాతుర్యమును నిర్మాణశిల్ప మనుట యుక్తము. కళాభిజ్ఞని నిరూపించుటకు జాలిన ప్రత్యేకసాధనములలో నిది మేలైనది. కళాభిజ్ఞుడుకాని కవి తన కావ్యమున ఆస్వాదనయోగ్యమైన భావముల నెన్నింటినో గుప్పించునుగాని చక్కని నిర్మాణశిల్పమునుమాత్రము ప్రదర్శింపజాలడు.

### శ్రవ్యప్రబంధములలో నిర్మాణశిల్పము అనావశ్యకమా?

కొందరి మతము పూర్వాలంకారికులు నాటకములకు మాత్రమే ఆకృతిసౌష్ఠవమును నిర్ణయించిరిగాని శ్రవ్యకావ్యములకు నిర్ణయింపలేదుగావున వానిలో నిర్మాణశిల్ప మున్నను లేకపోయినను ఇబ్బంది లేదని. కాని యీవాదము సరియైనది కాదు. పూర్వాలంకారికుల యాత్మకాంతికయి కళాస్రష్ట కావ్యమును నిర్మించుట లేదు. నిజముగా నాతనిలో నిర్మాణకౌశల మున్ననాడు అది యాతని రచనలో-దృశ్యమే కానిండు, శ్రవ్యమే కానిండు దేనిలోనైనను - ప్రత్యక్షము కాకమానదు. ఎంత చిన్నగీతము వ్రాసినను "దాని నెట్లు మొదలుపెట్టవలెను? ఎట్లు పెంచవలెను? తుదకు ఎట్లు ముగించవలెను? ప్రస్తరింపదలచిన భావములు 'శీర్షమునకు శీర్షము; ప్రసాదమునకు ప్రసాదము'గా నుండకుండ అన్యోన్యాశ్రయములయి జడయల్లికగ నుండునట్లు చేయుట యెట్లు?" అను నిట్టి ప్రశ్నములకు సమాధానము చెప్పుకొని గాని యాతడు రచన నారంభింపడు. చక్కగ నాలోచించి వంటయిల్లెక్కడ నుండవలెనో, పూజాగృహ మెక్కడ నుండవలెనో, కచేరిసావడి యేతీరున నిర్మింపవలెనో, స్నానమునకు గది ఏతీరున నిర్మింపవలెనో, దేని కెంత స్థలము నొసంగవలెనో, దేని కేసామగ్రి నుపయోగింపవలెనో ముందుగ నిర్ణయించుకొని కట్టిన భవనము మిక్కిలి అందముగను, వాసయోగ్యముగ నుండునట్లే చక్కని నిర్మాణము గల కావ్యమునకూడ రససంచారము సుగమమగును. నిర్మాణమునందు ఔచిత్యభంగ మెప్పుడు కలిగినదో అప్పుడే కావ్యమునకుగూడ ఔచిత్యభంగమును, తన్మూలమున రసభంగమును సిద్ధించును. దేహికి శరీరసౌష్ఠవ మెట్టిదో కావ్యమునకు నిర్మాణశిల్ప మట్టిది. ఎట్టి యాత్మప్రధానవాదియు దేహమును కేవలము విస్మరింపలేడుగదా? శ్రీరామాది అవతారమూర్తులను వర్ణించునపుడుగూడ వాల్మీకి మహర్షి మున్నగు కవులు వారి యాత్మసౌందర్యమును మాత్రమే వర్ణించి యూరకుండక "సమ స్సమవిభక్తాంగః" ఇత్యాదివర్ణనములలో శరీరసౌష్ఠవమునకుగూడ ప్రాధాన్య మిచ్చుచువచ్చిరిగదా! చక్కని యాత్మసౌందర్యమునకు చక్కని శరీరలావణ్యము జతగూడినపుడే కావ్యమునకు చరితార్థత సిద్ధించుచున్నది.

శ్రవ్యప్రబంధమైనను వాల్మీకిరామాయణమున ఆకృతిశిల్పమున నెన్నో రహస్యములు గోచరించుచున్నవి. ఐతే ఆకృతిశిల్పమున రామాయణమున గానవచ్చు వైభవము ఇతరకావ్యములలో మృగ్యము. కాళిదాసుకృతులనే గైకొనుడు. రఘువంశమున వర్ణితములయిన రాజుల చరిత్రలకు వా రొకేవంశమునకు చెందినవా రను స్థూలసంబంధముతప్ప వస్తుతః ఆంతరంగికైక్యము (Organic cohesion) ఏర్పడుట లేదు. మరియు "దిలీపునితో ఎందులకు ప్రారంభింపవలెను? అగ్నివర్ణునితో ఏల ముగింపవలెను?" అను ప్రశ్నలకుగాని, "ఈరాజుల చరిత్రములలో దేని కెంతవరకు ప్రాధాన్య మిచ్చి వర్ణింపవలెనో అది గ్రహించి వర్ణించినాడా" యను ప్రశ్నకుగాని సమాధాన మిచ్చుట కష్టసాధ్యము. కావ్యప్రారంభము నొకవేళ సమర్థింపవచ్చునేమో

కాని ముగింపుమాత్రము త్రుంచివైచినట్లున్నది. కావ్యమున చక్కని శరీరపరిణామము గనవచ్చుటలేదు. కుమారసంభవ మును గైకొన్నను ఆకృతివిషయమున నంత తృప్తికరముగ గనుపట్టదు. ప్రకృతము లభ్యమగు కుమారసంభవకావ్యము నకు వస్తుస్వరూపమునుబట్టి చూచినచో కుమారసంభవ మను పేరు తగదు. లేదా దీనిని 'తారకాసురవధ'గ గైకొంద మన్నను అపక్షములో మొదటి కొన్ని సర్గలు అనావశ్యక ములు.

## దృశ్యప్రబంధములలో నిర్మాణశిల్పము యొక్క ప్రాముఖ్యము

శ్రవ్యప్రబంధములనుగూర్చి పూర్వాలంకారికులు మూకీభావము వహించినను దృశ్యప్రబంధములనుగూర్చి యట్లు వహింపలేదు. పంచసంధులు, పంచఅర్థప్రకృతులు, పంచఅవస్థలు నిర్ణయించినపుడు వారు నాటకవస్తువు ఎంత చక్కగ గ్రథితము కావలసియున్నదో మిక్కిలి స్పష్టముగ ద్యోతమాన మొనర్చిరి.

కాని ఆలంకారికుల నియమముల ననుసరించినంత మాత్రముననే ఆకృతిశిల్పమున నాటకరచయిత కృతహస్తుడు కాజాలడు. కాళిదాసుడు రచించిన నాటకములలోనే మాళవి కాగ్నిమిత్రమునను, విక్రమోర్వశీయమునను శాకుంతల మున గానవచ్చు నిర్మాణశిల్పము కానవచ్చుట లేదు. పై రెండునాటకములలోను పైని సూచింపబడిన యాలంకారిక నియమములు పాటింపబడినను మాళవికాగ్నిమిత్రమునందలి వస్తుసంఘటనమునకు జిగి మిక్కిలి తక్కువ. 'ఎటు పోయిన నేమి ప్రమాదించునో' యను భయముతో సాగినది కాళిదాసుని కలము. విక్రమోర్వశీయమును నాటక ముగ పరిగణించుట కంటె విరహగీతముగ పరిగణించుట యుక్తము. చతుర్థాంకమే ఇందలి ప్రధానఘట్టము. తక్కిన యంకము లన్నియు ప్రధాన ఘట్టమునకు పరిచారికలు. అం దుచే మ్రొక్కు దీర్చుకొనుటకు రచింపబడినట్లు గానవచ్చును గాని వానికి పూర్ణమైన పుష్టి నిరూఢమగుట లేదు. అందుచే అవయవములందు ఏదోయొకటి మిక్కిలి స్థూలమై తక్కి నవి మిక్కిలి సన్నముగ నున్న నెట్లుండునో అట్టి ఆకృతి వైకల్యము ఈ నాటకమున పొడకట్టుచున్నది. సర్వాంగ సుందరమయి అకృతిసౌష్ఠవమునకు, ఘటనా శిల్పమునకు ఇంచుమించుగ నాదర్శప్రాయముగ పేర్కొనదగిన కృతి శాకుంతలమే. దీనియందు గానవచ్చు నిర్మాణన వైదగ్ధ్యము కాళిదాసు ఇతర కృతులకు నైతము అసాధ్యమైనదవినపుడు దాని మాహాత్మ్యమును గ్రహించుట సుకరము.

ఈ నిర్మాణన వైదగ్ధ్యమును మరల మనము రెండు శాఖలుగ విభజించుకొనవచ్చును: (౧) ఆకృతిసౌష్ఠవము, (౨) ఘటనాశిల్పము అని.

### ఆకృతిసౌష్ఠవము

ఆకృతిసౌష్ఠవ మనినపుడు నాటకముయొక్క మొత్తము ఆకారములో గమనింపదగిన విశేషము. పూర్వా లంకారికులు స్థూలనిర్వచన మొనర్చుచు నాటక మంతయు గోపుచ్ఛము మాదిరిగ నుండవలెనని వాక్రుచ్చినారు. అనగా మొదట బీజప్రాయముగ ప్రారంభమైన నాటక వస్తువు గర్భసంధి, అవిమర్శసంధి వచ్చునప్పటికి పుష్టి వహించి మరల నిర్వహణమున సన్నమై ముగింపు నొంద వలెనని వారి యాశయము గానోపును. ఇది స్థూలమైన సూచనముగ గ్రహింప దగునుగాని నాటకము లన్నియు ఒకే నమూనాలో తయారు కావలెనని వారి యాశయము కానేరదు. లేదా గోపుచ్ఛమువలె నాటకవస్తు వంతయు ఏకా గ్రము కావలెనని వారి యభిప్రాయమగుచో నెట్టి తగవును ఉండనేరదు. ఏర్పరచుకొనిన గమ్యమును బట్టి, అనగా సాధింపదలచుకొనిన పరమార్థమును బట్టి నాటకాకృతి మారుచుండును. వస్తునిర్మాణమును నాటకమునకు శరీర ప్రాయముగ గైకొన్నచో ప్రతిష్ఠింపదలచుకొన్న పరమార్థ మును నాటకమునకు ఆత్మగ' గైకొనవలసియుండును. ఈ యాత్మనుబట్టి శరీర నిర్మాణనము కూడ మారవలసి యుండు ననుట నిర్వివాదము. అయా జీవులకు నిర్దిష్టమగు ప్రయోజనమును పురస్కరించుకొని వారి వారి శరీరనిర్మాణన మున భేదము గానవచ్చుట లేదా? అసురసంహార మొనర్ప వలసిన శ్రీరాముని యవయవనిర్మాణము వేరు. వాదములో బౌద్ధులను జయింపవలసిన శంకరుని యవయవనిర్మాణము వేరు. సొంతముగ నివసించుటకు కట్టుకొను సౌధమునకును- ధర్మసత్రమునకును - దేవాలయమునకును ఉద్దిష్టమగు ప్రయోజనమును పురస్కరించుకొని నిర్మాణమునందు భేదము సిద్ధించుట లేదా? అట్లే విదగ్ధుడగు కవి, సాధింప దలచిన ప్రయోజనము ననుసరించి నాటకాకృతిని నిర్ణ యించుకొనుచుండును. అందుచే శాకుంతలమునందలి యాకృతిసౌష్ఠవమున కానందింపవలె ననిన శాకుంతల మున కాళిదాసు ప్రతిష్ఠింపదలచుకొనిన పరమార్థమేమి అను ప్రశ్నకు ముస్ముందు మనము సమాధానమును బడయవలెను.

కాళిదాసు నాటకమునకు శకుంతలా దుష్యంతుల ప్రణ యమే పరమార్థమా? వేరొక పరమార్థ మేమైన నున్నదా?

శకుంతలా దుష్యంతుల ప్రణయమే పరమార్థము కానేరదు. అట్లయినచో నాటకాకృతి వేరుగ నుండియుండును. శకుంతలయు, దుష్యంతుడును ఒకరి నొకరు చూచుకొని మోహించుటతో ప్రారంభమయి పెండ్లిపీటలమీద అగ్నిసన్నిధిని ఒకరిమెడలో నొకరు పూలదండ వైచుకొనుటతో ముగియవలసియుండెడిది.

శాకుంతల నాటకప్రారంభము మిక్కిలి ప్రౌఢమయినది. దీనిని గమనించినచో నాటకమునందలి పరమార్థమెల్ల మనకు కరతలామలక మగును. మరియొక కవియైనచో శకుంతల చెలికత్తెలతో మొక్కలకు నీళ్లుపోయుచు "ఇత ఇత స్సఖ్యౌ" అను ఘట్టమునుండి నాటకమును ప్రారంభించియుండును. కాళిదాసు మాత్ర మట్లు చేయక బాల హరిణము నొకదానిని ప్రవేశపెట్టి దానివెనుక రథారూఢుడయి మృగానుసారియయిన పినాకపాణివలె నున్న రాజును ప్రవేశపెట్టి ముందు హరిణమును, దానివెనుక రథమును పరుగెత్తించినాడు. ఒకవిధముగ నీ రెండును రంగస్థలమునకు అననుకూలములు గావా? పరుగెత్తుచున్న లేడిని- ఆ లేడి వెనుక బరుగెత్తు రథమును రంగమున బ్రదర్శించుట సుకరము కాదుగదా? అయితే ఈ దుర్ఘట ప్రక్రియవలన కాళిదాసు సాధింపదలచుకొనిన ప్రౌఢార్థ మేమి?

కాళిదాసునకు ఆర్యధర్మముల పట్ల భక్తి అపారము. "అనార్య" అనుట ఆతని మతమున మిక్కిలి నికృష్టమగు దూషణము. ఆర్యుల మతమున స్త్రీపురుషులు కామోద్రిక్తతచే ప్రణయ వ్యాపారమున నిమగ్నులగుట మిక్కిలి గర్హ్యము. వంశోద్ధారకమగు సంతతిని బడయువలె నను సంకల్పముతో సంగమించినపుడే ప్రణయమునకు పారిశుద్ధ్య మేర్పడుచున్నది. ఇతరత్ర ఆర్యజీవితమున దానికి స్థానమే లేదు.

శ్రుతి—సోఽస్యాయ మాత్మా పుణ్యేభ్యః కర్మభ్యః ప్రతినిధీయతే. (ఐతరేయోపనిషత్తు, తృతీయ ఖండము. మం. ౧)

అను మంత్రార్థము ననుసరించి ప్రతిమానవుడును తనకు ప్రతినిధిగ నుండదగిన వ్యక్తిని గాని, వ్యక్తులనుగాని సంఘమునకు సమర్పించినపుడే తనకు జన్మ మొసగిన పితరుల ఋణము తీర్చుకొన్నవా డగుచున్నాడు. అనగా తపస్వియై సంఘమునకు సేవ చేయవలసిన వ్యక్తి వేరొక తపస్విని సంఘమున తనకు మారుగ ప్రతినిధిగ నిలుపవలసియున్నది. అట్లే ప్రభువయి ప్రజాపాలనమూలమున లోకమునకు సేవ చేయవలసిన వ్యక్తి మరల వేరొక ప్రభువును తన స్థానమున నిల్పి కాని లోకమునుండి విరమించుటకు వీలు లేదు. ఏదో యాదృచ్ఛికముగ తటస్థించిన స్త్రీతో మోహావేశపరవశు డయి సంగమించినచో ఈ ప్రయోజనము నెరవేరదనియే ఆర్యుల మతము. ఇప్పటివలె " నా యిష్టము వచ్చిన స్త్రీని నేను వివాహమాడెదను. చచ్చు సంఘము నన్నేమి చేయగలదు ? " అని 'సవాల్' చరచుటకు ఆర్యు లియ్యకొనరు. వ్యక్తుల వివాహములపయి సంఘమునకు పరిపూర్ణమైన యధికార మున్నది. ఎవరి యిష్టము వచ్చినట్లు వారు వివాహమాడినచో సంఘ మల్లకల్లోల మగును. సమష్టిమీద సంఘహితము గోరి వ్యక్తులు తమ స్వేచ్ఛను త్యజించుకొన్నప్పుడే సంఘహితము సిద్ధించును. అనగా వ్యక్తుల వివాహములు సంఘమునకు అంతకును మేలు చేకూర్పవలసిన పవిత్ర యజ్ఞములు, తనకు అనురూప మగు వధువును వివాహమాడి తనవలెనే కాని, తనకు మించిగాని సంఘసేవ చేయగలిగిన సంతతిని గాంచుట వ్యక్తికి విధ్యుక్త ధర్మము. ఇక దుష్యంతునివంటి చక్రవర్తిపట్ల ఈ భారము మరింత యధికముగ నున్నది. ప్రజల నందరిని ధర్మమార్గమున నడుపుచున్న ఉత్తమ ప్రజాసేవకు డాతడు. అట్టివాడు తనకు ప్రతినిధిగ వంశకర్త యయిన చక్రవర్తిని కుమారునిగ బడసి ప్రజాసేవ కాతని నియోగించి తాను వానప్రస్థాశ్రమమును స్వీకరింపవలసియున్నది. అనగా నాతని జీవితములోని కెల్ల నిది యుత్తమోత్తమ ఘట్టము. ఈ ఘట్టమును చిత్రించుటయే శాకుంతలమునకు పరమ ప్రయోజనము.

శాకుంతల నాటకమున శకుంతలా దుష్యంతుల వివాహము భరతోత్పత్తి అను మహోత్కృష్ట గమ్యమునకు లొంగియుండవలసిన సాధనము మాత్రమే. అనగా శకుంతలా దుష్యంతుల ప్రణయము అప్రధానము, భరతోత్పత్తియే ప్రధానము. మూలమునకూడ దుష్యంతచరిత్రమునకు ప్రసక్తి సిద్ధించిన విధమును గమనించినచో ఈ రహస్యము మనకు మరింత విస్పష్టమగును. " భరస్వ " అని యాకాశవాణి పలుకుటచే 'భరతు'డను నామము కలిగిన దని వైశంపాయనుడు పలుకగ " భరస్వ " యని యాకాశవాణి పలుకవలసిన యగత్య మేమి కలిగినదని జనమేజయుడు ప్రశ్నించును. దానిపయి శకుంతలాదుష్యంతుల సంవాదమును, దానికి కారణమయిన వారి చరిత్రమును చెప్పవలసివచ్చినది. అనగా మూలములోకూడ భరతోత్పత్తికి గల ప్రాధాన్యమును మనము గమనింపవలసియున్నది.

ఒక విధముగ జూచినచో శాకుంతలము మనకు జాతీయ నాటకము. భరతఖండమునకు ఆనామము ననుగ్ర

హించిన చక్రవర్తి జన్మకథ యిది. అట్టి చక్రవర్తి తల్లి దండ్రు లెంతటి పవిత్రచరిత్రులో నిరూపించు నాటక మిది.

ఈ నాటకమునకు భరతోత్పత్తియే పరమ గమ్యము గావుననే

" జన్మ యస్య పురో ర్వంశే యు క్తరూప మిదం తవ
పు త్త్రి మేవంగుణో పేతం చక్రవర్తిన మాప్నుహి"

అను వైఖానసాశీర్వచనము దీనికి బీజప్రాయము.

" రథే నానుద్ఘాత స్తిమితగతినా తీర్ణజలధిః
పురా స ప్తద్వీపాం జయతి వసుధా మప్రతిరథః,
ఇహాయం సత్త్వానాం ప్రసభదమనా త్సర్వదమనః
పున ర్యాస్య త్యాఖ్యాం భరత ఇతి లోకస్య భరణాత్"

అను మారీచుల యాశీర్వచనము ఈ నాటకమునకు ఫలప్రాయము.

మృగయావ్యసనాసక్తు డయియున్నను ఆశ్రమమృగ మని తెలిసినవెంటనే బాణము నుపసంహరించుకొనుటలో దుష్యంతుని యాత్మనిగ్రహము ద్యోతమాన మగుచున్నది. ఈ యాత్మనిగ్రహమునకు లభించిన పారితోషికమే వైఖానసుల యాశీర్వచనము. ఈ యాశీర్వచనమును నాటకమునకు ప్రారంభముగ జేసికొనుటలోనే కాళిదాసుని కళాప్రౌఢిమము గానవచ్చుచున్నది. ఈ ప్రౌఢిమ మును గ్రహించినపుడే నాటకస్వరూపము మనకు సుగమ మగుచున్నది. శకుంతలాదుష్యంతుల ప్రణయగాథ నెంతో చతురముగ వర్ణించిన కాళిదాసు ఆ ప్రణయగాథకు పూర్ణస్వాతంత్ర్యము నీయక దానిని భరతోత్పత్తి యను నంకుశముచే నరికట్టినాడు. శకుంతలా దుష్యంతుల వివాహ పుష్పమునకు వంశకర్త యగు భరత చక్రవర్తి జననము ఫలము. ఇట్టియాశయముపై తన కెట్టి పూజ్యభావ మున్న దియు "ప్రజాయై గృహమేధినామ్" అను రఘువంశ వాక్యములోనే ప్రకటించినాడు.

శాకుంతలనాటకమునకు పరమప్రాప్యము భరతోత్పత్తి యని గ్రహించినపుడు నాటకాకృతికి నూతనరామణీయక మేర్పడుచున్నది. నాటకమున మొత్తము ఏడంకము లున్నవి గదా. ఇందు మొదటి మూడంకములకును వివాహము ప్రత్యక్షవస్తువు. తరువాతి మూడంకములకును వియోగము ప్రత్యక్షవస్తువు. సప్తమాంకమున సంయోగము ప్రత్యక్ష వస్తువు. నాటకమునకు ప్రారంభము కులపతియాశ్రమమున; భరతవాక్యము ప్రజాపతియాశ్రమమున. ఇచ్చట స్థూల దృష్టికి గోచరింపని చమత్కృతి ఇంకొకటిగూడ గనవచ్చు చున్నది. ఈకులపతియు ఆప్రజాపతియు సగోత్రులు. ఈ యంశమును కాళిదాసే "యుష్మత్సగోత్రస్య కణ్వస్య"అను దుష్యంతవాక్యమును (అం. ౭) బట్టి ద్యోతమాన మొనర్చు చున్నాడు. దీనినిబట్టి కాళిదాసు నాటకవస్తువునకు చక్కని యైక్యమును సిద్ధింపజేయుటకయి ఎంత శ్రద్ధవహించినదియు, అతని బుద్ధివైభవ మెంత యగాథ మయినదియు తేటతెల్లమయి ఆశ్చర్యముగొలుపును. కొంతవరకయిన భారతమునుబట్టి పోవలసినవాడుగావున శకుంతలను కణ్వాశ్రమమున దప్ప వేరొకచో ప్రవేశపెట్టుట కాతనికి స్వాతంత్ర్యము లేదను కొనుడు. కాని వారిని మరల సమావేశపరచు ఘట్ట మాతని స్వకపోలకల్పితముగదా. అదికశ్యపప్రజాపతియాశ్రమముననే ఏర్పరచుకొనుటలో నెంతటి యపురూపప్రజ్ఞ గానబరచు చున్నాడు! ఇంతే కాదు. మొదటి యాశ్రమమునకును, రెండవ యాశ్రమమునకును గల వ్యత్యాసనిరూపణముగూడ ఎంత విదగ్ధముగ నున్నది:

"ప్రాణానా మనిలేన వృత్తి రుచితా సత్కల్పవృక్షే వనే
తోయే కాంచనపద్మరేణుకపిశే ధర్మాభిషేకక్రియా
ధ్యానం రత్నశిలాతలేషు విబుధస్త్రీసన్నిధౌ సంయమో
యత్కాంక్షంతి తపోభి రన్యమునయఃతస్మిం స్తపస్యంత్యమీ"

శకుంతలాదుష్యంతుల మొదటిసంయోగమునకును కాళిదాసు చక్కని Back ground చిత్రించినాడు. ఈ రెండవ సంయోగమునకుగూడ చక్కని Back ground చిత్రించుచున్నాడు. కాని రెండింటికిని గల తారతమ్యము పై శ్లోకమున చక్కగ విస్పష్టపరుచుచున్నాడు. మొదటి యాశ్రమ మున కిది పైయంతరువువంటిది. శకుంతలాదుష్యంతుల జీవిత ములోకూడ నీ Back Ground కు తగిన పరిణామము గానవచ్చుచున్నది. కణ్వాశ్రమమున వారు పెండ్లిపీటలమీద గూర్చుండుటకు మాత్రమే అర్హులు. కశ్యపాశ్రమమున గార్హస్థ్యమును వీడి వానప్రస్థాశ్రమమున ప్రవేశించుటకు తగిన యధికారము లభ్యమగుట సూచితమగుచున్నది. చక్రవర్తి కాదగిన కుమారుని దంపతు లిరువురును చెరియొక దెసనుండి ముద్దాడుచు కశ్యపాశ్రమమునుండి నిష్క్రమించుచున్నారు. ఇంతే కాదు. దుష్యంతుని కణ్వాశ్రమప్రవేశమును కశ్యపాశ్రమ ప్రవేశమును గమనింపుడు. మానవమాత్రుడైన సూతునితో సామాన్యరథమున అతడు కణ్వాశ్రమమును ప్రవేశించినాడు. దేవేంద్ర సారథియైన మాతలితో దేవతలకునైతము దుర్లభ మైన ఇంద్రుని రథమున అతడు కశ్యపాశ్రమమున ప్రవేశించు చున్నాడు. శకుంతలపాణిగ్రహణమునకు ముందు నడచినది ఋషుల సవనరక్షణము. భరతుని పాణిగ్రహణమునకు

ముందు నడచినది దేవతల కథయుప్రధానకరమయిన యసుర వధ. రెండు ఆశ్రమప్రవేశములకు ముందును శుభనిమిత్తములు గానవచ్చినవి. కాని మొదటి యాశ్రమప్రవేశసందర్భమున "భవితవ్యానాం ద్వారాణి భవంతి సర్వత్ర" అని యాశించుటకు తగిన యుల్లాసము దుష్యంతున కున్నది. రెండవ యాశ్రమమున ప్రవేశించుటకు పూర్వమే యాతని హృదయమున నిర్వేదము ప్రవేశించినది.

"మనోరథాయ నాశంసే కిం బాహో స్పందసే వృథా
పూర్వావధీరితం శ్రేయో దుఃఖంహి పరివర్తతే"

అని యాతడు నిస్పృహతో బలుకుచున్నాడు. ఈ నిస్పృహయే ఈ సన్నివేశమునకు ప్రాణపదము. ఎదుట పుత్రుడు ప్రత్యక్షమయినను, ఆతడు తన పుత్రుడనుట కెన్నియో బలవత్తరములగు నిదర్శనములు గోచరించుచున్నను అన్నిటిని ఒకదానివెనుక నొకటిగ త్రోసివేయుచు దుష్యంతుడు నిస్పృహనే యాశ్రయించుచున్నాడు.

భరతోత్పత్తి శాకుంతలమునకు పరమప్రాప్య మని గ్రహించినంతనే మన రసజ్ఞత చరితార్థము కాజాలదు. దీని నెంతవిదగ్ధముగ మహాకవి ప్రతిపాదించినదియుకూడ గ్రహించి యానందింపవలసియున్నది. శకుంతలాదుష్యంతుల ప్రణయమును ప్రత్యక్షవస్తువుగా జేసి దానిలో మొదటినుండి తుదివరకు శరీరములో లావణ్యమును, పూవులో తావిని నెలకొల్పినట్లు భరతోత్పత్తిని ధ్వనిప్రధానముగ చిత్రించుకొనుచువచ్చినాడు. ప్రధానప్రయోజనము ధ్వని నాశ్రయించుట వలననే స్థూలదృష్టికి గోచరముకాకుండుట తటస్థించుచున్నది.

ధ్వనివలన రసమునకు సాంద్రత సిద్ధించును. ధ్వనిలో నున్న విశేష మేమనగా వక్తవ్యాంశమును మొగము మొత్తనీయకుండ చదువరితో దోబూచులాడించుటయే. కవి తన ప్రయోజనమును కుండబ్రద్దలుకొట్టినట్లు దెసమొలగ ప్రదర్శించినచో లాభము లేదు. అట్లని "ఘూర్జరీ స్తనయుగక్రియ" నతినిగూఢ మొనర్చినను లాభము లేదు. నడుమనడుమ మెరపుతీగవలె మెరయించుచు, ఆవైపునకు దృష్టిసారించునరికి మరల మాయముగావించుచు ఈరీతిని చదువరి నుబ్బూటలూరింపవలెను. అనగా 'స్ఫురణము' 'గోపనము' అను రెండు ప్రక్రియలను యథోచితముగ ప్రయోగించిననే ధ్వనికి కృతార్థత సిద్ధించును. భరతోత్పత్తి యను నీప్రధానలక్ష్యమును ప్రదర్శించుటలో స్ఫురణము, గోపనము అను నీరెండు ధ్వన్యంగములకును ఎట్టి ప్రసక్తి కలిగినదియు ఇంచుక సావకాశముగ విమర్శింపవలసి యున్నది.

శకుంతలావివాహమును, భరతోత్పత్తియు కూడ దుష్యంతునకు యదృచ్ఛాలాభములు. బయలుదేరినది వేటకని. కాని ఆవేటలో ఆశ్రమమృగము ననుసరించుట తటస్థించినది. దానికి వైఖానసు లడ్డుపడినారు. వారి యాజ్ఞానుసారము సంధించిన సాయకము నుపసంహరించుకొనుటవలన ఆతని నిగ్రహమునకు మెచ్చిన ఋషిజనులవలన చక్రవర్తి కాదగిన కుమారుని గను మను నాశీర్వాదమును, కణ్వాశ్రమము జూచిపోవలసిన దను నాహ్వానమును లభించినవి. పైనుదాహరించిన "జన్మయస్యపురోర్వంశే" అను శ్లోకమే భరతోత్పత్తికి ప్రథమస్ఫురణము. కవి దీనినే నాటకమునకు బీజముగ గైకొనినాడు. కాని ఋషుల యాశీర్వాదము ఫలించుట యెట్లు? నాకు చక్రవర్తికాజాలిన కుమారుడు గలుగు సాధన మేద్ది యని వెనువెంటనే దుష్యంతునిచే నన్వేషింప జేసినాడా, దానిలో సందము లేదు. కణ్వాశ్రమమును జూచి పొమ్ము అను నాహ్వానములోనే — వైఖానసులే-యాసాధనమును సమకూర్చినవా రగుచున్నారు. కాని కణ్వాశ్రమమునకు ఆహ్వానించునపుడు ఋషులకుగాని, ప్రవేశించునపుడు దుష్యంతునకుగాని, తుదకు నాటకమును జాగరూకతతో పఠించుచున్న చదువరులకుగాని సాధనము సన్నిహితముగనే ఉన్నది అను భావము కలుగదు. ఆహ్వానించుటలో ఋషులు నిరూపించిన ప్రయోజన మిది.

"రమ్యా స్తపోధనానాం
ప్రతిహతవిఘ్నాః క్రియాః సమవలోక్య
జ్ఞాస్యసి కియద్భుజో మే
రక్షతి మౌర్వీకిణాంక ఇతి."

ఇక దుష్యంతుడో, భుజ మదురుచున్నను

"శాంతమిద మాశ్రమపదం
స్ఫురతిచ బాహుః కుతః ఫలమిహాస్య?"

అని ప్రశ్నించుకొనుచునే యున్నాడు. శకుంతలా దుష్యంతుల ప్రణయమును సహజగతిని బోనిచ్చి ఈభరతోత్పత్తిని గూర్చి తరువాత నేమాత్రము ప్రసక్తిలేకుండ నాటకము నడుపుటలో ఈయంకమునకు గోపనము సిద్ధించుచున్నది. మరల తృతీయాంకమున

"పరిగ్రహబహుత్వేఽపి ద్వే ప్రతిష్ఠే కులస్య మే
సముద్రరశనా చోర్వీ సఖీచ యువయోరియమ్"

అని దుష్యంతునిచే పలికించువరకు కవి యీవిషయమును స్ఫురణకు తేనేలేదు. అంతవరకు మన హృదయము

శకుంతలాదుష్యంతుల ప్రణయగాథ ననుసరించుటలోనే నిమగ్నమైనదిగాని ఋషుల యాశీర్వాద మేమైనదని ప్రశ్నించుట లేదు. పై నుదాహరించిన శ్లోకములోనైనను స్ఫురణము ఎంతో నిగూఢముగ నున్నది. "మా శకుంతలను పెండ్లియాడినందులకు ఆమెపుత్రునే నీ యనంతరచక్రవర్తిగ నంగీకరింపవలసినది" అని నోరుదెరచి శకుంతలపక్షమువారడుగలేదు. "ఆమెకుమారునే పట్టాభిషిక్తుని చేసెద"నని రాజు స్పష్టముగ-వాచ్యముగ బలుకలేదు. ధ్వనిప్రధానముగ స్ఫురణ మున్నది. ఈస్ఫురణమైనవెనుక మరల గోపనము సిద్ధించుచున్నది. తరువాత దుర్వాసుని శాపవృత్తాంతమునందును, శకుంతలవియోగమునందును మనస్సు లగ్నమగుచున్నది. ఈగోపనవాతావరణమున అశరీరవాణి పలికిన

"దుష్యంతే నాహితం తేజో దధానాం భూతయే భువః
అవేహి తనయాం బ్రహ్మ న్నగ్నిగర్భాం శమీమివ"

అను వాక్యము మెఱపుతీగవలె మెఱయుచున్నది. "జాతే వీరప్రసవినీభవ" ఇత్యాది ఋషిపత్నుల ఆశీర్వచనములనుగూడ పైశ్లోకముతో జతగూర్చవలసినదే. అయితే వెనుకటికంటె నొకమెట్టు పైకెక్కినాము. శకుంతల గర్భవతియైనట్లు పైశ్లోకమువలన దెలియుచున్నది. మరల శకుంతల కణ్వుని యొద్దనుండియు, చెలికత్తెలయొద్దనుండియు, తపోవనమునొద్ద నుండియు సెలవు గైకొనునపుడు ఆ లలితవిషాదమున మనసు లగ్నమగుటచే గోపనము సిద్ధించుచున్నది.

"తాత: కదానుఖలు భూయోపి తపోవనం ద్రక్ష్యామి?"

అని శకుంతల ప్రశ్నించినప్పుడుకూడ తపోవనమునందలి యామెస్నేహమునకు ముగ్ధులమగుచున్నాముగాని కణ్వునినోట వెలువడు సమాధానమును ముందుగ నూహింప సమర్థులము గాకపోవుచున్నాము. ఇంతవరకు పటుత్వము చూపిన గోపనతిరస్కరిణి ఒక్కమారుగ

"భూత్వా చిరాయ చతురంతమహీసపత్నీ
దౌష్యంతి మప్రతిరథం తనయం ప్రసూయ
భర్త్రా తదర్పితకుటుంబభరేణ సార్ధం
శాంతే కరిష్యసి పదం పున రాశ్రమేస్మిన్"

అను కణ్వవాక్యమువలన భిగ్నమైపోవుచున్నది. ఈ వాక్యమున స్ఫురితమైనది శకుంతలాదుష్యంతుల వానప్రస్థాశ్రమస్వీకరణము. అనగా భరతోత్పత్తివలన దంపతులు పొందదగిన ఐహికలాభము - విశ్రాంతి. ఇటుతరువాత ఇతర విషయములలో నిమగ్నులమైపోవుచున్నాము. దుష్యంతుని మోహము, శకుంతలాప్రత్యాదేశము, దుష్యంతుని స్మృతిలబ్ధి మున్నగువానిలో. ఈనడుమ "త్వం సాధుభి రాదిష్టపూర్వ ఏవ ప్రథమం చక్రవర్తినం జనయిష్యసీతి" అను వాక్యము గోపనమును భేదించి మన హృదయమును భరతోత్పత్తివంక కాకర్షించునంత పటిష్ఠమైనది కాదు. అందుచే దానిని స్ఫురణముగ గ్రహింపనక్కరలేదు. ఇక తరువాతి స్ఫురణము సార్థవాహ వృత్తాంతమును విని

"అస్మాత్పరం బత యథాశ్రుతిసంభృతాని
కో నః కులే నివపనాని కరిష్యతీతి
నూనం ప్రసూతివికలేన మయా ప్రసిక్తం
ధౌతాశ్రుశేష ముదకం పితరః పిబంతి"

అను దుష్యంతుని విలాపములో నున్నది. ఈస్ఫురణమున వెనుకటికంటె మరల నింకొక మెట్టు పైకెక్కుచున్నాము. ఈ శ్లోకమున పుత్రప్రాప్తి వలన ఆర్యులాసించు నాముష్మికలాభము స్ఫురితమైనది. మరల మాతలి యాగమనము—దుష్యంతుని స్వర్గయాత్ర మున్నగు నితర విషయములలో చదువరి మగ్నమగుచుండుటచే గోపనము సిద్ధించుచున్నది. "కిం ను ఖలు బాలేస్మి న్నౌరస ఇవ పుత్రే స్నిహ్యతి మే మనః. నూన మనపత్యతైవం వత్సలయతి" అను దుష్యంత వాక్యమువరకు ఈ యుదంతమునకు స్ఫురణము లేదు. అటుతరువాత నా స్ఫురణముమీద స్ఫురణము. ఇదియే ఈ నాటకమునకు సిద్ధావస్థ. ఇచ్చట కాళిదాసు చూపిన ప్రాగల్భ్యము ఇంచుమించుగ నతిమానుషము. దీనిలోని వైదగ్ధ్యము ఘటనాశిల్పమున విమర్శిత మగును గాన ఇట పునరుక్తి యనావశ్యకము.

నాటకమంతయు మెఱపుతీగలలో కట్టిన మేడ. కాళిదాసుని కళాకౌశలములోని విశేషములలో నిది యొకటి. అంతయు ధ్వనిప్రధానమైన పనివానితనము. దీర్ఘోపన్యాసము లిం దుండవు. ఒక్క మెరపు మెరయగనే ప్రపంచమంతయు దృగ్గోచర మగునట్లు ఒక్కొక్క వాక్యము చదువగనే ఏదో వింతవింత సౌందర్యమయ ప్రపంచము దృగ్గోచర మగుచుండును. నాటకశరీర నిర్మాణమున అతడు చూపిన ఈ నాజూకుతనమును, ఈ శిల్పమును ఎంత మెచ్చుకొన్నను మెచ్చుకొనవలసినదే.

శాకుంతలమును గైకొన్నపుడు అందలి కథా కల్పనము అద్భుతముగ నున్నదని కాని, మిక్కిలి ప్రౌఢమని కాని వాదించుటకు వలనుపడదు. వస్తువు మిక్కిలి సరళమైనది. ఒక ప్రధానవస్తు వుండి (Plot) దానిలో వేరొక యుపవస్తు వుండి(Sub-plot) ఈరెండింటిని సమన్వయించుటలో నెఱజాణతనమును గానబరచినాడని వాదించుటకు కూడ వలనుపడదు. కాని సరళమైన వస్తువును

ప్రపంచించుటలోనే ఎక్కడ క్లిష్టత లేకుండ చేసికొని "అహో రాగ పరివాహిణీ గీతిః" అనినట్లుగ రసధ్వనిని మూర్తీభవింప జేయుటలో మాత్రము అతని పాకచక్యము మహాకవులకు నైతము వెఱుపుగొలుపజాలియున్నది.

## ఘటనావైదగ్ధ్యము

ఇంతవరకు శాకుంతలముయొక్క శరీరలావణ్యమును సమష్టిమీద విమర్శించితిమి. ఒక్కొక్క యంకమునే గైకొన్నచో దానిలో ఉపాంశముల నొకదానితో వేరొకదానిని హత్తించుటలో నెంతో శిల్పకౌశల మున్నది. ఇది గాక ఆయా యుదంతములను తెచ్చిపెట్టినట్లుగ గాక వానికి సహజోత్పత్తి గల్పించి ఈశ్వరసృష్టిలో నున్న భవితవ్యతను నిరూపించుటలోగూడ కాళిదాసు కడు ప్రౌఢముగ సంచరించుచున్నాడు. ఈరెండు ప్రక్రియలను మనము 'ఘటనాశిల్పము' అను పేరుతో వ్యవహరించుకొందము. స్థూలదృష్టికి అసంభవములుగ గన్పించు ఉదంతములకు సహజోత్పత్తిని ప్రసాదించి అవి యెంతయు సంభవములే యని విశ్వాసము చదువరి కుదయింపజేయుట కావ్యకళలో నొక యుత్తమప్రక్రియ. ఈ ప్రక్రియలో షేక్సుపియరువలె కాళిదాసుకూడ కడు విదగ్ధు డనుటకు అతని ఘటనాపాకచక్యమే సాక్ష్యము.

ఈ ఘటనాపాకచక్య మంతయు ఒకే తరగతికి జెందునది కాదు. కొంత మధ్యమతరగతికి చెందును. మిగిలినది ఉత్తమ తరగతికి చెందును. ద్వితీయాంకమును గైకొందము. ఇందు ఒక దుస్సాధ్యమైన సన్నివేశము తటస్థించినది. పరివార సహితముగ దుష్యంతు డాశ్రమమున చిరకాలము వసించినచో శకుంతలాదుష్యంతుల ప్రణయమున కవరోధము మాట యటుండగ తరువాతి కథాకల్పనమునకు గూడ అడ్డు వచ్చును. ఎందుచేత నన, తక్కిన పరిజనులలో నెవ్వ రక్కడ నున్నను రాజునకు శకుంతలా వివాహమును గూర్చి జ్ఞప్తి చేసియుందురు. కావున దుష్యంతుని ఒక్కనిని రహస్యవివాహము జరిగించుటకు ఆశ్రమమున నుంచవలెను. తక్కిన పరివారమునంతను బంపివేయవలెను. దుష్యంతునకు ఆశ్రమమున కొంతకాలము నిలుచుటకైనను అవకాశము కల్పించుటకూడ దుర్ఘటమే. కణ్వునియెడ తన భక్తి ప్రకటింప వచ్చినవాడు "నైవ విదితభక్తిం మాం మహర్షిః కరిష్యతి" అని పలికినవెనుక నిక ఆశ్రమములో దీర్ఘకాలము నిలుచుట కవకాశమెద్ది? అందుచే సవనరక్షణార్థమయి అక్కడ నుండవలసినదిగ ఋషులచే ప్రార్థింపజేసినారు. రాక్షసుల బాధ మిక్కుటముగ తటస్థించిన దట. అయితే యీ రాక్షసుల బాధ అప్పుడే తటస్థించినదా? ఇదివరలో తటస్థించినపు డెల్ల దుష్యంతుడే వచ్చి రక్షించుచున్నాడా? అను ప్రశ్నలు వచ్చును. దానికి "కణ్వస్య మహర్షే రసాన్నిధ్యాత్" అని సమాధానము. ఇదివరలో మహాప్రభావు డగు కణ్వు డున్నంతకాలము వేరొకరి సాయ మక్కరలేక పోయినది.

సరే, ఋషిసవనసంరక్షణమునకు పరిజన మంతయు నున్నచో మరింత మంచిది కాదా? ఈపరిజనమును వదల్చుకొనుట యెట్లు? దీనికి వ్రతోద్యాపనవృత్తాంత మావశ్యకమయినది. ఈ వృత్తాంతమువలన విదూషకసహితముగ పరిజనమునంతను వదల్చుకొనుటకు వీలిచ్చినది. ఇట్టి ఘటనములలోకూడ పాకచక్యము ప్రకటిత మగుచున్నది గాని ఈమాత్రపు పాకచక్యము మధ్యతరగతి కవులుకూడ ప్రకటింపగలరేమో.

శకుంతలా దుష్యంతుల ప్రథమసమావేశమును గైకొందము. చెలికత్తెలతో పూలమొక్కలకు నీళ్లుపోయుచున్న శకుంతలను చెట్లచాటునుండి రాజు చూచినాడు. ఈ రాజు ఆ సందర్భములో స్త్రీల యెదుటబడుట అనుచితముగదా. తన బుద్ధివైభవముచే కవి దాని కవకాశము కల్పింపవలసియున్నది. ఇచ్చట భ్రమరవృత్తాంతమును గల్పించుటలో కాళిదాసుని ధీనైశిత్య మేమని కొనియాడవచ్చును? నాయికానాయకుల శృంగార సమావేశమున కిది యెంత అత్యుచితమైన సుకుమార ప్రయోగము. విక్రమోర్వశీయమునందలి ఊర్వశీ సంరక్షణఘట్టమునకును (ప్రథమాంకము). దీనికిని గల వ్యత్యాసము చూచినచో కాళిదాసుని ధీపరిణామము గోచరించును. ఇట్లే పరస్పరాసక్తులయియున్న నాయికా నాయకులను విడదీయుటకు వనగజవృత్తాంతమువంటి కఠినోదంతమును గల్పించుటలోని యుచితజ్ఞతకుగూడ మెచ్చుకొనవలసియున్నది. ఈతరగతికి చెందినదే విరహాపన్నుడగు రాజును వీరరసోన్ముఖుని గావించుటకు మాతలి యవలంబించిన యుపాయము కూడను (౬-వ అంకము).

ఇంకొక సన్నివేశమును గైకొందము. శరీరమును సయితము మరచిపోయి శకుంతల భర్తను గూర్చి యాలోచించుచున్నది. ఆ సమయమున దుర్వాసుడు వచ్చి శాపమిచ్చి చక్కబోయినాడు. శకుంతలకు ఈశాపవిషయమయి తెలిసినచో ఆమె యంగుళీయక విషయమున నశ్రద్ధ వహించియుండదు. అందుచే నామె కీవృత్తాంతము తెలియనీయకపోవుట కథాకల్పనమున కెంతో ముఖ్యము. శరీరమే మరచిపోయిన శకుంతలకు దుర్వా

నుడు వచ్చినాడో - శాపమిచ్చినాడో - మరల వెళ్లిపోయినాడో తెలియకపోవుటలో నాశ్చర్యము లేదు. కాని ఆమె చెలికత్తెల కీవిషయము తెలియునుగదా - అది శాపమోక్షణ సాధన మనికూడ వారికి తెలియునుకదా? వా రేందులకు శకుంతలతో చెప్పలేదు?

"అనసూయా — ప్రియంవదే! ద్వయోరేవ నౌ ముఖే ఏష వృత్తాంత స్తిష్ఠతు. రక్షణీయాఖలు ప్రకృతి పేశలా సఖీ.

ప్రియంవదా — క ఇదానీ ముష్ణోదకేన నవమాలికాం సించతి?"

ఎంత సొగసైన సమాధానము!

సానుమతీ ప్రవేశమును గైకొందము. ఇది ఎంతటి సునిశితప్రయోగము! ఈ సానుమతీ ప్రవేశమున నున్న పరమార్థ మేమో గ్రహింపకుండ మనము నాటకమును తిరగవేయుచుందుము. శాపమువలన తటస్థించిన మోహము నశించిన వెనుక దుష్యంతుని మనఃపరిణామమును శకుంతలకు బ్రత్యక్షము గావించుటకయి కవి యాకల్పన మొనర్చినాడు. శకుంతలను దుష్యంతుని యొద్దకు దీసికొని వచ్చుటకు వీలులేదు. కాని ఆమెకు దుష్యంతుని మనస్థితి చక్కగ విస్పష్టము కావలయును. సానుమతిని ప్రవేశపెట్టుటవలన శకుంతలను ప్రవేశపెట్టిన నేప్రయోజనము సిద్ధించునో ఆప్రయోజనమే సిద్ధించినది గదా! సానుమతి నావహించి శకుంతల చూచుచున్నట్లయినది గదా! నికృష్టకవు లయినచో తమ ప్రయోజనములను బ్రకటించుటలో గాంభీర్యము కొరవడునట్లు చేయుదురు. కాళిదా సన్ననో కల్పించిన వృత్తాంతములకు సహజమగు ప్రవృత్తి నొసగుచు వానిచే తా నుద్దేశించిన ప్రయోజనములను నిగూఢముగ సాధించుకొనుచుండును. Art lies in concealing Art అను సిద్ధాంతమునకు కాళిదాసుని శాకుంతలము ప్రశస్త లక్ష్యము. ఉదంతములు స్థూలదృష్టికి నెరవేర్చు ప్రయోజనము వేరు; సూక్ష్మదృష్టికి నెరవేర్చు ప్రయోజనము వేరు. ఈరెండింటికిని పరస్పర విరోధము లేకుండ చూచుకొనుట ఎంత గడుసరికైనను కష్టసాధ్యము గదా!

పాత్రీకరణమును పరిశీలించునపుడు శార్ఙ్గరవశారద్వతుల చిత్రణము యథార్థీకరణమున కుదాహరణగ గైకొని యూనందించితిమి. కాని పాత్రీకరణ వైదగ్ధ్యమునకు ముగ్ధులమై అట్టి పాత్రీకరణమువలన కథాసంవిధానమున కెట్టి మహోపకారము జరిగినదియు గుర్తింపకుండనుండరాదు. శార్ఙ్గరవశారద్వతు లేమాత్రము లోకజ్ఞానము కలవారైనను శకుంతలా దుష్యంతులకు చిరవియోగము తటస్థించుట కవకాశములేదు. "కణ్వుడు మాత్రము మహర్షికాడా? ఎన్నడు మొగమెరుగని స్త్రీని స్వీకరింపవలసినదిగ నిన్ను నియోగించునా" అను నీరీతి యనునయ వాక్యములకు దిగియుండినచో కొంచెము కొంచెముగ దుష్యంతుని ప్రత్యాదేశ హేతువు గోచరించి యుండెడిదేమో! దుష్యంతుడు "వినిపాతము" కాంక్షించుచు శకుంతలను నిరాకరించుచున్నా డను నిశ్చయమునకు వచ్చుటవలన వారు తీవ్రస్వభావు లని తేలుచున్నది. లోకము నంతను దుర్మార్గులుగ ననుమానించుటయు, తామొక్కరే సత్యసంధులని భావించుకొనుటయు గూడ ప్రాపంచికజ్ఞాన శూన్యత చేతనే. ఇంత ప్రపంచజ్ఞాన శూన్యులగను, తీవ్రస్వభావులుగను వారిని చిత్రించుటవలన కాళిదాసు పాత్రీకరణమున యథార్థమునకు సన్నిహితముగ బోయి ఒక కళాప్రయోజనమును సాధించినవా డగుచున్నాడు. అంతటితో నాగక ఘటనా శిల్పమునగూడ కథను చక్కగ సంవిధాన మొనర్చుకొనుటకు దీని నుపకరణముగ గైకొని మహత్తరమైన కళాప్రయోజనము సాధించినవా డగుచున్నాడు. ఇట్టి గాంభీర్యము కాళిదాసునకే చెల్లినది!

## అంక నిర్మాణము

సంస్కృత నాటకములలో అంకమును మరల రంగములుగ విభజించు నలవాటు లేదు. ఇటీవలి పాశ్చాత్య నాటకములలోగూడ నీయాచారమునే యవలంబించి అంకము నంతను ఏకరంగముగ జేయుచున్నారు. ఒక్కొక్కయంకమునందలి ఉపాంశములను సంఘటించుటలోగూడ కాళిదాసు చక్కని శిల్పమును బ్రకటించుచున్నాడు. దీనిని కూడ ఘటనాచాకచక్యములో నొక భాగముగనే గైకొనవలసియున్నది.

శాకుంతలమునందలి యంకములలో నెల్ల ఏది ఉత్తమమైనది అను ప్రశ్న రసజ్ఞులకు కలుగుట స్వాభావికము. సంప్రదాయసిద్ధముగ చతుర్థాంకమున నుత్తమస్థానము లభించుచున్నది. కాని నిర్మాణశిల్పమును బట్టి చూచినచో మొదటియంకమును, సప్తమాంకమును దాని కన్న మిన్నలు. రససంచారమునందు మొదటియంకము కంటె నాలుగవయంకము ఎక్కుడు హాయిని గూర్చుననుట నిర్వివాదమేగాని ఆదృష్టిలోగూడ సప్తమాంకమున కున్న కళాగాంభీర్యము నాలుగవ యంకమునకు లేదు. శాకుంతలమునందలి యంకములలో నెల్ల కిరీటధారణమున కర్హ

మైనది సప్తమాంకమే యని నిశ్చయించుటకు విశేషము సంశయింపవలసిన పని యుండదు.

నిర్మాణశిల్పమునందు చతుర్థాంకము వెనుకబడుచున్న దనుటకు ముఖ్యహేతువు ఇందలి యుపాంశములు చక్కని సంఘటనము నందకున్నవి. శకుంతల తపోవనమునుండి వెలవు గైకొనుటయు, ఆసందర్భమున శకుంతలకు, కణ్వునికి, శకుంతల చెలికత్తెలకును గలిగిన లలితవిషాదమును బ్రదర్శించుటయు ఈ యంకమునకు ముఖ్యలక్ష్య మనుకొనుడు. ఈ సన్నివేశమును సావధానముగనే చిత్రించినాడు గాని శకుంతలను వివాహమాడి దుష్యంతుడు ఆమెను సగౌరవముగ తోడ్కొనివచ్చుటకయి పరివారమును బంపెద నని నమ్మించి యింతవరకు లేఖయైన వ్రాయకుండుటయు, ఆమె తదేకచింతానిమగ్న యగుటయు, ఇంతలో దుర్వాసు డాశ్రమమునకు వచ్చి యామెవలన సత్కారమును గానక శపించుటయు, సఖు లిది గ్రహించి యాతని పాదములపై బడి కోపశాంతికయి ప్రయత్నించుటయు, ఆతడు శాప నిష్కృతిమార్గ ముపదేశించుటయు, కాశ్యపులు మరల ఆశ్రమమునకు వచ్చుటయు, అశరీరవాణివలన జరగిన వృత్తాంతమంతయు తెలిసికొనుటయు, ఇంతలోనే శకుంతలను పతికడకు బంపుటకు ప్రయత్నమును మాంగల్య సమాలంభమును ఒకదానివెనుక నొకటిగ గుదిగ్రుచ్చుటలో కాళిదాసు తొందరపడినట్లు తోచుచున్నది. కణ్వుడు శకుంతల వివాహమును గూర్చి తెలిసికొనుటకును, ఆమె నత్తగారి యింటికి బంపుటకును నడుమ కొంత యవకాశము కావలసియున్నది. లేకున్న నాటకీయవిశ్రాంతి కృతార్థము కాజాలదు.

ఉపాంశములను సంధించుటలో మొదటి యంకమును, సప్తమాంకమునుగూడ మిక్కిలి ప్రౌఢములు. మొదటి యంకమును గైకొందము. ఇందు (౧) మృగానుసరణము, (౨) వైఖానస సాశీర్వాదము, (౩) వైఖానసాహ్వానము, (౪) ఆశ్రమ ప్రవేశము,(౫)పరోక్ష సందర్శనము, రాగోదయము, (౬) ప్రత్యక్షీకరణము, (౭) శకుంతలా జన్మ కథనము, (౮) తాత్కాలిక వియోగము అను నుపాంశము లున్నవి. ఈ యంశము లన్నియు ఒకదానితో నొకటి యతుకుపెట్టినట్లుగ లేకుండ వానికి సహజపరిణామమును గల్పించుటలో కవిచాతుర్య మున్నది. రాజు, సారథి చేసిన వర్ణనములు, (రథవేగ వర్ణనము, హరిణ వర్ణనము) కేవలము వర్ణనాసక్తిని నిగ్రహించుకొనలేక వ్రాసినవి కావు. వానివలన ఆశ్రమప్రవేశము యాదృచ్ఛిక మని నిరూపిత మగుచున్నది. రాజు సారథిని రానీయకుండ వెనుకనే నిలిచిపొమ్మనుచున్నాడు. కవి కథాకల్పనకు రాజును ఒంటరిగనే ఆశ్రమ ప్రవేశము చేయింపవలసియున్నది. దీనికి సహజత్వమును ప్రతిపాదించుట యెట్లు? శకుంతలతో ప్రణయము సాగింపవలె నను నుద్దేశమే రాజునకు మొదటినుండియు నున్నచో ఏదో మిషమీద సారథిని వారించినా డనిన నస్వాభావికముగ నుండదు. ఈ సన్నివేశమున నట్లు గాదే. శకుంతలను దర్శించువరకు గూడ ప్రణయ మంకురింపనేలేదు. దీనికి కవి "వినీతవేషప్రవేశ్యాని తపోవనాని నామ" అను దుష్యంత వాక్యములో చదువరికి సమాధానమిచ్చు చున్నాడు. ఇట్లే సఖులు పలికిన "కే ఆవాం పరిత్రాతుం? దుష్యంత మాక్రంద" అను వాక్యమును గైకొనుడు. ఇది నాటకీయ శక్తి (Dramatic Irony) నిమిత్త ముద్దేశింపబడిన వాక్యము. అయితే ఇచ్చట దుష్యంతుని గూర్చిన ప్రసక్తి సహజముగ లేదని చదువరికి సందేహ ముదయింపవచ్చును. దానికి కవి యిచ్చు సమాధాన మిది: "రాజరక్షితాని తపోవనాని నామ" దుష్యంతుడు రాజని శకుంతలచెలికత్తెలకు తెలియుటలో నాశ్చర్యము లేదుగదా? అందుచే నాతడు సమీపమున నున్నా డని తెలియకపోయినను పరిహాసము నిమిత్తము "దుష్యంతునితో పోయి మొరపెట్టుకో. తపోవనమును రక్షింపవలసిన భారము రాజుది గదా" యని పలికినారు. ఈకడపటి వాక్యము సందర్భోచితముగ నుండుటయే కాక పరిహాసముయొక్క స్వాభావికతను సమర్థించునది కూడ అయియున్నది. ఇట్లు స్థూలదృష్టికి అస్వాభావికములుగ గనవచ్చు నంశములను సూక్ష్మముగ సమర్థించుకొనుచు ఒక తెరటమునుండి ఇంకొక తెరట ముదయించునట్లుగ కథాకల్పనము సాగించినాడు.

సప్తమాంకమును గైకొందము. ఇది మొదటినుండి చివరవరకు అద్భుతావహమయిన ప్రతిభతో నిండియున్నది. అంకావతరణమున స్వర్గమునుండి భూమికి దిగివచ్చుచున్న రాజును దివ్యరథముపై మాతలితో ప్రవేశపెట్టినాడు. ఇక్కడ పైనుండి దిగివచ్చునపుడు భూగోళ మెట్లు గనవచ్చునో చేసిన వర్ణనము మిక్కిలి ప్రశంసనీయము. మొదటి యంకములోని వర్ణనలవలె దీనికిని ఒక గొప్ప ప్రయోజన మేర్పడును. దుష్యంతుని శకుంతలతో సమావేశపడవలె నను నుద్దేశము దేవతల కుండవచ్చును గాని శకుంతలా సమావేశము నిమిత్తము పోవుచున్నా నను స్పృహమాత్రము రాజునకు లేదు. ఆ స్పృహ లేదని నిరూపించుట కీ వర్ణనము ప్రయోజనకారి. అందుచేతనే "అనతిక్రమణీయాని శ్రేయాంసి" అనుటలో రాజునకు గోచరింపని యర్థ మొకటి ప్రేక్షకునకు గోచరించి నాటకీయ

రక్తిని పెంపొందించుచున్నది. ఈ యంకమునకెల్ల ప్రాణపదము భరత దుష్యంత సమావేశము. ఇందలి వాత్సల్యరసమును భాషాంతరీకరణమున చవిచూచి 'గెటీ' తాండవించినాడట! ఒకదాని వెనుక నొకటిగ భరతుడు తన కుమారుడే యనుటకు దుష్యంతునికి ప్రబల నిదర్శనములు లభించుటయును, లభించుచున్న నిదర్శనముల నన్నిటిని కాదని త్రోసివేయుటయు, తుదకు త్రోసివేయుటకు ఎంత మాత్రము వీలులేని ప్రమాణము లభించుటయు ప్రపంచించిన పద్ధతి చూడగ శబ్దమును, అనుమానమును గూడ నిరాకరించి ప్రత్యక్షమునే గాని ప్రమాణముగ నంగీకరింపని సత్యాన్వేషకుని మనస్థితి జ్ఞప్తికి వచ్చుచున్నది. ఇంతటి వైదగ్ధ్యము ఈ నాటకమున నైతము మరి యే సన్నివేశమునను గానము. ఇక్కడ నొక మానవస్వభావరహస్యము గోచరించుచున్నది. మానవజీవితమున తప్పక శుభమే లభించు నను నాశతో నెదురుచూచుచున్నపుడు ఘోరమైన కష్టములు ప్రత్యక్షము లగుటయు, సర్వవినాశమైపోవుచున్న దను నిస్పృహతో నెదురుచూచుచున్నపుడు అభ్యుదయపరంపర లనంత బానుగ వచ్చి వరించుటయు ననుభవైకవేద్యము.

ఈ పట్టున దుష్యంతుని మనఃప్రవృత్తిని శ్రద్ధగ గమనింపవలసియున్నది. ధర్మపత్ని యగు శకుంతలను, వంశోద్ధారకు డగు పుత్రుని అన్యాయముగ నిరాకరించితినే యను పశ్చాత్తాపములో నాతని మనస్సు నిమగ్నమైయున్నది. అందుచే 'సిరి రా మోకా లొడ్డువాని' వలె శ్రేయఃప్రాప్తి సూచనలు గనవచ్చుచున్నను వానిని నిరాకరించుచున్నాడు. అయితే ఇంకొక వైచిత్ర్యముకూడ నున్నది. పైకి అట్టి సూచనలను నిరాకరించుచున్నాడే గాని ఆ మనస్సులోనే అంతర్భాగమునకు పోయినచో వానిని అంగీకరింపవలయు ననియే యున్నట్లు స్పష్టమగును. అయితే తీరా అంగీకరించిన తరువాత ఆశాభంగము సిద్ధించునేమో యను భయముచే ప్రబల ప్రమాణము దొరకు వరకు మాత్రము అంగీకరింప కూడ దనుకొన్నాడు. మిక్కిలి కష్టదశలో నున్నవారికి అభ్యుదయప్రాప్తి సూచనలు గోచరించినపుడు ఇట్టి మనఃస్థితి సహజ మనుట అనుభవైకవేద్యము. ఈ మనస్థితిని సోపానసరళిగ ప్రదర్శించిన కవిప్రతిభను గమనింతము:

"మనోరథాయ నాశంసే కిం బాహో స్పందసే వృథా
పూర్వావధీరితం శ్రేయో దుఃఖం హి పరివర్తతే."

అనునది ఈ మనఃస్థితికి మొదటి సోపానము. నిరాకరించిన పత్నియు, పుత్రుడును మరల తనకు లభించిన బాగుండు నని దుష్యంతున కున్నదనుటకు 'పూర్వావధీరితం శ్రేయో' అను వాక్యము నిదర్శనము. అయితే 'దుఃఖం హి పరివర్తతే'-గాఢమైన ఆపదలో నిమగ్నుడయిన అతనికి మనోరథము నెరవేరుట అసంభవమను నిస్పృహ యున్నది. అందుచే 'కిం బాహో స్పందసే వృథా' యని ప్రశ్నించుచున్నాడు. సర్వదమనుని చూచిన వెనుక "కింను ఖలు బాలేస్మిన్ ఔరసఇవ పుత్రే స్నిహ్యతి మే మనః" అని కలిగిన సందేహము రెండవ మెట్టు. సర్వదమనుని పుత్రునిగా నంగీకరింపుమని యంతరాత్మ ప్రోద్బలము చేయుచున్నదికాని బాహ్యాత్మ నావరించిన నిస్పృహ ననుసరించి "నూన మనపత్యతైవం వత్సలయతి" యని సమాధానము చెప్పుకొనుచున్నాడు. ఈసమాధానముకూడ సారవంతమైనదే యనుట కవిప్రతిభకు నిదర్శనము. కొనవరకు దుష్యంతుని మనస్సు రెండుతలల పామువలె వెనుకకు ముందుకుకూడ నడచుచున్నది. ఇట్లు నడచుటకు అవకాశ మున్నదని నిరూపించుటలోనే కవియొక్క లోకజ్ఞత ప్రకాశించుచున్నది. మూడవ సోపానము బాలకుడు అరచేతిని చాచినపుడు అందులో చక్రవర్తిలక్షణములు గోచరించుట. "కథం చక్రవర్తిలక్షణమ ప్యనేన ధార్యతే" అని దుష్యంతుడు ప్రశ్నించుకొనుచున్నాడు. తనకు చక్రవర్తి యుదయించుననికదా ఋషుల యాదేశము. అందుచే చక్రవర్తిలక్షణము లున్న యీబాలకుడు తన కుమారుడే అయియుండునని అంతరాత్మ ఘోషించుచున్నది. అయినను దానిని నిరాకరించి ఆ బాలుని "మహర్షిపుత్ర" అనియే సంబోధించుచున్నాడు. మహర్షిపుత్ర అనగానే - మొదటి యంకమున శకుంతల ఋషిపుత్రి గాదని తెలిసినట్లే-యాతడు మహర్షిపుత్రుడు కాదని తాపసీ వాక్యమువలన తెలిసినది.

"రాజా:—ఆకారసదృశం చేష్టితమేవాస్య కథయతి.
స్థానప్రత్యయాత్తు వయ మేవం తర్కిణః."

అని చెప్పుచు బాలకుని స్పృశించినాడు. ఈ స్పర్శ వలన తన దేహమునకు Electric Shock వచ్చినట్లుగ ఒక నూతనానుభవము గోచరమైనది. ఈస్పర్శనసుఖమే తరువాతి సోపానము.

"అనేన కస్యాపి కులాంకురేణ
స్పృష్టస్య గాత్రేషు సుఖం మమైవమ్
కాం నిర్వృతిం తస్య జనస్య కుర్యాత్
యస్యాయ మంకా త్కృతినః ప్రరూఢః"

అని యీ స్పర్శనసుఖమునుగూర్చి ఆత్మగతమున నాలోచించుచుండగా "ఆశ్చర్య మాశ్చర్యమ్" అని తాపసి యరచినది. "అస్య బాలస్య తవ సంబంధసంవాదిన్యాకృతిరితి

విస్మితాస్మి" అని తాపసి పలుకుట తరువాతి సోపానము. అయితే ఆకారసాదృశ్యమునుబట్టియే అనుమానమును స్థిరపరచుకొనుట ప్రాజ్ఞలక్షణము కాదుగదా. అతడు పూరువంశజుడే యని తెలిసికొనుట తరువాతి మెట్టు. క్రమక్రమముగ బాలుడు గుణికి బారెడు హెచ్చుతగ్గుగ చేరుకొనుచున్నాడు. "అప్సరస్సంబంధేన అస్య బాలస్య జనన్యత్ర.... ప్రసూతా" అనునది యింకొక యాశాజననహేతువు. ఈ యప్సరసభర్తనుగూర్చి "ధర్మదారపరిత్యాగినః" అను తాపసీనిందావాక్యము మరియొక సోపానము. ఇన్ని ప్రబలమైన కారణములు గోచరించుచున్నను ఇంకను బాహ్యాత్మలో నాతడు "అనార్యః పరదారవ్యవహారః" అని వెనుదీయుచునేయున్నాడు. "శకుంతలావణ్యం పశ్య" అనినపుడు 'శుభ్రవా మేఽండా' అనిపించుటలో కవి శబ్దశ్లేషపై నాధారపడినాడుకాని ఇది తెచ్చిపెట్టినట్లు లేక సహజముగనే యున్నది. ఇక్కడికైనను రాజుసంశయము నివృత్తికావలసి యున్నది. కాని "సంతిపున ర్నామధేయసాదృశ్యాని" అని సమాధానము చెప్పుకొనుటలో ఆతని నిస్పృహ ఎంత గాఢమైనదో తెలియుచున్నది. ఇంతే కాదు. "వయం తత్త్వాన్వేషా న్మధుకర హతాః" అను వాక్యమువలన ప్రకటమగు నాతని స్వభావవైశిష్ట్యముకూడ నిరూపితమగుచున్నది. తుదకు రక్షాకరండకవృత్తాంతమువలన ప్రత్యక్షప్రమాణము లభించినది. ఇది యామనఃస్థితిప్రదర్శనమునకు ఆఖరిమెట్టు. దీని నైనను రాజు శోధింపక విడిచిపెట్టుట లేదు. "భవతిద్యాం కదాచి దస్యా ప్రత్యక్షీకృతా విక్రియాః" అని ప్రశ్నించి దానికికూడ సంతృప్తికరమగు సమాధానము లభించిన మీదట "కిమిదానీం పూర్ణమపి మనోరథం నాభినందామి" అని నిశ్చయాత్ము డగుచున్నాడు.

ఇట్లే అంగుళీయకమును శకుంతలకు ప్రదర్శించిన విధానమునకూడ కవి చూపిన శిల్పము అనన్యసాధ్యము. ఈపట్టున సాధారణముగ నితరకవులయినచో తొందరపడి యుందురు. శకుంతలాదుష్యంతుల పునస్సమావేశమునకు హర్షించి చదువరిహృదయ మన్యథాయత్తమై యుండుటచే "బాష్పం ప్రమృజ్య విగతానుశయో భవామి" అని దుష్యంతుడు పలికినపుడుకూడ అంగుళీయకప్రదర్శనమునకు దీనిని కవి సాధనముగ గైకొనబోవుచున్నా డని యూహింపనేరదు. అందుచే 'నామముద్రాం దృష్ట్వా' అనగానే మన స్సొక్కసారిగ అద్భుతరసనిమగ్న మగును. ఇట్టి యద్భుతావహశిల్పముతోడనే శాకుంతలమునందలి వస్తువంతయు సంఘటిత మైనది.

శాకుంతలము రసప్రధానమగు నాటకముగాని కథాప్రధానమగు నాటకము గాదు. రసమునకు ఆధారభూతమగు కథనుమాత్రమే సూచనప్రధానముగ కాళిదాసు ప్రపంచించినాడు. అనగా కథ రసమునకు పాత్రప్రాయమైనదనినమాట. కథను రసమునకు పాత్రప్రాయముగ చేయుటవలన కొన్ని యితరసంస్కృతనాటకములలోవలె ఇరువురు పాత్రలను ప్రవేశపెట్టి "తత స్తతః" అనుచు పరోక్షకథనమును బెంచుకొనుచువచ్చుట ఇందు గానము. శాకుంతల రంగభూమిపయిని కూడ జయశ్రీని వరించుట కిది యొక హేతువై యుండవచ్చును.

వివేకానందుడు శాకుంతలమునుగూర్చి ముచ్చటించుచు "It is the Taj Mahal of Dramatic Art" (శాకుంతల నాటకకళలో తాజ్‌మహల్ వంటిది) అని ప్రశంసించెనట. అట్టి ప్రశంసకు లోకములోని ఉత్తమనాటకములలో నొక్కటియైన ఈ మహాప్రబంధము ఎంతయు తగియున్నదని దాని నిర్మాణశిల్పమును లెస్సగ ననుసంధించిన సహృదయులు తలయూపకపోరు.



# స్వగతము



= శ్రీ చెఱుకుపల్లి జమదగ్ని శర్మ =

రామాగమనవార్త వినిన గుహుఁడు గంగాతీరములో :—

మసలుచు నొడ్డు తాఁకి విసుమానము దోఁపఁ జలింపకుండి వె
క్కసముగ లోతులన్ గదలి గట్టులు ద్రోసి జగమ్ము ముంపనో
బుసబుస పొంగిపొంగి నిడుపుందరగల్ నురుగుల్ ఘటింపఁగా
విసుకపొరల్ పెకల్చికొని యే మిటు పొంగెదు తల్లి యంతలోన్.

అరరే! యప్పుడె ముంచివైచితివరో! యా తీర మీ తీర మే
ర్పరుపన్ రానియటుల్ క్షణమ్ము చనుచోఁ బారమ్ములో నావ లం
గరుతోఁ బోవును సాగరమ్మునకు వెన్కం బోవు నాజీవికల్
పరువెత్తం బనియేమి తల్లి! మది విప్పన్ రాదొ నాముందటన్.

తరగల్ తగ్గి నురుంగు మానితివి మాతా! యింతలో నింత మా
ర్పరుదేరం గతమేమి? నీ మనసులో నానందమో దుఃఖమో
తెలుపంజాలని క్రోధమో యెదొ యగాధంబై భవత్సర్వ ము
ద్ధురతం గంపిలఁ జేయుచున్న నిటు నాతోఁ జెప్ప కేలాగవో

చిలవలు పల్వలై యిచటు చేరెను, తథ్యమొ కాదొ, నీకునుం
దెలిసెన రామచంద్రుఁ డరుదెంచెడి వార్తలు? వృద్ధరాజు తాఁ
బిలిచి వచించె నంట యడవిం బడి పొమ్మని యెందు నుండునే
విలయము లిట్టి వింక! తెరవెంబడి నాటక మెంత యున్నదో!

ఆ రఘురామమూర్తి తనయంతటఁ దా నిటు వచ్చి దారిలోఁ
బూరము నిన్ను దాఁటుటకు ముందుగనే చిననాఁటి నెయ్యపుం
బూరము నన్ను దాఁటి మఱి ముందున కేగవలెం గదమ్మ! కా
నేరదు నాశరీరమున నిండిన ప్రాణము నిందుకొన్ననున్.

అగునగు రాముఁ డేమెఱుఁగు నాతని సంగతి నే నెఱుంగుదున్
మిగిలి యెఱుంగుఁ దల్లి. అది నీవు నెఱుంగుదు కొంతకొంత విం

తగును తనంత తా నెఱుఁగఁ డాఁకలిదప్పిక లట్టివాఁడు పో
వఁగవలెనంట నిన్న నిటు వచ్చిన జానకితోడఁ దమ్ముతోన్.
అమ్మయు నాన్న లేని బడుగయ్యెనె రాముఁడు, వాని కేమి లో
కమ్మునఁ దక్కువయ్యెఁ, ద్రిజగమ్ములు వానివి కావా! కానలోఁ
ద్రిమ్మరఁ దండ్రియానఁబడి లెంపున వచ్చెనటే! గుహుండు పో
నిమ్మని యూరకుండునటె! మెచ్చటిమాటలు నమ్మఁబోకుమీ!

* * * *

వచ్చితివా ప్రభూ! వాత్సల్య మూని-పచ్చనాకుల మెత్త పఱపు లియ్యవిగో
ఏమోయి లక్ష్మణా! యెందుండి రాక - ఆమాత్ర కబురంప ననువు కాలేదా!
రావోయి రఘురామ! రమ్మ నా రామ! - నీవిందుఁ గూర్చుండు నిలఁబోకు మింక
అడుగుదమ్ములు కంది యాయాసపడుచు - బడలికతోఁ దల్లి ప్రక్క నిల్చుండె.
స్వీకరింపుము రామ! చిటిరేగిపండ్లు - కైకొనుమివి పాలకాయలు సామి.
ఇప్పపూఁ జీనియ లివిగో నా సామి - దొప్పలలో నిండి తొణికిసలాడు
లేయీత మొవ్వ నొల్పించి తెచ్చితిని - హాయిగా కడుపార నారగింపుండు.
గంగిగోవులపాలు గైకోర రాజ! - గంగాఫలాల్ నీరు కైకోర సామి!
అమ్మరో సీతమ్మ! అటు చూచెదేల - కొమ్ము నీ చిత్తము కోరిన రీతి
రామన్న క్రొత్తయా లక్ష్మన్న క్రొత్త - నేమున్నె దాసుఁడ నీకేమి జంకు!
దూరాలఁబడి వచ్చి దొరలు డస్సితిరి - ఆకులపై శ్రాంతి నపనయింపుండు
అది యేమి రాఘవా! అపుడె లేచితివి - ఇది నా స్వరాజ్యమం చెఱుఁగుముసామి!
నీ కాలు ద్రొక్కెడ నియమింపు రాజ! - ఏకోన తెమ్మందు విప్పుడె తెత్తు
అట విశ్రమించుచో నడుగులొత్తెదను - చిటితాళములు పూని చిందులాడెదను.
ఈనాఁడు పగ లెంత యెండకాసినదో - ఏనాఁడు లేదు తా నింతగా నినుఁడు
నాతండ్రి నీ విట్లు నవయౌవనము - సీతతోఁ దమ్ముతో సింహాసనమ్ము
త్యజియించి యడవుల కరుగుటల్ సూచి - నిజబుద్ధి సహియింప నేరఁడో యేమొ!
అవునోయి రామయ్య అది యేమి మాట - అవుగాదనక నీవు నాన వెంబడిని
కడువేగ వచ్చితిగా వంతనమ్మ — అడుగుడు చెప్పవిూ అడవి యెక్కడిది.
ఇదిగాదొ యీ ప్రాంత మెల్ల నారాజ్య - మిది నీది నీ వుండు మిందు నాసామి!
ఈచోటు శాంతత నీక్షింపు సామి - యేచోట చూచిన నింపైన నీడ
సుమనఆమోదమ్ము చూపించుగాలి - విమలినానందమ్ము పెంపొందు వెలుఁగు
కనుపండువలు చేయు కమలినీచయము - వినవిందు లొనరించు విహగసంచయము

ఏది కావలె నింక నెయ్యదికోఱెద - నీదాసుఁడ న్నన్ను నియమింపు రాజ!
చేతమ్ము పులకింప సేవించుకొందు - సీతమ్మతో నిందె స్థిరముగా నుందు.
తెలవాఱకయె మున్న తెప్పపై నెక్కి - యల గాంగజలములో వలలపై నూఁగి
ఫలపుష్పములు గల్గు బహుళ వృక్షములు-గలచోట్ల విహరించి గడపంగవచ్చు
అంత యువ్విళ్లూరి యాలకించెదవు - ఎంత సే పిప్పుడే యేగంగవచ్చు
సీతమ్మ! క్షణముందు సిద్ధమ్ము చేసి - యాతెప్పపై మిమ్ము నావలిదరికిఁ
గొంపోయి చూపింతుఁ గోమలవాయు - కంపమానానూన క్రమవనాలు
అంతలో నది యేమి యపుడె లేచితివి - యింత తొందఱ యేమి యినకులరాజ!
అన్నట్లు మఱచితి నయ్య యీ నడుమ - నన్నేలుదొరలు మిన్నఁగ మాఱినారు
ఘనకార్యములు చేసి గడన కెక్కితిరి - అనుమాన మవును మిమ్మంతలో నమ్మ
నటులుండఁ డొక కొంత యడుగుదమ్ములను-స్ఫటికమ్ములట్లు శుభ్రమ్ము చేయంగ
వలె నట్లు గాకున్న పాషాణమట్లు - చెలువమై గూర్చుండు చిన్ని నా పడవ
ముల్లోకముల పాపపుంధూళి కడుగు - కల్లోలవతి గంగఁ గన్నట్టి యడుగు
దమ్ము లేపి రామ దయతోడ నిమ్ము - దుమ్ము లేకుండంగఁ దుడువంగ నిమ్ము
నదిరొడ్డుదాఁక క్రొన్ననలు చల్లితిని - అదె దట్టముగఁ దామరాకు లుంచితిని
మెలమెల్లగా రండు మేదినీవిభులు - అల నావదాఁక మీ యడుగు డింపకయె
చుక్కానివైపు గూర్చుండు లక్ష్మన్న! - అక్కడ బల్లపై నటు నిటు మీరు
శ్రీరామచంద్ర! నా సీతమ్మతల్లి! - జోరుగా గడవేసి చుఱుకుగా పడవ
నడిపింతు ననుఁ జూచి నవ్వకుఁడింక - నడుగుల కెఱఁగితి నానతి యిండు.

బాలసమీరవిలోల జలోర్మికపై నడయాడెడి కోలముపై
జాలము సేయక చాల విలాసము సాగు మహానది వీచులలో
లీలను యేలల నూఁగుచుఁ బోవుచు లేమొదలంటు విషాదములన్
మేలములాడి నశింపఁగఁజేయుచు మెల్లగఁ బోవుద మద్దరికిన్.

—

# షాడబము*



= శ్రీ నేలటూరి వెంకటరమణయ్య =

'షాడబ' శబ్దార్థవిచారము భారతిలోఁ గొంత నడచియున్నది. శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు దీని యర్థమును వివరించి చెప్పుచుఁ, దత్పూర్వము దీని విషయమై జరిగిన చర్చలను క్రోడీకరించి తెల్పియున్నారు. పాండురంగ మాహాత్మ్యమునకుఁ టీక వ్రాయుచు కీ. శే. తెన్మఠము శ్రీరంగాచార్యులవారు షాడబమునకు 'ఆఱురసములతోఁ గూడిన పదార్థము'లని యర్థము వివరించిరనియు, నీయర్థమే శబ్దరత్నాకరములో నీయఁబడెననియు, నాముక్తమాల్యదయందలి 'నానావిధషాడబముల' అను పద్యమునకు వ్యాఖ్య వ్రాయుచు కీ. శే. వావిళ్ల రామస్వామిశాస్త్రులవారును, వేదము వెంకటరాయశాస్త్రులవారును 'రసములు' అని వ్రాసిరనియు, వారి యజ్ఞానమును వెల్లడిసేయుటకు బద్ధకంకణులయిన శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 'ఓగిరములలో నొకటియగు పానీయవిశేష'మని † లేక 'యుపాహారము' (టిఫిన్) అని అర్థం తేల్చారనియు, వేదము వారి 'రుచి'వలెనే దీపాలవారి 'టిఫిను' గూడ చెల్లదనియు, వాస్తవముగ దాని యర్థము పులుసు (దప్పళము) అనియుఁ దేల్చినారు.

"షాడబం అంటే భోజనసమయంలో వడ్డింపబడే ద్రవరూపవ్యంజనమనీ, అదే పులుసనీ, అది ఎంత మాత్రము ఉపాహారము (అల్పాహారము) కాదనిన్నీ, ఆకాలపువారు రెండుజాములు తిరిగేక ‡ (అపరాహ్ణమంటే రెండుమూడు గంటలని నియమం లేదు) భోజనం చేసేవారనీ, సాధారణంగా వారిది ఒంటి పూట భోజనమే అనీ గ్రహించవలసివున్నది."

తరువాత శ్రీ డా. చిలుకూరి నారాయణరావుగారు శబ్దశాస్త్రరీత్యా చర్చించి సంస్కృత 'షాడబము' ప్రాకృతమున 'ఖాడవ, ఖాండవ'ములుగ మారినదనియు, నది కన్నడమున 'కడబు'గను, తెనుఁగున 'కుడుము'గను రూపాంతరము నందినదనియు, కావున 'షాడబ'మన 'కుడు'మని యర్థము చెప్పవలయుననియు, సందర్భానుసారము 'ఉండ్రాయి' యని యర్థము చెప్పుకొన వచ్చుననియు శాసించినారు.

---

* ఈశబ్దార్థవిచారమునందు శ్రీ డా॥ వే. రాఘవన్ గారును, శ్రీమాన్ హెచ్. శేషయ్యంగారును చాల తోడ్పడిరి. వారికి నాకృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాఁడను.

† "ఓగిరము, ఓయిరము, ఓరెము, ఓవిరము. వి (సం. ఆహారః, క. ఓగర) అన్నము, ఆహారము." అని సూర్యారాయము. ఆహారశబ్దమునకు శబ్దకల్పద్రుమములో నిట్లు అర్థము చెప్పఁబడియున్నది: ౧. ద్రవ్యగలాధఃకరణం, తత్పర్యాయః, జగ్ధిః. ౨. భోజనం, ౩. జేమనం, ౪, లేపః, ౫ నిఘసః, ౬. న్యాదః, ఇత్యమరః. ౭. జమనం, ౮. నిఘసః ఇతి తట్టీకా. ౯. ప్రత్యవసానం, ౧౦. భక్షణం, ౧౧. అశనం ఇతి రత్నమాల. ౧౨. అభ్యవహారః, ౧౩. స్వదనం, ౧౪. నిగరః ఇతి రాజనిఘంటుః. లోఁగొను పదార్థము లెవ్వియేనియును ఆహారమని చెప్పుటకవకాశమున్నప్పటికిని పైని జెప్పిన ౧౪ అర్థములలో నొక్కటియేనియు పానీయము కాకపోవుట గమనించఁదగిన విషయము. ఇందువల్లనే యాహారతద్భవమైన తెనుఁగు 'ఓగిర' శబ్దమునకు 'అన్నము'అను నర్థము రూఢియైనది. విషయ మిట్లుండఁగా ఓగిరములలో నొక్కటియగు పానీయవిశేషమని శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు చెప్పినారు. ఇది యుక్తమని తోఁచదు.

‡ 'తిరిగిన వెనుక' అనుదానికి సర్కారులలో వాడుకలోనున్న భ్రష్టరూపము ఇది.

మొదట అముక్తవ్యాఖ్యాకారుల 'రుచి'ని గురించి యొక మాట చెప్పవలసియున్నది. షాడబ మను మాటకు 'ఆఱు రసముల సమ్మేళనమువలనఁ జేయఁబడిన పదార్థవిశేష'మని వీ రెఱుఁగుదురు. పదస్వరూపమే ఈయర్థమును దెలియఁ జేయుచున్నది. భోజనసందర్భమున నీ మాటకు వీరు షడ్రసము లని యర్థము చెప్పుట యుచితమని తలఁచి 'రస'మన 'రుచి'యనుటచే 'రుచులు' అని టీక వ్రాసిరి. మఱియు వీ రీసందర్భమున నూతనమార్గమును ద్రొక్కలేదు. ప్రాచీనవ్యాఖ్యాతలను, టీకాకారుల ననుసరించియే వీ రిట్లు వ్రాసిరి. నానావిధషాడబము లను నానావిధటిఫినులు, నానావిధపులుసు (దప్పళము) లను నర్థముకంటె నానావిధరుచులు ఔచిత్యమునఁ దీసిపోదని మదీయాభిప్రాయము. సందర్భమునకు సరిగ్గైన యర్థమును వివరించి, వీరు వ్యాఖ్యాతల ధర్మమును నెరవేర్చుకొనిరి. కావున వీరి వ్యాఖ్యానముల యందు లోప మున్నదని చెప్పుట తగదు. లోపమే యనుకొనినను ఊని చెప్పఁదగినది కాదు.

## షాడబ, షాడవశబ్దములు భిన్నములా ?

షాడబ-షాడవశబ్దములు భిన్నములా? భిన్నము లనియే మన పండితులలోఁ గొందఱి యభిప్రాయము. శబ్దరత్నాకరకారులు 'షాడబ', 'షాడవ' శబ్దములను బ్రత్యేకములుగ గ్రహించి, యందు మొదటిదానికి 'మధురాదిరసము' అనియు, రెండవదానికి 'ఆఱుస్వరములు గల రాగము' అనియు నర్థము చెప్పిరి. శ్రీ బులుసు వేంకటరమణయ్యగారికిఁగూడ నిట్టి యభిప్రాయమే కలదని తోఁచుచున్నది. "సంస్కృత నిఘంటువుల్లో షాడబం లేదుగాని 'షాడవం' అనే పదం కనబడుతుంది. అదివొక రాగం ; ఆరు స్వరాల్తో కూడినది. శ్రీ ఆప్టేగారు తమ 'సంస్కృతాంగ్ల నిఘంటువు'లో, షాడవ— **(In Music) A Raga in which six of the seven primary svaras are used.** ఔడవః పంచభిః ప్రోక్తః స్వరైః షడ్భిస్తు షాడవః అని వివరించారు" అని వ్రాసినారు.

కాని సంస్కృతనిఘంటువులను జక్కఁగా పరిశీలించి చూచినచో 'షాడబ' 'షాడవ'శబ్దములు భిన్నములు గావనియు, వ, బల యభేదమువలనఁ బొడమిన రూపభేదము లనియుఁ దెలియఁగలదు. షాడబ (షాడవ) శబ్దము సూదశాస్త్రపరిభాషకుఁ జెందినది; వంటయింటఁబుట్టినది; అచట మెప్పువడసి గానమందిరముఁ జేరి రాగముగ మారినది. అనఁగా సూదశాస్త్రపారిభాషికపదములం దనేకములఁ బోలి షాడబ (షాడవ) శబ్దము సంగీతశాస్త్రముచే స్వీకరింపఁబడినది. సంగీతశాస్త్రమున కనుగుణ్యమగురీతిని దీనికిఁ దచ్ఛాస్త్రకారులచే నొక క్రొత్త యర్థము గల్పింపఁబడినది. ప్రాఁతమాటకే ప్రకరణభేదముచేఁ గ్రొత్తయర్థము గల్పింపఁబడెను. ఇంతియే.

## షాడబ మన నేమి ?

షాడబ (వ) మననేమి? ఈశబ్దమునకు 'షట్సు తా అపశ్చ షడపః. షడపాం వికారః షాడపః' అని యొక మిత్రు లుత్పత్తి చెప్పి 'షాడపః'లోని కడపటి వర్ణము ఉచ్చారణయందు షాడవః (బః) ఆయె నని వివరించినారు. ఇది యెట్లున్నను, ఆఱు ద్రవపదార్థములను కూర్చి చేసిన పదార్థము 'షాడవ'మనుట నిశ్చయము. శబ్దావయవార్థమునుబట్టి 'షాడబము' ద్రవపదార్థసమ్మేళన మని తెలియవచ్చుచున్నను అభినవాంధ్రవాల్మీకులు దమ రామాయణము సుందరకాండ ౭౭-వ పుటయొక్క అధోజ్ఞాపికయందు "షాడబము లనఁగా శర్కరాదివస్తువులతోఁ జేసిన భక్ష్యవిశేషము లని యర్థము" అని వివరించియున్నారు. ఈవివరణము వీరిది కాదు. ఇది రామాయణవ్యాఖ్యాతయగు గోవిందరాజుగారి వాక్యముల సంగ్రహము. కాని షాడవము భక్ష్యమని చెప్పుటకు తగిన యాధార మెద్దియుఁ గానరాదు.

## షాడవ మన దప్పళమా ?

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు షాడవ మనఁగా 'పులుసు', అనఁగా దప్పళమని గుర్తించినారు.

"ఐతే షాడబాన్ని ఒక ద్రవవ్యంజన మనుకోవడమేనా, లేక ఏదన్నా పేరుందా అని ప్రశ్నించుకోవాలి.

"లేకపోవడమేమిా? ఉంది.

"ఆసంగతిని ఆదికవి వాల్మీకే రామాయణంలో వివరించాడు. చిత్తగించండి.

తథామ్లలవణోత్తంసైః
వివిధై రాగషాడబైః (సుందరకాండ, ౧౧-౧౫)

"రాగషాడబాలు రెండూ ఉప్పూపులుసులతో కూడినవనీన్నీ, అవి రకరకాలున్నాయనీ ఆదికవి యభిప్రాయం. రాగం అంటే రసం, లేక చారు. షాడబమంటే పులుసు. పలచగా వుండేది రాగము; చిక్కగా వుండేది షాడబము.

"ఇక పులుసుకు షాడబ మనే పేరు ఎంతవరకు తగివుందో గమనిద్దాం...పులుసు ఆరురసాలతో కూడినది కాబట్టి 'షాడబ'మైనది.

"పులుసులో బెల్లం వేస్తారు. ఉప్పూ చింతపండూ విధిగా వుండాలి. తాలింపులో మిరపకాయలూ, ఆవాలూ యిత్యాదులు పడతాయి. ఇంకా రకరకాల రుచుల కాయగూరలు పడతాయి.

ఏతావతా పులుసు షడ్రససంయుక్తమైనదని అనడానికి ఎవ్వరికీ అభ్యంతరం వుండకూడదు."

అని శాసించినారు. పులుసుమీఁదఁ గల యాభిమానాతిశయముచే వీరింత నిర్దాక్షిణ్యముగ శాసించినను అభిప్రాయభేదమున కెడము లేకపోలేదు. రామాయణములోనుంచి వీ రుదాహరించిన 'తథామ్లలవణోత్తంసైః' అను శ్లోకమునందలి షాడవశబ్దమునకు ఆంధ్రానువాదకులుగాని, సంస్కృతవ్యాఖ్యాతలుగాని వీరు చెప్పినట్లు పులుసని యర్థము చెప్పలేదు. గోపీనాథము వెంకయ్యగారు "శర్కరాక్షౌద్రద్రాక్షాదాడిమమధురద్రవ్యవికారవిరళరసంబులఁ దత్సాంద్రరసంబుల"ననియు, నభినవాంధ్రవాల్మీకులు

"శర్కరయు ద్రాక్ష మొదలగు సరసవస్తు
పులుసు బులుసును లవణాదిలలితవస్తు
పులుసు జేర్చిన షాడబములును వివిధ
భక్ష్యములఁ గాంచె నాతఁ డప్పానభూమి"

యనియు 'రాగషాడవముల' నాంధ్రీకరించియున్నారు. వీరి యాంధ్రీకరణము గోవిందరాజాదుల వ్యాఖ్యానములపై నాధారపడియున్నది.

గోవిందరాజు:—"తథేత్యాది. ఆమ్లలవణోత్తంసైః ఆమ్లప్రధానైః లవణప్రధానైశ్చ. రాగషాడవైః రాగయుక్తైః షాడవైః. రాగః శ్వేతసర్షపః, "రాగ స్సిద్ధార్థకో జ్ఞేయః" ఇతి నారదశాస్త్రమ్. షాడవః షడ్రససంయోగకృతా భక్ష్యవిశేషాః. ప్రదీపే త్వన్యథోక్తమ్—

సితామధ్వాదిమధురో
ద్రాక్షాదాడిమజో రసః
విరలశ్చేత్ కృతో రాగ
స్సాన్ద్రశ్చేత్ షాడవః స్మృతః."

పులుసును ఉప్పును ప్రధానముగఁ గలదియును, తెల్ల ఆవాలతోఁ గూడినదియును ఆఱురసముల సంయోగమువలనఁ దయారుసేయఁబడినది 'షాడవ' మను భక్ష్యవిశేషమని గోవిందరాజు వివరించి, 'ప్రదీప' మను గ్రంథమున చక్కెర తేనె మొదలయిన మధుర ద్రవ్యములతోఁ గూడిన ద్రాక్షదాడిమఫలముల రసము తేటగఁ జేయఁబడిన రాగ మనియుఁ, జిక్కఁగఁ జేయఁబడిన షాడవ మనియు వివరణ మన్యథా సేయఁబడియున్న దని తెలిపినాఁడు.

మహేశ్వరతీర్థులు రాగషాడవములకు ఈ క్రింది తెలుఁగున వ్యాఖ్యానము వ్రాసియున్నారు.

"రాగషాడవైః శర్కరా క్షౌద్ర ద్రాక్షాదాడిమ మధుర ద్రవ్యాణాం వికారాః విరలరసాః రాగాః, త ఏవ వస్త్రగలితాః సాన్ద్రాః షాడవాః. తదుక్తమ్—

సితమధ్వాదిమధురా
రాగాస్తే స్వచ్ఛతాంగతాః
తే సాన్ద్రాః షాడవా స్తేప్య
స్తే వస్త్రగలితా ఇతి.
సితామధ్వాదిమధురా.........ఇత్యాది."

చక్కెర తేనె ద్రాక్ష దాడిముల రసము మొదలగు మధుర ద్రవ్యములచేఁ జేయఁబడిన రసము తేటదైనది రాగము. ఈ ద్రవ్యములచేఁ జేయఁబడిన రసము

వస్త్రగళితముసేయఁబడి చిక్కనిది లేహ్యరూపమైనది షాడవము.

సుశ్రుతసంహితయందును రాగషాడవములు చేర్కొనఁబడియున్నవి. మొదటిభాగమున ౪౬-వ అధ్యాయమున కృతాన్నవర్గయందు రెండుతావుల వీని ప్రస్తావన కలదు.

(౧) శ్లేయః పథ్యతమశ్చాపి
ముద్గయూషకృతాకృతః. ౩౭౭
సతు దాడిమమృద్వీకా
యుక్తఃస్యాద్రాగషాడవః
రుచిష్యో లఘుపాకశ్చ
దోషాణా మవిరోధకృత్. ౩౭౮

ఇందు దాడిమమృద్వీకరసయుక్తమైన ముద్గయూషమునకు (అనఁగా పెసరగంజికి) రాగషాడవ మని పేరైనట్లు చెప్పియున్నది.

(౨) లఘవో బృంహణా వృష్యా
హృద్యా రోచనదీపనాః
తృష్ణామూర్ఛా భ్రమచ్ఛర్ది
శ్రమఘ్నా రాగషాడవాః.

రాగషాడవములకు వ్యాఖ్యాత ఇట్లు వివరణము వ్రాసియున్నాఁడు.

"రాగషాడవగుణ మాహ లఘవ ఇత్యాది.
తత్ర రాగః.
సితారుచకసిన్ధూత్థైః
సవృక్షామ్లపరూషకైః
జమ్బూఫలరసై ర్యుక్తో
రాగో రాజికయాకృతః. ౩౮౩
షాడవాః పునర్మధురామ్లలవణ సంయోగజాః
నానావిధాః"

ఇచట చక్కెర, నిమ్మపండ్లరసము, రాతియుప్పు, చింతపండు, పెద్దకోఁదురసము, నేరేడుపండ్ల రసము, తెల్లఆవాలు మొదలగువానితోఁ దయారుచేయఁబడిన దానికి రాగమనియు, దీనికే యుప్పు తీపు పులుసులఁ గలిపిన షాడబ మనియు పేరని చెప్పియున్నది. ఓషధీ కోశమను నొక ప్రాచీనసంస్కృత కన్నడ నిఘంటువునందు షాడవ మన నొక యూషమని యున్నది.

నాట్యశాస్త్రమునందు విభావానుభావ వ్యభిచారి సంయోగమువలన రసనిష్పత్తి యెట్లు కలుగునో వివరించుచుఁ దత్సందర్భమున 'షాడవము' నేయు విధమును గొంత చెప్పియున్నాఁడు.

"తత్ర విభావానుభావవ్యభిచారిసంయోగా ద్రసనిష్పత్తిః. కో దృష్టాన్తః? అత్రాహ—యథాహి నానావ్యఞ్జనౌషధి ద్రవ్యసంయోగాద్రసనిష్పత్తిర్భవతి. యథాహి గుడాదిభి ర్ద్రవ్యై ర్వ్యఞ్జనౌషధిభిశ్చ షాడవాదయో రసా నిర్వర్త్యన్తే తథా నానాభావోపగతా అపి స్థాయినో భావా రసత్వ మాప్నువన్తీతి."

దీనిపై వ్యాఖ్య :—

"తత్ర లౌకికో౽యం మహా న్ దృష్టాన్త మన్తరేణ హృదయఙ్గమో భవే దిత్యాశయే నాహ. దృష్టాన్తో బహూనాం సంయోగా దపూర్వో రసఉత్పద్యమానత్వ దృష్ట ఇత్యర్థః. అత్ర ప్రశ్నే భాష్యేణ ప్రతివచన మాహ యథేత్యాది నాప్నువన్తీత్యన్తేన. వ్యఞ్జన ముపసేచనద్రవ్యమ్. తచ్చ నానా తిక్త మధుర చుక్రాది భేదా దధికాఞ్జికాని; ఓషధయ శ్శిఞ్చగోధూమదలహారిద్రాదయః; ద్రవ్యం గుడాది. ఏషాం పాక క్రమేణ సమ్యగ్యోజనారూపా త్కుశలసమ్పాద్యా త్సంయోగాత్ షాడవాదయ ఇతి. లోకప్రసిద్ధేభ్యః పరస్పర వివిక్తేభ్యో మధుర తిక్తామ్ల లవణ కటు కషాయేభ్యో మిశ్రేభ్యశ్చ విలక్షణః షాడవ శబ్దవాచ్యః. తత్ప్రసిద్ధా బహుతరా రససంయోగాః క్రియన్తే. తథైవ నానాభూతై ర్విభావాదిభి రుపసమీపం ప్రత్యక్షకల్పతాం గతా లోకాపేక్షయా యే స్థాయినో భావా స్తే రసస్య మానసైకజీవనం రసత్వం తత్ర ప్రతిపద్యన్తే.

ఏతదుక్తం భవతి. పాకరూపయా సమ్యగ్యోజనయా తావ ద్లౌకికో రసో జాయతే తత్రచ ప్రధానత్వేన జలస్య రసాభివ్యఞ్జక మితి వ్యఞ్జనం విభావస్థానీయం శిఞ్చాహారిద్రా ద్యనుభావప్రాయమ్. ద్రవ్యాణితు గుడాది తదీయ చుక్రాదిరస విలక్షణ మధురాదియోగా ద్వ్యభిచారికల్పం స్వాత్మని తదుపజీవనేనచ పరత్ర

స్వరస సంక్రమణయా వైచిత్ర్యాధాయకత్వాత్. అత్రతు స్థాయికల్ప స్తన్మిశ్రితానసముయభావిరస విశేషో విభావకల్ప వ్యఞ్జన జనితో మన్తవ్యః. సహి లౌకికః. అయన్తు కుశలైక నిర్వర్త్యః తద్విదాం రసనీయో భవతి తేనాన్నస్యైవ త్యాజ్యాహారో వయుక్తః. యథాహి దార్ష్టాన్తికసూత్రే స్థాయిగ్రహణం కల్యకల్పమితి త్రయమేవో పాత్తం తథా దృష్టాన్తేఽపి త్రయస్యైవోపాదానం యుక్తమ్."

ఇందువల్ల నానావిధవ్యంజనౌషధి ద్రవ్యసంయోగమువలన వీనికంటె భిన్నమైన షాడవాదిరసములు సిద్ధముచేయఁబడువని తెలియుచున్నది. మఱియు వ్యంజనము లనఁగా (ఒకపదార్థముతోఁ)గూడ చేర్పఁబడు వస్తువులనియు, నవి నానావిధమైన చేదు తీపు పులుసు మున్నగు భిన్నరుచులు గల మజ్జిగ కలి మొదలగునవి యనియు, నౌషధులన చింతపండు గోధుమరవ పసుపు మున్నగునవి యనియు, ద్రవ్యము లన బెల్లము మొదలగునవి యనియు, నీయౌషధివ్యంజనద్రవ్యములు పాకశాస్త్రవిశారదుఁడగు వంటవానిచే చక్కఁగ సమకూర్పఁబడుటచే షాడవాదులు తయారగుచున్నవనియు, నందు జలాంశమే ప్రధానమనియుఁ, గొందఱి మతానుసార మిది యన్నముతోఁగూడ భోజ్యమైనను, షాడవము నన్నముతో నెట్టిసంబంధము లేక స్వతంత్రముగనే సేవించవలయుననియు వ్యక్తమగుచున్నది.

పైఁజెప్పిన యంశముల నన్నిటిని అవగాహనము జేసికొని యోచించిచూడఁగా షాడవస్వరూపమును గూర్చియు, దానిసేయుటయందు వినియోగించు వస్తువులనుగూర్చియు నభిప్రాయభేద ముండునట్లు తెలియవచ్చుచున్నది. షాడవము లొక్కవిధమైనవి కావు; నానావిధములైన వగుటచే వివిధమైన షాడవములను సిద్ధముసేయుటయందు వాడఁబడు పదార్థములన్నియు నొక్కవిధమున నుండక భేదమైయుండుట సహజము. పైఁగానవచ్చెడి యభిప్రాయభేదమున కిది యొకకారణము గావచ్చును; కాని ప్రాచీను లెవ్వరును శ్రీ దీపాలపిచ్చయ్యశాస్త్రిలవారివలె నది 'టిఫి'యనియు, వారి ప్రియమిత్రులగు శ్రీ బులుసు వెంకటరమణయ్యగారివలె 'పులుస'నియు, శ్రీ డా. చిలుకూరి నారాయణరావుపంతులవారివలె 'కుడుము' లేక 'ఉండ్రాయి' యనియు నర్థము చెప్పలేదు. గోవిందరాజొక్కఁడు దక్క ఇది భక్ష్యమని చెప్పినవా రెవ్వరును లేరు. లేహ్యమని కొందఱు నిర్ణయించిరి. కాని సర్వసామాన్యముగ నందఱును దీనిని పానీయముగనే గ్రహించిరి.

'షాడబము'వంటి సంస్కృతపదముల కర్థనిర్ణయము సేయవలసినప్పుడు కేవలము తెనుఁగుప్రబంధములలోని ప్రయోగములపై నాధారపడక, సంస్కృతగ్రంథములమూలముననే వాని యర్థమును సాధింపఁగవఁగుట యుక్తము.



# తత్త్వమసి



— శ్రీ శ్రీరంగం నారాయణబాబు —

ఎవరా అతను?
చంద్రుడిలో మచ్చను
మందులా నాకేసిన
మహానుభావుడు!

చలించే చుక్కల
చూపులతో తన
చూపులు కలిపి
తారల చలనాన్నే
బంధించిన
హృదయబాంధవుడు!

నా శరీరంలో
నెత్తుటి బంధూకవనాన్ని
గాలై కదిపి
పాటలు పాడించిన
పరంజ్యోతి!
నాకలల ఆసీలు
మెట్టుదగ్గర
కైఫీయత్ చెల్లించి
హృదయహాజారానికి
వజ్రవైఢూర్యాల
జాలకాలు నిర్మించి
వాటికి సేద్యగాని
చెమటతో ముత్యాల
తోరణా లల్లి
నా నరాల తీగల
వరాల పాటలు పాడ
హృదయగర్భాలయంలో
కంచుగంట మ్రోగించి
నా వెన్నముకనే
శివధనుస్సుగా విరిస్తే
కుండలిలో అవ్యక్తం
జగమంతా నిండితే
సముద్రమే సంజీవపర్వతమైంది.

ఘటమంటూ
లేకుండానే
గట్లు దాటిన ఆత్మ
సూర్యభగవానుడు
తన కిరణాల బంగారు
సూదుల ఆకాశం జోలిలో వేసి
నరుడై నల్లబడి
అమ్మడానికి వస్తే
చెన్నపట్నవాడవదిన
జగమంతా కమ్మరివీథి
అని చెప్పింది.

నీవే హంసవైతే
నల్లగా ఉన్నావేమన్నా
పిచ్చివాడా, తెలియదా!
దీని తత్త్వం మసి!

గరళకంఠుడు నిద్రపోతే
గళమే నల్లకలువ కాదని
కొరికా అంచేత.

అయితే ఎప్పుడు
తెల్లబడతా వన్నా.
ఎప్పుడు యీవిశ్వమానవ
సహస్రారం అర్పిస్తే
అప్పుడు అంది!

యులు ప్రభువు లగుటయు, మహమ్మదీయేతరులు వారికి లోబడిన ప్రజ లగుటయు సంభవించును. తక్కిన రాష్ట్రములలోని మహమ్మదీయుల స్థితి ఎట్టిదైనను ఈ రాజ్యములలో మాత్రము హిందువుల పరిపాలనక్రింద మహమ్మదీయు లుండుట అను ప్రమాదము తప్పి పోవును. ఈతీర్మానములో లీగుసభవారు కోరినది పరిపూర్ణస్వాతంత్ర్యము. అనగా ఈ రాజ్యముల రక్షణ, విదేశములతోటి వ్యవహారములు, సుంకములు, రాకపోకలు, చెలామణి మొదలైన వివిధవిషయములను నిర్ణయించు అధికారము ఈ రాజ్యములలోని మహమ్మదీయులదే. (పాకిస్థాన్ అనే పేరు లాహోరుతీర్మానమందు లేకున్నను, ఈ రెండు రాజ్యములకు పాకిస్థాన్ అనే పేరని లీగువారు, లీగు నాయకులు వ్యాఖ్యానముచేసియున్నారు.) (౨) ఇట్లేర్పడ్డ పాకిస్థానంలో మహమ్మదీయులుకాని హిందువులు, శిక్కులు, క్రైస్తవులు మొదలగు ప్రజల గతి ఏమిటి అన్నదానికి లాహోరుతీర్మానంలో సమాధానం ఉన్నది. మహమ్మదీయేతరులగు అల్పసంఖ్యాకులహక్కులను కాపాడుటకు కావలసిన రక్షణ లన్నిటిని పాకిస్థానరాజ్యాంగవిధానంలో చేర్చడం జరుగుతుంది. గనుక ఏలాటి భయం లేకుండా వారు పాకిస్థానంలో మహమ్మదీయులతోపాటు పౌరులుగ నుండ వచ్చును.

ఈ రెండు సూచనల ఫలితం భరతఖండం రాజకీయంగా రెండురాజ్యాలుగా పంపకంకావడమే. ఒక రాజ్యం హిందూస్థానం; మరొక రాజ్యం పాకిస్థానం. ఇవి రాజ్యాలుగా ఉండేవికాని రాష్ట్రాలుగాఉండవు. రాజ్యానికీ రాష్ట్రానికీ గల భేదాన్ని ఈసందర్భంలో మనం మరవకూడదు. కొన్ని అధికారాలను మాత్రం అనుభవించే ప్రదేశం రాష్ట్రం; సమస్తఅధికారాలను అనుభవించేది రాజ్యం. రాష్ట్రాలంటే కొన్నివిషయాలలో ఒక కేంద్రప్రభుత్వానికి లోబడ్డ ప్రదేశాలు; రాజ్యం అంటే బాహ్యమైన ఏలాటి కేంద్రప్రభుత్వానికీ లోబడని ప్రదేశం—సంపూర్ణస్వాతంత్ర్యం కల ప్రదేశం అన్నమాట.

దేశాన్ని ఈమోస్తరుగా విభజించడమేహిందూ మహమ్మదీయసమస్య పరిష్కారంకావడానికి మార్గం అని లీగుమహాసభవారు, జిన్నాగారు తీర్మానించడంలో వారి అభిప్రాయం, వారివాదం ఏలాటివో కొంత తెలుసుకోవలసిఉంది. (౧) బ్రిటిషువారి అధికారం తొలగిపోయినపిమ్మట స్వాతంత్ర్యభరతఖండంలోఏర్పడే ప్రభుత్వం ప్రజాప్రభుత్వం. బ్రిటిషువారు రాకపూర్వం దేశాన్ని పాలిస్తున్న మొగలాయిచక్రవర్తులుగాని,మహమ్మదీయులు రాకపూర్వం దేశాన్ని పాలిస్తున్న హిందూ చక్రవర్తులుగాని పునఃస్థాపితం కావడం సాధ్యంకాని పని. ప్రజాప్రభుత్వవిధానమే ఈకాలానికి అనుగుణమైన విధానం. కాని భరతఖండంలోని ౩౯ కోట్ల ప్రజలలో మహమ్మదీయుల సంఖ్య ౯ కోట్లుమాత్రమే. ౨౬ కోట్ల హిందువు లున్నారు. ఈపరిస్థితులలో ప్రజాప్రభుత్వం అంటే అధికసంఖ్యాకులయిన హిందువుల ప్రభుత్వంగానే ఉండడం తప్పదు. దేశానికంతా ఏర్పడ్డ కేంద్రప్రభుత్వంలోని శాసనసభలలోను, మంత్రివర్గాలలోను,న్యాయస్థానాలలోను, ఉద్యోగాలలోను, రక్షణబలాలలోను హిందువులే ఎక్కువగాఉండెదరు. వారి మాటయే సాగును. వారికి తల ఒగ్గి మహమ్మదీయులు ప్రవర్తించవలసిఉంటుంది. బ్రిటిషువారి అధికారం తొలగిపోవుటవలన హిందువులకుమాత్రమే స్వరాజ్యం రాగలదుగాని మహమ్మదీయులకు పరాధీనత తప్పదు. బ్రిటిషువారి అధీనానికి బదులు హిందువుల అధీనం ఏర్పడుతుంది. (౨) హిందువులకు లోబడి మహమ్మదీయులు ఉండడం నష్టకరం కావడమే కాక వారి గౌరవానికి, ప్రతిష్ఠకు భంగం. హిందువులకు, మహమ్మదీయులకు చిరకాలానుండి బద్ధవైరంఉన్నది. అధికారం అంతా తమ హస్తగతం కాగానే హిందువులు ఆ అధికారాన్ని మహమ్మదీయులను బాధించుటకును, వారికి నష్టము కలుగజేయుటకును, వారి మతము, వేషము, భాష, విజ్ఞానము మొదలగువాటిని నిరోధించుటకును ఉపయోగించెదరు. (౩) ఇదిగాక మహమ్మదీయులు ఒక ప్రత్యేకజాతికి (Nation: నేషన్) చెందినవారు. వారికీ హిందువులకూ ఏవిషయంలోనూ ఏలాటి సమానలక్షణాలు లేవు. మతమును బట్టేకాకుండా ఆచారాలు, ఆహారం, వేషం, విజ్ఞానం మొదయిన ప్రతిఅంశంలోనూ వారు భిన్నులు.

# హిందూమహమ్మదీయ సమస్య

## గాంధీజిన్నాగార్ల సంభాషణలు



= శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య =

పరాధీనంలో ఉన్న మన దేశాన్ని స్వాధీనం చేసుకొని, స్వరాజ్యం స్థాపించుకొనుటకై నలభై సంవత్సరములనుండి మనము చేయుచున్న ప్రయత్నములు, త్యాగములు ఇప్పటికికూడ సఫలము కాకుండుటకు గల కారణములలో హిందూమహమ్మదీయసమస్య పరిష్కారముకాకపోవుట ప్రబలమైనదిగ నున్నది. దీనిమూలాన స్వరాజ్యసమరమును సాగించు భారము చాలవరకు ఒక హిందువులపైననే పడుతున్నది. మహమ్మదీయులుకూడ వారితో కలిసి బ్రిటిషువారిపై ఒత్తిడి కలిగించినయెడల స్వరాజ్యసంపాదనము సులభము కాగలదు. ఈ సఖ్యతను కుదుర్చు ఉద్దేశముతోడను, ఇంతకాలమునుండి పరిష్కారముకాని హిందూమహమ్మదీయసమస్యను పరిష్కరించుటకును గాంధీ జిన్నా గార్లు ఈమధ్యన కలుసుకొని దీర్ఘచర్చలనేకములు చేసి తుదకు ఏలాటి రాజీకి రాలేకపోవడం చాలా విచారకరమైన విషయము. వీరిద్దరికి రాజీ కుదరకపోవడానికి కారణమైన ప్రధాన అభిప్రాయభేదాలను తెలుసుకొనుట ప్రజలందరికి కర్తవ్యము.

హిందూమహమ్మదీయసమస్యయొక్క స్వరూపమేదో అందరికీ తెలిసిన విషయమే. బ్రిటిషువారి అధికారం తొలగి, భరతఖండం అంతా భారతీయుల పాలనలోకి వచ్చినప్పుడు హిందువులు, మహమ్మదీయులు కలిసి స్వతంత్రభరతఖండమందు పౌరులుగ నుండుట సాధ్యమా అనేదే ఈసమస్య. ఏడెనిమిది సంవత్సరాలకు పూర్వము ఈసమస్య లేనేలేదు. ఇందులో సాధ్యముకాని దేమియు లేదు; సరియైన రాజ్యాంగ విధానము నేర్పరచి మహమ్మదీయుల హక్కులను రక్షించుటకు కావలసిన ఏర్పాటుల నన్నిటిని ఆవిధానములో సమకూర్చినయెడల ఇది సాధ్యమగు పనియే అని హిందువులతోపాటు మహమ్మదీయులుకూడ అభిప్రాయపడియుండిరి. కాని ౧౯౩౭ తర్వాత, కాంగ్రెసుప్రభుత్వాలు ఏడురాష్ట్రములలో ఏర్పడి, వాటిలోని మంత్రివర్గములలో ముస్లింలీగుకు సంబంధించిన మహమ్మదీయులకు ఎట్టి స్థానము లేకుండుట మిషగా తీసుకొని, కాంగ్రెసుమంత్రివర్గమువారు ఈరాష్ట్రములలోని మహమ్మదీయులను నానాబాధల పెట్టినారనిన్ని, అట్టి బాధలనుండి వారిని రక్షించుటకు గవర్నరుల కెట్టి అధికారమును లేకుండెననిన్నీ ఒక ప్రచారము గావించి, హిందువులు అధిక సంఖ్యాకులుగ ఏర్పడ్డ ప్రభుత్వము లన్నిటియందు మహమ్మదీయులకు న్యాయము దొరకదను వాదమును లేవదీసి, అలాటి ప్రభుత్వముక్రింద హిందువులు, మహమ్మదీయులు కలిసి పౌరులుగ నుండుట సాధ్యము కాని పని అను తీర్మానమునకు వచ్చిరి. ౧౯౪౦ లో లాహోరుపట్టణమున లీగుమహాసభ సమావేశమైనప్పుడు సభవారు గావించిన తీర్మానమునకు ఇదియే కారణము. గాంధీజిన్నా గార్ల సంభాషణలలో జిన్నా గారి ఆయుధం ఈ లాహోరుతీర్మానమే.

ఈ లాహోరుతీర్మానములో ప్రధానసూచనలు రెండున్నవి: (౧) భరతఖండంలోని వాయవ్యభాగమందున్నట్టి పంజాబు, వాయవ్యసరిహద్దురాష్ట్రము, బెలూచిస్థానము, సింధురాష్ట్రములున్నూ, ఈశాన్యభాగమందుండు బంగాళారాష్ట్రము, అసాంరాష్ట్రము ఇవన్నీ భరతఖండమునుండి రాజకీయముగ విడిపోయి పరిపూర్ణస్వాతంత్ర్యము ననుభవించు రాజ్యములుగ ఏర్పడవలెను. ఇట్లేర్పడిన ఈరాజ్యములలో మహమ్మదీయుల సంఖ్య అధికముగ నుండుటచేత మహమ్మదీ

గనుక భరతఖండంలో హిందువులు, మహమ్మదీయులు అను రెండు జాతులవారున్నారు. రెండుజాతులవారున్నప్పుడు రెండు స్వతంత్రప్రభుత్వాలు ఉండడం న్యాయం. ఒకే జాతివారు మరొక జాతివారికి లోబడిఉండడం ధర్మవిరుద్ధమను "జాతీయసిద్ధాంతం, స్వయంనిర్ణయసూత్రం" ౧౯, ౨౦ శతాబ్దాలలో నిర్మింపబడ్డ క్రొత్త రాజ్యాలన్నిటికీ మూలాధారం కదా? ఈ ధర్మం, ఈ సూత్రం మహమ్మదీయులపట్ల తప్పక వర్తించవలసి ఉంది. అట్లుగాక భరతఖండానికంతా ఒకే కేంద్రప్రభుత్వం ఏర్పడడం, మహమ్మదీయజాతి దానికి లోబడి ఉండడం ఈ స్వయంనిర్ణయసూత్రానికి విరుద్ధం కావడమేకాకుండా, మహమ్మదీయజాతియొక్క పేరుప్రతిష్ఠలకు భంగకరమైనది. ఒకప్పుడు హిందువులందరిపై పరిపాలకులుగ నుండిన వారు ఇకమీదట హిందువులకు లోబడిఉండడంకంటే అప్రతిష్ఠ మరొకటి ఏమి ఉన్నది? (౪) ఏలాగైనా ఈ అప్రతిష్ఠ రాకుండ చేసుకొనవలెను. దానికి భరతఖండాన్ని పాకిస్థాన్, హిందూస్థాన్ అనే రెండు స్వతంత్రరాజ్యాలుగా విభజన చేయడమే మార్గం. హిందూస్థానంలో హిందువులకు స్వాతంత్ర్యంఉన్నట్లు పాకిస్థానంలో మహమ్మదీయులకు స్వాతంత్ర్యం ఉంటుంది. అందుచేత వారు తలయెత్తుకొని మర్యాదతో జీవించుటకు అవకాశం ఏర్పడుతుంది.

హిందూమహమ్మదీయసమస్య పరిష్కారం కావడానికి పాకిస్థాన్‌రాజ్య సంస్థాపనకు హిందువులు అంగీకరించుటయే మార్గం అని జిన్నాగారు పై కారణాలవల్ల అభిప్రాయపడుతున్నారు.

వారి వాదం సబబుకాదనిన్నీ, దేశాన్ని రాజకీయంగా రెండు భాగాలు చేయడంవల్ల అనంతములైన చిక్కులు, క్లిష్టపరిస్థితులు ఏర్పడగలవనిన్నీ, అట్టివిభజన రాకుండుటకును, భరతఖండం అఖండంగా ఉండడానికిని తన యావచ్ఛక్తిని వినియోగించవలసి ఉంటుందనీ మహాత్మాగాంధీగారు ఇదివరలో చెప్పిఉండిరి. ఆలాగు చెప్పినా విభజనే మూలసూత్రంగా పెట్టుకొన్న జిన్నాగారితో సంభాషణలకు పూనుకోవడం విపరీతంగా కనిపించవచ్చును. కాని దేశంలోని పరిస్థితులు మారినప్పుడు అభిప్రాయాలను మార్చుకోవడంలో అధర్మం ఏమీ లేదు. ఇంతేగాక దేశాన్ని విభాగం చేయకుండా, లాహోరు తీర్మానంలోని పరమార్థాన్ని సాధించుటకు అవకాశం ఉన్నదని మహాత్మాగాంధీగారి అభిప్రాయం; ఆ అవకాశాన్ని జిన్నాగారికి సూచించి, దానికి గల సబబుల నన్నిటిని అతనికి నచ్చచెప్పి, అతని హృదయాన్ని మార్చవచ్చు నను నమ్మకం మహాత్మాగాంధీగారికి ఉండినది. ఈ కారణాలచేత వారు జిన్నాగారితో హిందూమహమ్మదీయ సమస్య పరిష్కారానికై సంప్రతించుటకు అంగీకరించారు.

దేశంలోని పరిస్థితులలో కలిగిన మార్పు ఏమిటి? స్వరాజ్య సంపాదనానికై దేశంలో సమరం జరుగుతున్న దన్నమాట మనం మరవకూడదు. ఏలాగైనా బ్రిటిషువారి అధికారాన్ని తొలగించి, స్వరాజ్యాన్ని స్థాపించడమే గాంధీగారి వ్రతం; కాంగ్రెసుపక్షం వారి వ్రతంకూడా ఇదే. ఈసమరంలో జయం రావలసి ఉన్నది. జయం వచ్చే సూచనలు కొన్ని కనుపించుచున్నవి. ఇటీవలివరకు బ్రిటిషువారు భరతఖండానికి అనుగుణమైన రాజ్యాంగవిధానాన్ని ఏర్పరచడం తమ విధి అనిన్నీ, తమ బాధ్యత అనిన్నీ వాదిస్తుండేవారు. ఇప్పుడు చాలవరకు ఆ వాదం వదలుకొన్నారు. మన రాజ్యాంగవిధానాన్ని మనమే ఏర్పరచుకోవడం ధర్మమార్గం అని వా రంగీకరించారు. క్రిప్సుప్రణాళికలోను, దరిమిల్లా రాజప్రతినిధిగారు అమెరీగారు వ్యక్తపరచిన అభిప్రాయా లన్నిటిలోకూడా మనకు ఈ స్వయం నిర్ణయాధికారం ఉన్నట్లు ఒప్పుకొన్నారు. దేశంలోని వివిధపక్షాలవారు ఏ రాజ్యాంగవిధానాన్ని అంగీకారపూర్వకంగా ఏర్పరచుకొంటే ఆవిధానాన్ని తాము అమలులోపెట్టి తమ అధికారాన్ని వదలుకొనుటకు సంసిద్ధులుగా ఉన్నట్లు పదేపదే చెప్తున్నారు. అధికారం భారతీయుల చేతులలోకి వచ్చినగాని ప్రజల సౌఖ్యానికి, ఐశ్వర్యానికి కావలసిన ఏర్పాటులను చేసుకొనుటకు వీలుండదు. దేశంలోని వివిధపక్షాలలో హిందువులు, మహమ్మదీయులు ముఖ్యులు. వీరికి సామరస్యం కుదిరితే తక్కినవారి సామరస్యం సంపాదించడం సులభం. మనలో అంగీకారం ఏర్పడడమే

తిరువాయిగా తాము తమ అధికారాన్ని అంతను వద లుకొనునట్లు బ్రిటిషువారు ఘోషిస్తున్నప్పుడు అట్టి అంగీకారానికి అవకాశాలను ఏర్పరచుకొనుటలో గాంధీగారు జిన్నాగారిని కలుసుకోవడం సబబు. ఈ కారణంచేతనే వారు సమావేశానికీ, సంభాషణ లకూ పూనుకొన్నారు.

ఇదిగాక లాహోరు తీర్మానంలో లీగుమహాసభవారు కోరిన దేశవిభజనకు కొన్ని షరత్తులకు లోబడి రెండుపక్షములవారూ అంగీకరించుటకు అవకాశం ఉన్నట్లు గాంధీగారు భావించారు. ఆషరత్తులు చాలా సబబైన షరత్తు లనిన్నీ, వాటికి అంగీకరించడంవల్ల మహమ్మదీయులకును, పాకిస్థాన్‌వాదులకును ఏలాటి నష్టమూ కలగకపోవడమే కాకుండా చాలా లాభంకూడా కలుగుతుం దనీ గాంధీగారు నమ్మినవా రగుటచేత ఆ షరత్తులను జిన్నాగారికి వివరిస్తే వారు కూడా దానికి సమ్మతిస్తా రనే నమ్మకం వారికి కలిగింది.

ఈ షరత్తుల నన్నిటిని పొందుపరచి శ్రీ రాజగోపాలాచారిగారు ఒక ప్రణాళికను ౧౨ సంవత్సరం క్రిందట తయారుచేసి, గాంధీగారి ఆమోదాన్ని సంపాదించారు. ఆ ప్రణాళికను ప్రాతిపదికగా పెట్టుకొని, దానికిని లాహోరు తీర్మానానికిని సామరస్యం కుదర్చడానికి గాంధీగారు ఈ సంభాషణలలో విశ్వప్రయత్నం చేశారు. ఆ ప్రణాళికలోని సూత్రాలు, షరత్తులు ఏలాటివో తెలుసుకొనుట అవసరము. (౧) భరతఖండానికి స్వాతంత్ర్యం లభించవలసి ఉన్నదన్న అభిప్రాయంతో లీగు మహాసభవారు ఏకీభవించి, స్వాతంత్ర్యం లభించువరకూ ఏర్పాటుకావలసిన తాత్కాలిక ప్రభుత్వ స్థాపనలో లీగువారు కాంగ్రెసువారితో కలిసి పనిచేయవలెను. (౨) యుద్ధము ముగియగానే దేశము యొక్క వాయవ్య ఈశాన్యభాగములలో ఏయేవరుస జిల్లాలయందు మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగా ఉన్నారో నిర్ణయించుటకు ఒక ఉపసంఘం (Commission) ఏర్పరచబడును. ఆ నిర్ణయం జరిగినతర్వాత, ఆలాటి జిల్లాలన్నీ హిందూస్థానాన్నుండి వేరు కావలెనా అనే విషయం తేలడానికి వాటిలోని వయస్సు వచ్చిన (Adults) ప్రజల అభిప్రాయాన్ని వోట్ల మూలంగా తెలుసుకొనవలెను. అధికసంఖ్యాకులు విభజనపక్షాన వోటుచేసినయెడల ప్రజాభిప్రాయాన్ని అనుసరించి పరిపూర్ణ స్వాతంత్ర్యంతో ప్రత్యేకరాజ్యం ఏర్పడవలెను (౩) ప్రజాభిప్రాయం తేలడానికి ముందు వివిధపక్షములవారు విభజనమూలమున కలిగే లాభనష్టాలనుగురించి ప్రజలలో ప్రచారం చేయవచ్చును. (౪) విభజన జరుగునప్పుడు (పాకిస్థాన్ హిందూస్థాన్ రాజ్యాలమధ్యన) దేశరక్షణ, వ్యాపారము, రాకపోకలు, తక్కిన ప్రధాన సౌకర్యాలు సవ్యంగా జరగడానికి కావలసిన ఒడంబడికలు ఏర్పడవలెను. (౫) ఒక రాజ్యంలోనుండి మరొక రాజ్యంలోనికి ప్రజలను మార్చడం ఐచ్ఛికంగా ఉండవలసిందేకాని నిర్బంధంగా ఉండకూడదు. బ్రిటిషువారు వారి అధికారాన్నంతా వదలుకొని, భరతఖండాన్ని పాలించే సర్వాధికారం, బాధ్యత భారతీయుల వశము చేసిన నాడే పైషరత్తులన్నీ అమలులోనికి రావలెను.

రాజగోపాలాచారిగారి ప్రణాళికకును, లాహోరు తీర్మానానికిన్నీ గల భేదములను మనం గమనింపవలెను. (౧) దేశంయొక్క విభజన జరగవలసి వస్తే ఆ విభజన బ్రిటిషువారు వారిఅధికారం వదలుకొనిన తర్వాత జరగవలసిందేకాని, వారి అధికారం ఉన్నప్పుడు కాదు అనేది ఆచారిగారి ప్రణాళికలోని ప్రధానసూత్రం. ఈ విషయాన్నిగురించి లాహోరు తీర్మానంలో ప్రస్తావన స్పష్టంగా లేదు. ఇది చాలా ముఖ్యమైన విషయం. హిందూమహమ్మదీయ సమస్యను ఏలాగైనా పరిష్కారం చేసుకోవడం అత్యావశ్యకమని గాంధీగారు అనుకొనడానికి కారణం ఈ పరిష్కారమూలంగా మహమ్మదీయులకు, హిందువులకు ఐకమత్యం ఏర్పడి, ఇరుమతములవారూ కలిసి బ్రిటిషువారి అధికారాన్ని తొలగించి దేశంలో స్వరాజ్యస్థాపన చేసుకోవడం సులభం అవుతుందని అనుకోవడమేకదా? వారి అభిప్రాయంలో స్వరాజ్య సంపాదనానికి ఈపరిష్కారం సాధనమైనప్పుడే దానికి అంగీకరించుట మంచిది. స్వరాజ్య సంపాదనంలో అది ఉపకరించనినాడు పరిష్కారం వ్యర్థం. ప్రస్తుత కాలంలో మనం ఏపనికి పూనుకొన్నా దానిమూలంగా

స్వరాజ్య సంపాదనం సులభం కాగలదా, కష్టం కాగలదా అనే విషయాన్ని మరవకూడదు. "పాకిస్థాన్ స్థాపనను అంగీకరించిన పక్షాన లీగువారు స్వరాజ్యస్థాపనకై జరుగుసమరములో పాల్గొనెదరా" అన్న ప్రశ్నకు జిన్నాగారు సరియైన జబాబు చెప్పలేరు.

(౨) "దేశం విభజనకావలసిందీ లేనిదీ నిర్ణయించే అధికారం ప్రజలకు ఉండవలెనేకాని, నాయకులు ఎంత గొప్పవారైనా, ఎంతటి పలుకుబడి గలవారైనా ప్రజలను కాదని అంతటి మహత్తర విషయాలను నిర్ణయించకూడదు" అనేది ఆచారిగారి ప్రణాళికలోని రెండవ ప్రధానసూత్రం. విభజనవలన కలిగే లాభాలు, నష్టాలు అనుభవించవలసినవారు ప్రజలు గనుక ఈపద్ధతే సమంజసమైనది. లాహోరు తీర్మానంలో ఈ ప్రశంసే లేదు. ఇందువిషయమైకూడ జిన్నాగారికిన్నీ, గాంధీగారికిన్నీ అభిప్రాయ భేదాలు ఏర్పడి ఏలాటి రాజీ కుదురలేదు. "మహమ్మదీయులు ప్రత్యేక జాతికి చెందినవారు. ఆకారణంచేత ప్రత్యేకమైన స్వతంత్రరాజ్యం వారికి ఉండుట వారి జన్మహక్కు. అందునుగురించి ప్రత్యేకంగా ప్రజాభిప్రాయం కనుగొనవలసిన జరూరులేదు." అని జిన్నాగారి వాదం. ఒకవేళ ప్రజాభిప్రాయం కనుగొనవలసివచ్చినా మహమ్మదీయ ప్రజల అభిప్రాయం మాత్రమే కనుగొనవలెనుగాని మహమ్మదీయేతరుల అభిప్రాయం కనుగొనవలసిన జరూరు లేదని జిన్నాగారి వాదం. పాకిస్థాన్ రాష్ట్రముల లోని ప్రజలందరి అభిప్రాయం కనుగొనటయే ధర్మమని గాంధీగారి వాదం. ఏలనగా, ఆరాష్ట్రాలలో రాజకీయంగా ఏమార్పు జరిగినా దాని ఫలితాలను అనుభవించేవారు ఒక మహమ్మదీయులు మాత్రమే కాదు; మహమ్మదీయేతరులు కూడాను. ప్రభుత్వపు చర్యలవలన కలుగు ఫలితము లనుభవించవలసినవారందరు ఆచర్యలను విమర్శించు హక్కు కలవారనుట ప్రజాప్రభుత్వానికి మూలసూత్రం. ప్రజల అభిప్రాయాన్ని అనుసరించిన్నీ, ప్రజల ఆమోదాన్ని పొందిన్నీ జరుపబడు ప్రభుత్వమే ప్రజాప్రభుత్వం అని అందరూ అంగీకరిస్తున్నారు. అట్టి సందర్భంలో ప్రజలలో ఒక భాగం అయిన మహమ్మదీయేతరుల అభిప్రాయాన్ని తెలుసుకొనకయే ఇంతటి గొప్పమార్పు చేయడం ప్రజాస్వామ్యసిద్ధాంతానికి విరుద్ధం. మహమ్మదీయేతరుల అభిప్రాయప్రకారం నడుచుకొనకపోయినా వారి అభిప్రాయం ఎట్టిదో తెలుసుకొనడం ధర్మం. నేరస్థుని విషయంలోకూడా అతడు చెప్పదలచుకొన్న మాటలను వినికదా న్యాయాధ్యక్షుడు తీర్పు చెప్పుట! అలాటి సందర్భంలో నేరస్థులకన్న పౌరులను హీనులుగా చూచుట న్యాయవిరుద్ధం.

(3) ఏజిల్లాలలో మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగా ఉన్నారో వాటినిమాత్రమే పాకిస్థానంలో చేర్చవలెనని ఆచారిగారి సూత్రం. "జిల్లాలు, రాష్ట్రాలు" అన్న మాటలు లాహోరు తీర్మానంలో లేవు. "Units, Areas" (ప్రదేశాలు) అన్న మాటలు కనుపిస్తున్నవి. కాని లాహోరు తీర్మానానికంతా మూలాధారం మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగా ఉండడమేకదా? గనుక ఏప్రదేశాలలో—అంటే ఏజిల్లాలలో—వారు అధికసంఖ్యాకులుగా ఉన్నారో ఆలాటి జిల్లాలనుమాత్రం పాకిస్థాన్ రాజ్యంలో చేర్చడం న్యాయం. జిన్నాగారు దీనికి ప్రతికూలురు. ఏరాష్ట్రాలలో వారు అధికసంఖ్యాకులుగా ఉన్నారో ఆరాష్ట్రాల నన్నిటినీ పాకిస్థానంలో చేర్చవలసిందని వారి వాదం. కాని ఇది మహమ్మదీయేతరులపట్ల అన్యాయం. ఈరాష్ట్రాలలోనే కొన్ని జిల్లాలయందు మహమ్మదీయేతరులు అధికసంఖ్యాకులుగా ఉన్నారు. ఆలాటి సందర్భంలో ఆజిల్లాలనుకూడ పాకిస్థానంలో కలపడం వారికి నష్టం. ఇదిగాక జిన్నాగారి వాదానికంతా ఆధారం ఏమిటి? "భరతఖండం అంతలో హిందువులు అధికసంఖ్యాకులైనా వారి ఇష్టప్రకారం రాజ్యాంగవిధానం ఏర్పడకూడదు. అల్పసంఖ్యాకులగు మహమ్మదీయుల ఆమోదంకూడా ఉండవలెను. ఇంతేగాక కొన్ని రాష్ట్రాలలో మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగా ఉన్నారుగనుక ఆరాష్ట్రాలు ప్రస్తుతం భరతఖండంలో ఒకభాగంగా ఉన్నా, అవి ప్రత్యేక రాజ్యాలుగా ఏర్పడడం సబబు" అనేకదా? ఈ వాదమే సహేతుకమైతే, పాకిస్థాన్ రాష్ట్రంలో మహమ్మదీయేతరులు అధికసంఖ్యాకులుగా ఉండే

జిల్లాలను పాకిస్థానమునుండి వేరుచేసి హిందూస్థానంలో కలపడం సమంజసంకదా? "మా ఇంటికి వస్తే ఏం తెస్తావు? మీ ఇంటికి వచ్చినప్పుడు ఏం ఇస్తావు" అనే సామెతే జిన్నాగారి వ్యాఖ్యానానికి ఆధారంగా కనిపిస్తున్నది.

(౪) విభజనమూలంగా ఏర్పడ్డ పాకిస్థాన్ హిందూస్థాన్ రాజ్యాలకు రక్షణ, విదేశవ్యాపారము, రహదారులు, తదితరములైన ప్రధానసౌకర్యాలు మొదలైన వాటియొక్క పరిపాలన విషయంలో పరస్పర సంబంధం ఉండవలెనని ఆచారిగారి సూత్రం. ఈ సంబంధం ఉంటే ఉండవచ్చును, లేకపోతే లేకపోవచ్చును అనేది జిన్నాగారి మతం. లాహోరు తీర్మానంలో దీనినిగురించి స్పష్టంగా ఏమీ లేదు.

లాహోరు తీర్మానానికిన్ని, ఆచారిగారి ప్రణాళికకును గల భేదాలన్నిట్లోకూడా అగ్రగణ్యమైనది ఇదే. "పంచుకొన్న తర్వాత పాకిస్థాన్ ప్రభుత్వానికీ, హిందూస్థాన్ ప్రభుత్వానికీ సంబంధం ఏదైనా ఉండడమా, పూర్తిగా సంబంధం విడిపోవడమా" అనేది చాలా ముఖ్యమైన విషయం. గాంధీ జిన్నాగార్లకే గాక అఖండహిందూస్థాన్ వాదులకును, పాకిస్థాన్ వాదులకును ఈ విషయాన్నిగురించే అతితీవ్రమైన అభిప్రాయభేదం ఉంది. బ్రిటిషుప్రభుత్వంవారి వైఖరి మునుముందు ఏలాగు మారుతుందో చెప్పలేము కాని, ఇప్పటివరకు వారు భరతఖండం ఒకేదేశమనిన్ని, దాని ఐక్యత నిలబెట్టడం అవసరం అనిన్నీ, పాకిస్థాన్ హిందూస్థానాలు తెగతెంపు చేసుకోవడం ప్రమాదకరమనిన్నీ చెప్తున్నారు. ఈ రెండురాజ్యాలకు నిర్బంధంగా సంబంధం ఏర్పడడం మంచిదా కాదా అన్న విషయం విమర్శించవలసి ఉంది. ఈ సందర్భంలో మనం ఈ క్రింది అంశాలను గుర్తించవలెను.

(అ) రాజ్యాన్ని పరాయిరాజ్యాల వశం కాకుండా రక్షించడం ప్రతిప్రభుత్వానికి ప్రథమకర్తవ్యం. తక్కిన పనులు చేసినా చేయకపోయినా ఈపనిని తప్పక నిర్వహించవలసి ఉంటుంది. ఇది జరిగిన తర్వాత తక్కిన పనులు సక్రమంగా జరగడానికి అవకాశాలు ఏర్పడతవి. కాని, ఈ పని పాకిస్థాన్ హిందూస్థానాలకు నిర్బంధమైన సంబంధం ఏర్పడ్డప్పుడు చక్కగా జరుగునా? లేక అవి "ఎవరికి వారే యమునాతీరే" అన్నట్లు విడివిడిగా ఉన్నప్పుడు జరుగునా? దేశానికి సరిహద్దులలో పాకిస్థాన్ రాజ్యములు ఏర్పడుటవల్ల భరతఖండానికంతా విదేశీయుల మూలంగా కలిగే ప్రమాదం ఎక్కువ అవుతుంది. పాకిస్థాన్ రాజ్యములు చిన్నవి; ఆర్థికంగా అభివృద్ధిగాంచినవి కావు. పన్నులమూలంగా అచ్చటి ప్రభుత్వంవారు ఎక్కువ ఆదాయాన్ని సంపాదించగల స్థితిలో ఉండరు. వారు ఏర్పరచుకోగల సైనికబలం, నౌకాబలం, విమానబలం చాలా స్వల్పంగా ఉండకతప్పదు. పాకిస్థాన్ శత్రువశమైనప్పుడు, ఆ శత్రువులవలన హిందూస్థానానికి ప్రమాదం తప్పక సంభవించును. దేశమంతా ఒకేప్రభుత్వంక్రింద ఉండి, అన్నిరాష్ట్రాలలోని ప్రజలూ చెల్లించే పన్నులమూలాన లభించు కోట్లకొలది ద్రవ్యాన్ని ఖర్చుపెట్టినగాని సులభము కాని దేశరక్షణ పాకిస్థాన్‌వంటి స్వల్పరాజ్యాలకు సులభము కాగలదా? ఈ సందేహం తీర్చవలసిందని గాంధీగారు కోరినను జిన్నాగారు దీనినిగురించి ఏమీ చెప్పరైరి.

(ఆ) పాకిస్థాన్ మహమ్మదీయ రాజ్యము. మతమే దానికి ఆధారం. జిన్నాగారి వాదప్రకారం హిందువులకు, మహమ్మదీయులకు ఎట్టి సంబంధమూ లేదు. ఈసందర్భంలో పాకిస్థాన్ రాజ్యంవారు అఫ్ఘన్‌స్థానము, ఇరాన్, ఇరాక్, టర్కీ మొదలగు మహమ్మదీయ రాజ్యాలతో కలిసి, మహమ్మదీయసంఘటన నొకదానిని లేవదీసి, హిందూస్థానానికి ఉపద్రవం కలిగించడానికి ప్రయత్నించరా? ఈలాటి సంఘటనోద్యమం (**Pan Islamic movement**) మహమ్మదీయప్రముఖులలో అనేకులను ఆకర్షిస్తున్నమాట అందరికీ తెలిసిందే. గాంధీగారు దాని ప్రస్తాపనకూడ చేశారు. దానికికూడ జిన్నాగారు జవాబు చెప్పలేదు.

(ఇ) పాకిస్థాన్ హిందూస్థాన్ రాజ్యాలు ఏర్పడడంచేత హిందూమహమ్మదీయసమస్య పరిష్కారం అవుతుందని అనుకోవడం పొరపాటు. పాకిస్థాన్

రాజ్యంలోని మహమ్మదీయులకు హిందూపరిపాలన క్రింద ఉండడం తప్పినా, హిందూస్థానంలో ఉండ వలసిన సుమారు ౩౧ కోట్ల మహమ్మదీయులకు ఇది తప్పదు. హిందూపరిపాలనక్రింద ఉండడం గౌరవహాని అనిన్నీ, నష్టదాయక మనిన్నీ తలచు మహమ్మదీయులు హిందూస్థానంలో ఏర్పడు రాజ్యాంగానికి లోబడి పౌరధర్మములను నిర్వహింతురా? ఇదేవిధముగా, పాకిస్థానములోని మహమ్మదీయేతరుల గతి ఏమిటి? "మహమ్మదీయులు వేరు, మహమ్మదీయేతరులు వేరు" అనే సూత్రాన్ని ఆధారంచేసుకొని పాకిస్థాన్ భవనాన్ని నిర్మింపబూనుకొన్న జిన్నాగారు అచ్చటి మహమ్మదీయేతరులకు ఏలాటి అభయం ఇయ్యగలరు? హిందూస్థానంలో ఉండు మహమ్మదీయులందరూ పాకిస్థానములోనికి వెళ్లిపోవడమున్న్నూ, పాకిస్థానములోని మహమ్మదీయేతరులందరూ హిందూస్థానములోనికి వెళ్లిపోవడమున్న్నూ జరిగినప్పుడే ముస్లింలీగువారు కల్పించిన హిందూమహమ్మదీయసమస్య పరిష్కారం కాగలదు. కాని ఇట్లు జరగడం అసాధ్యం. గనుక సమస్య సమస్యగానే ఉంటుంది. కాంగ్రెసుమంత్రివర్గముల పరిపాలనక్రింద మహమ్మదీయులు పడిన బాధలు అనిర్వచనీయము లను ప్రచారము లేవదీసినవారు హిందూస్థానం ఏర్పడ్డ తర్వాత హిందూపరిపాలనలోని మహమ్మదీయులు దుర్భరములగు కష్టములపా లవుతున్నారని హిందూస్థానముతో లేనిపోని పేచీలు పెట్టుకొని దేశంలో శాంతికి భంగకరంగా ప్రవర్తించడం జరుగును కదా? జెకోస్లొవేకియాలోని అల్పసంఖ్యాకులగు జర్మనులను లేవదీసి, ఆరాజ్యానికంతా ముప్పు తెచ్చిన హిట్లరుప్రభుత్వమువలె పాకిస్థాన్ ప్రభుత్వము ప్రవర్తించునని చెప్పటలో విపరీత మేమియూ లేదు.

ఈ పైకారణాలవలన పాకిస్థాన్ హిందూస్థాన్ రాజ్యాలు పరస్పరసంబంధం గల రాజ్యాలుగా ఉండవలసినవేకాని పూర్తిగా విడిపోయిన రాజ్యాలవలె ప్రవర్తించడం ఉభయులకు ప్రమాదకరమని గాంధీ ఆచారిగార్ల వాదం. జిన్నాగారు ఈవాదాన్ని చెవిని వేసుకోనేలేదు. ఇదంతా అసందర్భం, సంభాషణల లోని ప్రధానవిషయంతోటి సంబంధంలేనిది అని త్రోసి వేశారు. కాని ఇదే ముఖ్యమైన విషయం.

జిన్నాగారి వాదం విపరీతమైనది; పరస్పర విరుద్ధాంశములతో కూడినది. (౧) వివిధమతాలకు చెందిన ప్రజలు ఒక మన దేశమందుమాత్రమే కాదు ఉండడం. ప్రతిదేశమందూ ఉన్నారు. ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, రషియా, చైనా - స్వతంత్రం కలిగిన అన్ని దేశాలకు ఇదొక లక్షణమే. చైనాలో బౌద్ధులతోపాటు కోట్లకొలది మహమ్మదీయులున్నారు. మతసహనం ఒక్కటే ఈలాటి సమస్యలన్నిటికీ పరిష్కారమార్గం. మతానికి రాజకీయానికి ముడిపెట్టినయెడల ఏరాజ్యాంగమూ స్థిరంగా ఉండదు. భరతఖండంలో మహమ్మదీయరాజ్యాలు కూలిపోవుటకు ఈ మతసహనం లేకపోవుటయేగదా కారణం? (౨) భరతఖండంలోని అధికసంఖ్యాకులగు హిందువుల పాలనకు లోబడడం అల్పసంఖ్యాకులగు మహమ్మదీయుల పేరుప్రతిష్ఠలకు, ఐశ్వర్యానికి భంగకరమను వాదమే సరియైనయెడల, అధికసంఖ్యాకులగు పాకిస్థాన్‌లోని మహమ్మదీయుల పరిపాలనకు లోబడడం ఆరాజ్యంలో అల్పసంఖ్యాకులగు సిక్కులు, హిందువులు మొదలగు వారి ప్రతిష్ఠకు భంగముకాదా? తన వాదములోని ఈ పరస్పరవైరుధ్యాన్ని జిన్నాగారు గుర్తించకపోవడం వింతగా ఉన్నది.

గాంధీజిన్నాగార్ల సంభాషణలమూలంగా హిందూమహమ్మదీయసమస్య పరిష్కారంకాకపోయినా పాకిస్థాన్ రాజ్యసంస్థాపనమున్మాత్రము పరిష్కారమార్గము కాదని స్పష్టమైనది. ఇంతేగాక హిందూస్థాన్ పాకిస్థాన్ రాజ్యాలమధ్యన ఎట్టి సంబంధము ఉండకూడదను వాదమును ప్రతిపాదించువారికిని, కొన్ని విషయములలోనైనా సంబంధము ఉండవలెనని వాదించు వారికిని రాజీకుదురుట అసాధ్యము. పాకిస్థాన్‌మాత్రము నాధారముగ చేసుకొని హిందూమహమ్మదీయ సమస్యను పరిష్కారముచేయబూనుకొనుట వ్యర్థ ప్రయత్నము.

హిందువులలో అందరూ జిన్నా గారు అభిలషించు పాకిస్థానవిధానానికి ప్రతికూలురనే చెప్పవచ్చును. ఆవిధానం సరియైనది కాదని ఆతనికి నచ్చచెప్పగలవారు హిందువులలో ఎవరును లేరు. అట్టి పనికి ముస్లింలీగుకు సంబంధించిన మహమ్మదీయులు పూనుటయే సబబు. రాజీకి ప్రస్తుతం మరియొక ఉపాయం కనుపించుటలేదు.

---

## వివాహములో వ్యక్తుల ప్రాముఖ్యము



# పాతివ్రత్యం

[ కథానిక ]

= శ్రీ గొరావఝల వెంకటసుబ్బరామయ్య =

"ఇదుగో - నా ఆఖరుమాట... ఇన్నాళ్లూ ఎలాగో కాలం గడిపాం - నాకు బ్రతుకుతానని ఆశ లేదు. నాకోసం నీవు బెంగపెట్టుకొని పిల్లలను పాడు చెయ్యవాక... ఆస్తిని అర్థాన్నం చెయ్యాక. కులగౌరవాన్ని - పెద్దలకీర్తిని - నా పేరుప్రతిష్ఠలను నిలుపు... అదుగో ఏడుస్తున్నావు?... ఇలా ఐతే నాకు మనశ్శాంతి వుండదు. నీవు సంతోషంతో నేను చెప్పింది చేస్తా నంటే సుఖంగా ప్రాణంపోతుంది. ... తెలిసిందా? - నీవు మహాయిల్లాలి వని పేరుపడ్డావు... ఆ పేరుకు కళంకం రానియ్యబోకు..."

"అయ్యో! ఇదేమిటండీ!" అంది గద్గదకంఠంతో కనకమ్మ. పైన వినలేకపోయింది. "మీ రివాళ యిటువంటి మాటలు మాట్లాడుతున్నా రేమండీ! మీ కేం ఫరవాలేదు. తప్పక నయమవుతుంది. మీరు మనసులో చింతపెట్టుకోవాకండి... మీరు లేని నా బ్రతుకెందుకు? మీరు పోయాక అసలు నేను బ్రతుకగలనా? బ్రతుకుతానా? మీతోనే నా పేరు - నా ప్రతిష్ఠ - నా పసుపు కుంకుమ - నా సౌభాగ్యం అన్నీను. మీరు పోయాక యేముంటుంది నాకు? అన్నీ మీతోనే. మీరుపోయిన మరుక్షణంలో యీ బొందెలో ప్రాణం వుండదని గట్టిగా నమ్మండి. మీరు లేని ఆస్తి నా కెందుకు? బిడ్డ లెందుకు? బంధువులతో యేంపని? బగ్గీలు దేనికి?..." అని ఆవేశంతో - కంపితస్వరంతో - కన్నీటిధారతో - విహ్వలమానసంతో అన్నది కనకమ్మ - ఎడంచేత్తో ముక్కును చీదుకుంటూ.

"అదుగో! గోరంతను కొండంత చేస్తావని తెలుసు... చూడు! నీవు కాపరాని కొచ్చిందిమొదలు కొని నీగుణాలనుచూస్తూనేవున్నా. ఇరవై యేండ్ల సాంగత్యంలో మన మనస్తత్వాలు ఐక్యమయాయి. మానసిక ప్రవృత్తులుఏకముఖాన నడుస్తున్నాయి. భిన్నహృదయ కుసుమాలను ప్రేమసూత్రం బంధించింది. నేనే నీసర్వస్వ మని నీవు భావించిన సంగతి నాకు తెలుసు... నీఅదృష్టంవల్లనే యింత కలిసివచ్చింది. ఇద్దరు నలుసులు కలిగారు... ఇంతకాలం ఒక పొరపూ లేకుండా సుఖంగా గడిపాం... కాని నాకు కాలం తీరింది. పిల్లల ముద్దుముచ్చట్లు చూచుకునే అదృష్టం లేదు కదా అనే చింత తప్ప మరేమీ లేదు. యీఅదృష్టం నాకు లేకపోయినా, నీవైనా వుండి సక్రమంగా పిల్లలకు చదువుసంధ్యలు చెప్పించి వృద్ధికి తెస్తానంటే సంతోషం... ఇదే నాకోరిక. ఇంతకంటే వేరేమీ లేదు..." అని కన్నీరు పెట్టుకున్నాడు సాంబయ్య.

"నేనే పతివ్రతనైతే అలాంటి అశుభం జరుగనేజరుగదు..." కనకమ్మనోటిగుండా యీమాటలు అప్రయత్నంగా వెలువడినాయి.

ఆమెకు స్వప్నావస్థనుండి జాగ్రదావస్థకు వచ్చినట్లనిపించింది. తనుఅన్న దేమిటో స్మృతిపథంలో విహరించి జ్ఞాపకానికి తెచ్చుకొని వల్లిస్తున్నది. తా నన్నది తనకే ఆశ్చర్యాన్ని, అద్భుతాన్ని కలిగించింది. ఆమాటలు తను అందామనుకోలేదు. ప్రయత్నించలేదు కూడాను. ఐతే ఎలా వచ్చినాయి? ఎవ రనిపించారు? వీటికి సమాధానం లభించడం లేదు. ఐతే తను నిజంగా పతివ్రతేనా?... తన జీవితపుటలను తిరగవేసుకుంటూ సూక్ష్మంగా పరిశీలిస్తూపోతున్నది. ఎన్నడైనా పాతివ్రత్యభంగకరమైన, పతిఇచ్ఛావిరుద్ధములైన పనులుగాని, మాటలుగాని, తలపులుగాని చేశానేమో అని సూక్ష్మంగా ఆలోచిస్తున్నది. అది ఒక స్వర్గోపమ దృశ్యం.

సాంబయ్య నిర్విణ్ణుడై రెప్పవాల్చక కనకమ్మను చూస్తున్నాడు. ఆమెముఖంలో అతని కండ్లకు స్వర్గ

జ్యోతి కనిపించింది. ఇద్దరూ భావనాప్రపంచంలో విహరిస్తున్నారు.

సాంబయ్య మూడునెలలనుంచి జ్వరంతో తీసుకుంటున్నాడు. శరీరంలో ఎముకలు, తోలు తప్ప మరేమీ మిగులలేదు. డాక్టర్లు వచ్చి చూస్తున్నారు. మందులు యిస్తున్నారు. కాని సాంబయ్యకు బ్రతుకు మీద ఆశ పోయింది. దీర్ఘజాడ్యం ప్రాణహానికి కారణమని అనుమానం పడ్డది. అదిగాక డాక్టర్లుకూడా ఫలానిజబ్బని గ్రహించలేకున్నారు. ఏమందులో తాపుతున్నారు; తోచిన యింజక్షనులు యిస్తున్నారు. ఆ అనుమానదిక్కోన్నసముద్రంలో యీదుతూ సాంబయ్య మూడునెల్లు గడిపాడు. శక్తి వుడిగింది. ఆశ అంతరించింది. ఎదుట అంతులేని అంధకారం మృత్యురూపమై గోచరిస్తున్నది. అంతులేని జీవితానికి పొలిమేర సమీపించిం దనుకుంటున్నాడు.

కాని కనకమ్మకు ఆశాజ్యోతి అంతరించలేదు. భగవంతుడు అప్రయత్నంగా తన నోటినుండి శుభవాచకాలు వెలువెడలించాడు. దీని ఫలితం శుభంకాని అశుభం కాదని నిశ్చయించుకున్నది. ఆశ ప్రత్యక్షంగా రూపందాల్చి ఆమెముందు నిలబడింది. "నీభర్త కేమీ భరవాలేదు. నీమంగళసూత్రం గట్టిది" అంటున్నట్లుగా తోచింది. కనకమ్మ ఆ ఆశను అలాగే నమ్మి కూచోలేదు. ఆ ఆశను భక్తిలోకి దింపింది. సదా భగవధ్యానమే — పరమేశ్వరనామమే ఆమెకు శరణ్యమైంది. ఆ ఆశాజ్యోతిని కల్పించిన భగవంతుని అర్చించడంలో, అలంకరించడంలో, అర్ఘ్యమివ్వడంలో, షోడశోపచారపూజల్లో సగంపొద్దు గడిచిపోతున్నది; మిగతాసగం కాలం పతిసపర్యలో. ఆమెకు తన శరీరభ్రాంతి బొత్తిగా పోయింది. ఒక్కొక్కరోజు తీరికలేక అన్నం తినటమే మానేసేది. మనసా, వాచా, కర్మణా ఆమెకు రెండే పనులు: పతిసేవ, భగవద్భక్తి.

రాత్రిపూట కనుమూసేది కాదు. పతితలగడ మాటున కూచొని భగవన్నామం జపిస్తూండేది. ఎప్పుడైనా తనకు అతీతమై కనుమూత పడితే-పతి ఆరోగ్యవంతుడైనట్లు, శంకరుడు ప్రత్యక్షమై "అమ్మా! నీతపస్సు ఫలించింది. నీపతి నీకు దక్కాడు. నీవు చేసింది వెయ్యిరూపులతో వర్ధిల్లుతుం"దని దీవించినట్లుగా కనబడేది-వినబడేది. యీవిధంగా యిప్పుడామె తన జీవితాన్ని గడుపుతున్నది.

యింటి వ్యవహారాల సంగతి అన్నగారికి వదిలేసింది. పిల్లల పోషణ ఒదినగారికి ఒప్పచెప్పింది. ఇక నిశ్చింతగా భగవధ్యానంలో మునిగిపోయింది.

ఆవూరినుంచి పాత అసిస్టెంటు సివిల్‌సర్జనుకు బదిలీ ఐంది. ఆచోట్లో మరోకాయన వచ్చాడు. కనకమ్మఅన్నగారు ఆయనను పోయి తీసుకొచ్చాడు. ఆయన వచ్చి చూచాడు. మం దిచ్చివెళ్లాడు.

ఆరోజు సాంబయ్యకు కొంచెం పండ్లరసం పోయింది. కొంచెం నిద్రపట్టింది. మరునాడు డాక్టరుగారు వచ్చారు. మం దిచ్చివెళ్లాడు. ఇలా నాలుగు రోజులు గడిచాయి. సాంబయ్యకు నిద్ర, ఆకళ్లు ఎక్కువైనాయి. ఆయనలో జీవకళ ఉత్పత్తి ఐంది. వ్యాధి తిరుగుముఖం ఐంది. తుపానుకల్లోలానికి వూగిసలాడుతున్న జీవితనావ ఒడ్డుపట్టింది. "డాక్టరుగారి హస్తవాసి. సాంబయ్యగారు మృత్యుముఖంనుండి జారి కిందపడ్డా"డన్నారు లోకులు. "నాభార్య పాతివ్రత్యమహిమ" అనుకున్నాడు సాంబయ్య. కనకమ్మ భగవంతుని కరుణాకటాక్షవీక్షణఫలిత మనుకున్నది.

౨

సాంబయ్య బలంపట్టి తేరుకున్నాడు. ఆయనకు తను బ్రతికింది కనకమ్మ పాతివ్రత్యం వల్లనే నని మనసులో స్థిరపడిపోయింది. కేవలం స్థిరపడటమే కాదు. యీసంగతిని— కనకమ్మశపథాన్ని, దాని ఫలితాన్ని — నలుగురికీ చెప్పి వినిపించాడు. దాంతో కనకమ్మ పేరు కొంచెం బైటికొచ్చింది. "ఆమె పతివ్రత అన్న మాటకు తిరుగులేదు" అని లోకులు అనుకోసాగారు. అంతే కాదు. చుట్టుప్రక్కలవాండ్లు తమ పిల్లలకు బాగుండకపోతే దిష్టివిభూతి మంత్రించి తీసుకోపోయేవారు కనకమ్మతోటి. వాండ్ల అదృష్టం వల్లనో, యీమె మంత్రబలిమివల్లనో వాండ్లకు నెమ్మ

దించేది. దీనివల్ల జనులలో ఇంకా పేరుపడింది. "దయ్యాలను కూడా కనకమ్మగారు వదిలిస్తుందిట. ఆమె పేరు చెబితే దయ్యాలు పారిపోతాయట" అని ఒకాయన అన్నాడు. ఇంకేం, దాంతో దయ్యాలవారు బైలుదేరారు. చిన్న దయ్యాలు, పెద్ద దయ్యాలు, పూనుదయ్యాలు, నవ్వుదయ్యాలు, పలుకని దయ్యాలు, ఆవులింత దయ్యాలు, అనుమానదయ్యాలు, లేచి పరుగెత్తేవి, తెలియక పడిపోయేవి, తెలిసి గిచ్చి రక్కి కొరికేవి—ఇలాంటివి ఎన్నో దయ్యాలు కనకమ్మ ముందు ప్రత్యక్షమయాయి. ఆమె వీటన్నిటికీ ఒక్క విభూతి మంత్రించి యిచ్చేది. దాన్ని ధరించగానే కొన్ని దయ్యాలు చెప్పకుండా పారిపోయేవి. దీనితో ఆమె పేరుప్రఖ్యాతులు మరీ వెల్లడయాయి. యీ తడవ ఇంకోరకపు దండు బైలుదేరింది; పిల్లలు పుట్టని వాండ్లు, గర్భం నిలిచి జారిపోయేవాండ్లు, పిల్లలు పుట్టి బ్రతుకని వాండ్లు. వారిలో కొందరి కష్టాలు, కోరి కలుతీచేవి. కొందరికి మాపూలు స్మృతిలోనే నశిస్తుండేవి. దీన్ని 'వాండ్ల ఖర్మం' అన్నారు.

ఐతే వీటన్నిటిలో కనకమ్మ పాత్ర ఎలా వర్తిస్తున్నదీ విచారించాలి. మొదట్లో పిల్లలకు దిష్టిమంత్రం పెట్టటానికి సందేహించింది-అనుమానించింది-జంకింది. ఎందుకు లేనిపోని శ్రమ, ఇదెక్కడి జంజాటకమని-లేక, మందుయందు నమ్మకం లేని వైద్యునిలాగ-పారని తేలుమంత్రగానిలాగ ప్రవర్తించేది. జనుల బలవంతానైతేనేమి, భర్త ప్రోద్బలంవల్లనైతేనేమి మంత్రించి యిచ్చింది. మంత్రం పారింది. మందు గుణమిచ్చింది. ఆనోటా ఆనోటా అందరికీ తెలిసింది. జనుల సమ్మర్దం ఎక్కువైంది. ఒకదాని తరువాత మరొక వ్యాధికి యిదే మంత్రాన్ని-మందును వాడుతున్నది. బ్రహ్మాస్త్రంలాగా అకుంఠితంగా పారుతున్నది. క్రమేణా యిందులో ఆమెకు అనుభవము-ఆనందము కలుగుతూవచ్చింది. ఇదే తుదకు సేవాభావంగా-కర్తవ్యంగా మారింది. యీవిధంగా ఆమె తన తపఃఫలాన్ని ఇతరులకై వెచ్చించి అందులోనే ఆనందానుభూతిని అనుభవించసాగింది. ఇప్పుడామెది కేవలం సాత్త్వికజీవితం. ఆమెకు ఆదర్శం అరుంధతీ, అనసూయలు.

కనకమ్మకు క్రమంగా బాహ్యాంతరిక నిర్మలత్వం వృద్ధిఅవుతున్నది. ఎన్ని పను లున్నను భర్తపనులకు అంతరాయం కలిగేది కాదు. భర్తమాటకు ఆలస్యమయేదికాదు. భగవద్భక్తితోపాటు పతిభక్తికికూడా మానసపీఠాన సమానస్థానం యిచ్చింది—ఒకే ఆకాశంలో సూర్యునకు, చంద్రునకు సమానస్థానం వున్నట్లుగా. ఆమెకు ఇహలోకదైవం భర్త; పరలోకదైవం భగవంతుడు. ఎవర్ని విడిచిపెట్టగలదు ?

సేవాపరాయణత్వంలో శరీరపోషణకే అవకాశం దొరకదు. ఇక భర్తఉపచారాల కెక్కడ అవకాశం దొరుకుతుంది ? కనుక విధిలేక కొన్ని పనులను మానవలసి వచ్చింది. భర్తకు నీళ్లు తోడి స్నానం చేయించడం, పీటవెయ్యటం, మడిగుడ్డ అందివ్వటం, సంధ్యకు నీళ్లు పెట్టటం, గంధం అక్షింతలు తీసియివ్వటం, భోజనానంతరం నడుం వాల్చటానికి మంచం వెయ్యటం మొదలయిన చిన్నచిన్న పనులకు అంతరాయం కలిగింది. సాంబయ్య వీటికి బహుకాలంనుంచి భార్యవల్ల అలవాటు పడ్డా సంతోషంతో వీటన్నిటినీ తనే చేసుకుంటూ భార్యను ఇంకోపనికి నియోగిస్తున్నాడు. అక్కడ ఇతరుల పని ఎక్కువైనకొద్దీ ఇక్కడ సాంబయ్యపనులలో ఒకొక్కటీ లోపిస్తున్నది. తుదకు ఒక్క అన్నం వడ్డించడం తప్ప తక్కిన పను లన్నీ స్వస్తిచెప్పాయి. సాంబయ్యకు దీనివల్ల కష్టంకలుగలేదు. కనకమ్మకు దీన్నిగురించి ఆలోచించుటకు తీరిక లేదు. ఈవిధంగా కాలం గడిచిపోతున్నది.

## 3

సాంబయ్య పిల్ల పెండ్లి బహువైభవంగా చేశాడు. తగిన సంబంధం. శిష్టాచార సంపన్నులు. యింత కుడువా, కట్టా వున్నవాండ్లు. పిల్లవాడుకూడా రూపసి. బుద్ధిమంతుడు. వేదం చదువుతున్నాడు. తగిన యీడూ జోడూ.

కొడుకు బి. ఏ. చదువుతున్నాడు. పరభాషాధ్యయనత్వంలో పరవేషావలంబనకూడా అవసరమన్న సిద్ధాంతానికి వ్యతిరేకుడు. నిరాడంబరుడు. తల్లిదండ్రుల పవిత్ర భావైక్యత ఇతనిలో చేకూరింది. భార్యాభర్త లిరువురూ తమ ఫలాలను కాపాడవలసిన

దని భగవంతుని ప్రార్థించేవారు. యీయేడు పిల్లవాడికి పెండ్లి చెయ్యాలని సాంబయ్య తలపెట్టాడు. కనకమ్మ తలవూపింది. యేమాటకూ 'సరే' తప్ప 'ఇలా' నని తన అభిప్రాయాన్నిచ్చి యెరుగదు. పతిముందర తన అస్తిత్వమే లేదని భావించింది. ఇక పిల్లవాని అభిప్రాయంతో పనే లేదు. ఎందుకంటే, తలిదండ్రుల మాటే అతనికి వేదవాక్యం. సంబంధం నిశ్చయమైంది. పండు, పసుపు పెట్టుకున్నారు. ముహూర్త నిశ్చయం చేసుకున్నారు. దీన్నిగురించి పిల్లవానికి జాబు వ్రాశాడు. ముహూర్తం దాదాపు నెలరోజు లుంది.

ఒకరోజు అకస్మాత్తుగా సాంబయ్యకు జ్వరం వచ్చింది. కనకమ్మమనసు చివుక్కు మన్నది. ఎంత మంది కష్టాలనో తొలగిస్తూ, కష్టసహిష్ణుతకు అభ్యస్తమై గడ్డకట్టిన మనస్సు కరగి ప్రవహింప సాగింది. భావి ఆశంకలు అనేకం ఆమెకు తోస్తున్నాయి. కండ్లముందు అనేక భయంకర అంధకార చిత్రాలు కన్పిస్తున్నాయి. సర్వనాడులు, శక్తులు, అవయవాలు స్తంభించిపోయినాయి. ఎందుకో తెలియదు.

జ్వరం వచ్చి వారంరోజు లైంది. దిగలేదు. సాంబయ్య మూసిన కన్ను తెరవలేదు. ఎన్నో విభూతులు పెట్టింది. ఎన్నో మంత్రాలు చదివింది. ఎన్నో దేవుళ్లకు మ్రొక్కుకున్నది. తనకు చేతనైనంత చేస్తూ నేవుంది. డాక్టరును పిలిపించి చూపించారు. ఆయన మందిస్తూ చూస్తూవున్నాడు. మరి నాలుగురోజులు గడిచాయి. జ్వరం తీవ్రరూపం దాల్చింది. కనకమ్మ అనుమానం అధికమైంది. దుఃఖం పొంగి పొర్లివస్తున్నది. కాని పతిసేవకు భంగం కలుగనియ్యలేదు. ఆహారనిద్రలు మానేసింది. ఆమెకు అరిష్టసూచకములు అంతకంతకు స్పష్టంగా తోస్తున్నాయి. మనసు తుపానుగాలిలోని నావవలె వూగిసలాడుతున్నది. మంగళసూత్రం చూచుకున్నది. వళ్లు ఝల్లుమన్నది. శుభచిహ్నమైన మంగళసూత్రాన్ని రెండుచేతులతోనూ గట్టిగా పట్టుకొని పైటకొంగులో దాచుకున్నది. యిదే నాసౌభాగ్యానికి, సుఖానికి, సర్వానికి కారణమైంది దనుకున్నది.

జ్వరం ప్రకోపించింది. నోటమాట బంద్దైంది. గురక పుట్టింది. పిల్లవానికి తంతియిచ్చారు. ఇల్లంతా దుఃఖసూచకనిశ్శబ్దంతో నిండివుంది. అందరిముఖాలూ కళావిహీనమై వున్నాయి. జ్వరం ౧౦౬ డిగ్రీలకు ఎక్కింది. డాక్టర్లు ఆదుర్దాపడుతున్నారు. తోచిన ఇంజక్షనులు యిస్తున్నారు. కాళ్లు భూమిమీద ఆనటం లేదు. సాయంత్రం ఏడుగంటలైంది. జ్వరం దిగుతున్నది. ౧౦౫ కు వచ్చింది. మరొక అర్ధగంటకు ౧౦౩ కు దిగింది. డాక్టర్లు ఆశలు వదులుకున్నారు. మరొక అర్ధగంటలో శీతలానికి వచ్చింది. కాళ్లు, చేతులు చల్లబడ్డాయి. సాంబయ్య ఒక్కసారి కన్ను తెరిచాడు; మూశాడు. సాంబయ్య జీవితనాటకం అంతటితో సమాప్తిచెందింది. అందరూ ఒక్కసారి గొల్లుమన్నారు. అంతే.

కనకమ్మ దొడ్లోకి పోయింది. ఆమెహృదయభావము అగోచరము. ఆమె స్థిరంగా కనబడుతున్నది. పతి కనుమూయగానే ఒక్కసారి గొల్లుమంది. తరువాత ధైర్యంగా వుంది. ముఖాన అర్ధణావెడల్పు కుంకుమ బొట్టు వుంది.

బంధువులు, చుట్టాలు, ప్రక్కవాండ్లు అందరూ చుట్టూ మూగివున్నారు. కొందరు గోడకు చేరబడి విచారంగా వున్నారు. కొందరు ఆయనమంచిని, పనులను, మాటలను, దయాభావాన్ని వర్ణిస్తున్నారు. "పిల్లవాడి పెండ్లిముహూర్తం రేపే. పెండ్లికిబదులు యీపని జరిగింది" అనుకుంటున్నారు. యిలా ఎవరికి తోచినవిధంగా వారు సాంబయ్యగారినిగురించి మాట్లాడుకుంటున్నారు.

గంట గడిచింది. రెండుగంటలైంది. కనకమ్మ తిరిగిరాలేదు. కొంచెం అనుమానం తగిలింది. ఆదుర్దాగా ఇటూ అటూ వెతుకుతున్నారు. ఎక్కడా ఆమెజాడ లేదు. దొడ్లోకి పోయి చూచారు. లేదు. ఇల్లంతా వెతికారు. కనబడలేదు. అనుమానం అధికమైంది. బావిలో తొంగిచూచారు. కొందరు బావిలోకి దిగారు. అనుమానం ప్రత్యక్షమైంది. అందరూ గొల్లుమన్నారు. కనకమ్మశవం బావిలో దొరికింది. చల్లగా బైటకి తీశారు. పరీక్షించారు. ఆమె ఎప్పుడో నిర్జీవ ఐంది.

ఉదయం ఏడుగంటల బండికి పిల్లవాడొచ్చాడు. సంగతి విన్నాడు. నెత్తి బాదుకున్నాడు.

"మహాపతివ్రత. ఇద్దరినీ ఒకేచితిమీద సంస్కారంచెయ్యాల" న్నారు.

రెండు ఆత్మలూ స్వర్గంలో కలుసుకుంటాయేమో! రెండుశరీరాలుమటుకు ఇక్కడ చితిమీద కలుసుకున్నాయి.

---

# ఇంద్రుని మాయా నాటకము



= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

నాఁటిదినము శ్రీకృష్ణజయంతి. రాత్రి పూజానంతరము పేరంటమునకై వచ్చిన సువాసినుల గుంపులో చక్కని చుక్కవంటి యొక కన్యారత్నము కానవచ్చినది. మాయింటికి చిరపరిచితురాలగు పెద్దముత్తయిదువవెంట నా చిన్నది వచ్చియుండెను. తాంబూలచందనాదులను స్వీకరించి యింటికి వెళ్లునపు డాముత్తయిదువను సాగనంపుటకై నాభార్య మధ్యరంగమువరకు వచ్చి, ఆమెవెంట నున్న యా నూత్న బాలికను నాకుఁజూపి, "చూచితిరా? అత్త యెంత మంచి కోడలిని సంపాదించుకున్నదో?" అనియెను. ఆమె నత్త యని సగౌరవముగ పిల్చుట నాభార్యకు వాడుక.

"పెద్దవానికా, చిన్నవానికా?" అంటిని,

"అక్కడనే కొంచెము సందేహము." అని నవ్వుచు నాభార్య ఆకన్నియ ముఖము చూడఁగా, తీక్ష్ణముగ నొకమారు మావంకఁ జూచి యాబాల తల వంచుకొనియెను. విశాలమగు ఫాలము, శతపత్రములఁ బోలు కన్నులు, ప్రదీపప్రభలో నిగనిగలాడు దేహకాంతి, సొమ్ము లడుగని సహజసౌందర్యము కలిగిన యా ముగ్ధ దాదాపు పదునాలుగేండ్ల పాల వయస్సులో నుండియు, వయస్సునకు మించిన యంగసౌష్ఠవముతో నొప్పారుచుండినది.

"చిత్రం కనకలతాయాం పల్లవ ఏవామృతం సూతే,
కుసుమసముద్గమసమయే నో జానే కిం ఫలం భావి."

అను సుభాషిత మాకన్నియయెడ సార్థకముగ నుండెను.

"ఎవ్వనికో ఒక్కనికి." అని దీర్ఘముగ, నించుక పెదనవ్వుతో ప్రతియుచ్చి ఆ సువాసిని, కాఁబోవు కోడలిపై రానున్న అత్తగారి యధికారము నపుడే చలాయించు స్వరముతో "రావే"యని యాచిన్నదానిని కసరి పిలిచెను. వెడలిపోవునపు డాబాలిక దైన్యమును సూచించు చూడ్కులతో నొకసారి సాభిప్రాయముగ నాయిల్లాలివైపు చూచి అత్తగారి వెంట వెడలిపోయెను. ఇందేమో విశేష మున్న దనుకొంటిని.

ఆ సువాసిని సనాతనాచారతత్పరుఁడు, అమాయక ధర్మశీలుఁడు నగు నొక వృద్ధగృహస్థుని యిల్లాలు. ఇహమునకు, పరమునకు పనికివచ్చు నని యొక దేవాలయమును నమ్ముకొని శరీరయాత్ర జరుపుకొనుచుండిన సాధువర్తనుఁ డతఁడు. త్రిమూర్తులఁబోలు మువ్వురు పుత్రు లాదంపతులకుఁ గలరు. వారిలో జ్యేష్ఠుఁడు స్వయంభువు; అవివాహితుఁడు. మధ్యముఁడు సాక్షాత్తుగ రుద్రప్రకృతి; అతని కెచటనో ఇల్లటము లభించినది. శ్యామసుందరుఁడగు కనిష్ఠుఁడు కృష్ణమూర్త్యుపాసకుఁడు. దర్శనీయమగు నాకారసౌష్ఠవము, నిగనిగలాడు నూత్నతారుణ్యము, సనాతనసంప్రదాయబద్ధమగు శీలము కల బ్రహ్మచారి యతఁడు. శీలసౌందర్యములకు మెచ్చి పలువు రితనికి కన్యనిత్తుమని వచ్చిరికాని, అన్న యవివాహితుఁడుగ నుండుట గొప్ప ప్రతిబంధకముగా నేర్పడియుండినది.

నాఁటికి మూఁడునాల్గు దినములకు పూర్వము ప్రశంసలోనున్న కన్యకతల్లి—తల్లియో, సాకుడుతల్లియో, మరచితిని—ఆ కన్యకను పిలుచుకొనివచ్చి కాఁబోవు వియ్యపురాలి యింటనే విడిసి, శ్యామసుందరునికి (సౌకర్యార్థము చిన్న కుమారుని నాపేరుతో వ్యవహరింతము) ఆ బాలికను వివాహముచేసుకొని రక్షింపవలయు నని వాని తల్లితండ్రులను వేఁడుకొనెనఁట! నానాఁటికి యౌవనము తలసూపుచున్న కన్యకకు త్వరితముగా వివాహముచేయు తలంపున ఊరూరు తిరిగి ప్రయత్నించినా బీదకుటుంబమగుటచే తగిన వరుఁడు లభించకపోవుటచే వేసరి, ప్రశంసలో నున్న గృహస్థుల యింటి కామె పిల్లను పిల్చుకొనియే వచ్చినది. తనంత తానై తమ యింటికి వచ్చిన కన్యకను కోడలుగా పరిగ్రహించు కుతూహల మా గృహస్థులకు కలిగినది. పెద్దకోడలుగా పరిగ్రహించుటకు వా రుత్కంఠ చూపిరి. కాని, ఎదిరిపక్షమున కది రుచించినది కాదు. పట్టుపట్టి బంగారువంటి కన్యకను, లక్ష్మీదేవివలె ఇంటికి వచ్చిన దానిని పోఁగొట్టుకొనుట యవివేక మని ఆయింటి యజమానురా లూహించినది; కన్యను దక్కించుకొని తరువాత చూతమనుకొని 'తథాస్తు' అనినది. పెద్దవాని కదృష్టము లేదు; చిన్నవానికే కానిమ్మని యజమానుఁడు మాటయిచ్చినాఁడు. పది దినములలోనే లగ్న మొకటి యేర్పరచుకొని,

కన్యకను వారి యింటనే వదలి, తగిన సన్నాహముతో వేళకు ముందుగా వత్తునని చెప్పి, తల్లి స్వగ్రామమునకు వెడలిపోయినదఁట. పరస్పరానురూపులగు కన్యావరులను జూచి ఇరుగుపొరుగువారు చక్కని దాంపత్య మని పొగడినారు. పెండ్లిపనులు జరుగుచున్న వని నా భార్య చెప్పినది.

కన్యక నిచ్చెదమని యెవరువచ్చినా, అన్నకు వివాహము కానిది తనకు పెండ్లి అక్కరలేదని నిష్కర్షగా ప్రతిఇచ్చు వాడుక గల శ్యామసుందరుని చిత్తవృత్తిలో నిపుడు కొంత మార్పు కల్గినది. రతీదేవివంటి కన్యకారత్నము తనకై వచ్చి కన్నెదుట తిరుగుచుండఁగా నిట్టి మనఃపరివర్తన మా తరుణునికిఁ గల్గుట వింత కాదు. కాని, వానియన్న తాళలేక పోయినాఁడు: ఏదో మిషతో పలుమారు పలుకరింపఁ జూచినాఁడు. కాని, ఆకన్యక వానికి ప్రతి యిచ్చినది కాదు; సరికదా, అతనివైపు చూచుటకు సైత మేవగించుకొనుచు వచ్చినది. జడసూదులు, చందనపు సబ్బు, కామినియా నూనె, మఱి ఏమేమో తెచ్చి అతఁ డుపాయన మర్పింపఁగా, వానిని తాఁకుటకైన నా మానవతి యిష్టపడలేదు; పైఁగా ముఖమున తిరస్కారభావమునే చూపినదఁట. తన్ను జూచినపు డా ముగ్ధ ముఖము ముడిచేసుకొని వెడలిపోవుటయు, తన తమ్ముని చూచునపు డప్రయత్నముగ హసన్ముఖి యగుటయు గమనించుకొలఁది అతని హృదయమున నీర్ష్యానలజ్వాల ప్రబలినది. ఏమయినా సరే, ఈ కన్యకను సాధించి తీరవలె నని యతఁడు తీర్మానించుకొన్నాఁడు. మధ్యవర్తులతో చెప్పించినాఁడు. ఒంటరిపాటు చూచుకొని యొకమారు, తన్నే వివాహము చేసుకొమ్మని, పాపము, నోరు విడిచి యా కన్యకను ప్రార్థించినాఁడు. ఆ మానిని పెదవి విరిచి పెడముఖము పెట్టఁగా, ఆ రసికశిఖామణి రోషముతో "నీ వెవరిని పెండ్లి చేసుకొన్నా సరే, నేను నిన్ను వదలను లే" అని బెదరించెనఁట! దానితో ఫలము కానరానందున, గత్యంతరము లేక, ఆ శ్యామసుందర భ్రాత తల్లిని వేధించుట కారంభించినాఁడు. ఏ ప్రయాస పడినాసరే, తనకే ఆ చిన్నదానిని పెండ్లి చేయవలయు నని పట్టుబట్టి ప్రాధేయపడినాఁడు. తన యిష్టార్థము నెరవేరనిచో దేశత్యాగమో, ప్రాణత్యాగమో చేయుదు నని శపథము చేయుచున్న పుత్రుని కన్నతల్లి యెట్లు నిరాకరించఁగలదు? అట్లే చేసెద నని యామె వాగ్దానము చేయక తప్పినది కాదు. లోలోపల చిన్నకుమారుని బుజ్జగించి మంచిమాటలతో వాని కేమేమో ధర్మోపదేశము చేసినది. శ్యామసుందరున కిది విషమపరీక్ష. నీతి నియమములు కల ధర్మశీలుఁ డగుటచే, తన భావముల నణఁచుకొని తల్లి యిష్టానుసారమే ప్రవర్తించుట కతఁడు సంకల్పించుకొనెను. అప్పటినుండి ఆ కన్యవైపు చూచుట నయితము మానుకొన్నాఁడు కూడ. ఈ మార్పును గమనించి వాని యన్న,

"భళిరా! తేరకు తేర చిక్కె నిపుడీ
బంగారుకొం డంచు దంకల తాటించు"

చున్నాఁడఁట! కన్యకతో నెపుడో చూచాయగా వాని తల్లి తన యుద్దేశమును సూచించి యేమేమో ఆశగొల్పినది. కాని, ఆ కన్యక సుముఖురాలు కాలేదు. ఇది గ్రహించి తెలివిగల యనుభవశాలిని గనుక, అంతటితో నా ప్రసంగమును చాలించి, వివాహ లగ్నకాలమున నేదో యుక్తి చేసి కార్యము సాధించవచ్చు ననుకొని సన్నాహములను మాత్రము చాకచక్యముతో జరుపుచున్నది. "తడబడదే నాఁటి కొక్క దైవము లేదే?" అని యామె ఆశ.

నాఁటి మధ్యాహ్నమున ఏదో కార్యార్థమై యా కన్యక మా యింటి కొంటరిగ వచ్చియుండి, పెండ్లి కాయత్తమైన బొమ్మ చీరెల ప్రస్తావవశమున తన కున్న చిక్కులనెల్ల నా గృహిణితో చెప్పుకొని, పెద్దవానికి వివాహము చేసినచో వెంటనే పసుపుచీరెతో బావిలో దూకి ప్రాణత్యాగము చేతు నని చెప్పి, దిక్కు లేని తన్ను కాపాడవలె నని కన్నుల నీరుతో ప్రార్థించిన దఁట! కథయంతయు నాభార్యవలనవింటిని.

అమాయకురా లగు నా కన్యక కాజన్మావధి దుఃఖము తెచ్చిపెట్టఁగల ద్రోహము జరుగునేమో యని నా మనస్సు చాల నొచ్చినది. మరునాఁడు శ్యామసుందరుని యొక్కయు, ఆ కన్నియ యొక్కయు జాతకములను ప్రయాసపడి తెప్పించి చూచితిని. వారి సాయన జాతక చక్రము లివి:—

| | | | |
|---|---|---|---|
| గు ౧౭-౫౭ (వ) | X ౧౬-౦ | | |
| రా ౧౩-౦<br>వ ౧౩-౪౬ | వరుని జాతకము<br>—<br>(సాయనము) | | శ ౧౬-౩౨ (వ)<br>I ౧౯-౪౦ |
| | | | ఇ ౨-౪౦<br>కు ౧౨-౨౦<br>చ ౧౨-౨౯<br>కే ౧౩-౦ |
| | ర ౬-౭<br>శు ౧౯-౫౪ | బు ౨౧-౧౬ | |

| చ ౧౧-౪౯<br>కు ౬-౫౪<br>శు ౮-౩౦<br>వ ౩-౨౨ | | కే ౨-౨౦ | X ౧౯-౦ |
|---|---|---|---|
| | కన్యక జాతకము<br>—<br>(సాయనము) | | |
| ర ౨౨-౫౭<br>బు ౨౦-౫౦ | | | ఇ ౧౨-౫౪<br>(వ) |
| | రా ౨-౨౦ | | I ౧౭-౩౦<br>గు ౧౭-౪౬<br>(వ)<br>శ ౨౪-౪౪<br>(వ) |

ఆ కన్నియ జనించినది కన్యాలగ్నమున. "వ్రీడా మంథర చారు వీక్షణగతి" యను కన్యాలగ్న ధర్మ మా కన్యకామణియందు పూర్ణముగా నుండినది. లగ్నచంద్రులు సమరాసులలో శుభక్షేత్రములలో నుండుటచే,

"యుగ్మేషు లగ్నశశినోః ప్రకృతిస్థితా స్త్రీ
సచ్ఛీల భూషణవతీ శుభదృష్టయోశ్చ."

అను వరాహమిహిర సూత్ర మీ బాలికయెడ బాగుగా నన్వయింపఁగలదు. లగ్నమం దుదయించుచున్న బృహస్పతిని జూచినచో, బంగారువంటి దేహకాంతి, విశాల ఫాలము, వికాసయుతములగు నేత్రములు, కనులపండువు గావించు నంగసౌష్ఠవము మన కర్థమగును. బుధరవులతో నీ బృహస్పతికిఁ గల త్రికోణమిత్రదృష్టి వినయ వివేకములతోటి చక్కని శీలము నీయఁజాలినది. లగ్నమం దున్న శని చిన్నవయసున క్లేశము, దారిద్ర్యానుభవము నీని కిచ్చినాఁడు. కాని, ఈ శనిపైఁ గల రవి బుధ త్రికోణదృష్టి ధనసుఖముల నీయఁజాలకున్నను, క్లేశ సహిష్ణుత, ధార్మికచిత్తవృత్తి, ధీరశాంతస్వభావము నీని నిచ్చినది.

"సుఖరహిత మథాత్యంతం
ధనరహితం ధార్మికం జితక్రోధం,
క్లేశసహిష్ణుం ధీరం
బుధభే రవివీక్షిత స్సౌరః." (సారావళి).

లగ్నపంచమాధిపతులగు బుధశనులకు స్నేహదృష్టి బద్ధమైన చక్కని పరివర్తనయోగ మున్నది. దీని ఫలము 'జాతకాలంకార' మిట్లు వర్ణించినది :

"లగ్నస్థే సూనునాథే తనుజపదగతే
లగ్ననాథే మనస్వీ
విద్యాలంకారయుక్తో నిజకులవిదితో
జ్ఞానవాన్ మానసక్తః"

ఇఁక, సప్తమభావములో నొక వైలక్షణ్య మున్నది. అందున్నది వరుణ, కుజ, శుక్ర, చంద్రుల సంయోగము! అమృతకలశములో విషప్రయోగము వంటి దిది. చూడుఁడు! వైవాహికజీవితమున నత్యచ్ఛ్రియముగ సుఖసౌభాగ్యసంపత్తుల నీయఁజాలిన ఉచ్చశుక్రుని సహవాస ముండుటచే, ప్రేమవిషయమున చాపల్యమో, చాంచల్యమో చూపు చంద్రుని సప్తమభావస్థితి కొంతవరకు క్షంతవ్య మనవచ్చును. కాని, వీరి వెన్నంటి సుందోపసుందులవలె, మహాయోధులగు కుజవరుణు లుండుటమాత్రము ప్రమాదకారి యనకతీరదు. ఆకస్మికముగ నుదయించు ప్రేమానుబంధము, ఉద్రిక్తమోహావేశ పరవశమగు చిత్తవృత్తి, అత్రమున నేర్పడు ప్రామాదికవివాహము, దాంపత్య విచ్ఛిత్తినో, వియోగమో తెచ్చు పరిస్థితులు - ఇట్టివి దీని సామాన్యఫలములు. కాని, విషయసుఖ (పంచమ) స్థానమం దున్న రవిబుధులకుఁ గల గురుశనుల మిత్రదృష్టి వివేకము, నియమబద్ధత, సనాతనాచారతత్పరత, ధార్మికచిత్తవృత్తి - నీని నీఁగలదు. ఇవి యిట్లుండ, ఈ రవిబుధులకు సప్తమస్థానమం దున్న శుక్రకుజులతోఁ గల యర్ధకేంద్రశత్రుదృష్టి, శీలవంతురా లగు నీకన్యక వైవాహికజీవితమున భర్తమూలమున క్లేశముపా లగునేమో యని భయమగుచున్నది,

మఱియొకటి: వివాహసహమబిందువు కన్యారాశిలో ౨౬-౩౭ భాగలోఁ గలదు. దీనిపై వ్యయస్థానమం దున్న మాయలమారి ఇంద్రుని యర్ధకేంద్రవైషమ్యదృష్టి యున్నది. మోసమో, ద్రోహమో, కనుకట్టో, గారడీతంత్రమో తెలుపు వైవాహికనాటకమున నీజాతకురాలు కథానాయికగ నుండఁగలదేమో!

లాభాధిపతియై సప్తమభావములో నున్న చంద్రుఁడు దినవర్షపద్ధతిలో చలించి, ఇప్పుడు లగ్నమునకు వచ్చినాఁడు. 'పతిసంయోగమేలభి' మగు వయఃపరిపాకమును తెలుపు దశయిది. వివాహసహమబిందువు చలనవశమున తులారాశిలో ౧౨-౨౨ భాగకు వచ్చియున్నది. లగ్నాధిపతియగు బుధుఁడు చలించి కుంభరాశి ౧౨-౩౭ భాగకు వచ్చియుండెను. అగుటఁబట్టి, చలితవివాహసహమబిందువు చలితలగ్నాధిపతితో పూర్ణ

త్రికోణమిత్రదృష్టి నార్జించి, వివాహమంగళమునకు మంచి యవకాశ మిది యని తెలుపుచున్నది. జాతకమునందలి యింద్రునినుండి యీ చలితవివాహసహమబిందువు అర్ధకోణ దృష్టికే యిప్పుడు వచ్చియుండుట చదువరులు గమనింపఁ గలరు. ఇది మిత్రదృష్టియేకాని, జన్మకాలమున శత్రుదృష్టి గల గ్రహము చలనవశమున శుభదృష్టి నిచ్చినా, ఫలములో నానుకూల్యముండదు. వైవాహికజీవితమున మోసమో, కుతంత్రమో తెచ్చియిచ్చు కోరిక గల ఇంద్రగ్రహమున కిప్పుడు మంచి యవకాశము లభించును. ఏదో మచ్చుబూడిదె చల్లి, కొండంత ఆశచూపి, ఇంద్రుఁడు తన వాగ్దానమును నెరవేర్చుకోఁగలఁడు. విశేష మేమన, చలితలగ్నాధిపతి యగు బుధుఁడు వివాహసహమముతో మైత్రి నెరపుచు పెండ్లిచేయ సిద్ధుఁడుగ నున్నాఁ డనుట వాస్తవమే. కాని, ఆ గ్రహ మిపు డుండు స్థానము (కుంభరాశి ౧౨౫౦ భాగ) జాతకమందలి ఇంద్రునికి నికరముగా ౧౮౦ భాగల సమ సప్తకశత్రుదృష్టికిఁ జిక్కిన దనుట మనము మరువరాదు. మోహమో, మోసమో, ఈ రెండింటిసమ్మేళనమో ఇంద్రుఁడు తెచ్చిపెట్టఁగలఁ డనుటలో సందేహ ముండదు. కాని, పుణ్య సహమము వృశ్చికరాశిలో ౨-వ భాగయం దుండి సప్తమ భావమందలి గ్రహములతో త్రికోణదృష్టి నందుటచే, ఇంద్రుని నాటక మేదైనసరే, పరిణామము మంచి ఫలమునకే కావచ్చు ననునాశ కవకాశ మున్నది.

ఇది యిట్లుంచి, శ్యామసుందరుని జాతకమును జూతుఁడు. లగ్నము దయాదాక్షిణ్యముల కాటపట్టగు కర్కాటకము. ధర్మస్థానమం దున్న ప్రబలుఁడగు మీనగురువు జాతకుని గుణ, శీల, సౌజన్యములను చాటుచున్నాఁడు. పంచమస్థానమం దున్న సుఖకారకుఁ డగు శుక్రుని కీగురు వుతోఁ గల యానుకూల్యదృష్టి సౌందర్యము, సౌకుమార్యము, సౌమనస్యము సూచింపఁజాలినది. ఈగ్రహముల కోణదృష్టి లగ్నభాగయందుండుకతమున, జాతకుఁడు కన్యల హృదయముల నాకర్షింపఁజాలిన రూపలావణ్యములు గలవాఁ డగుటలో వింత లేదు. లగ్నమందలి శనిమహాశ యుఁడు తన చేతనయినంత దారిద్ర్యక్లేశానుభవము నిచ్చినాఁడు. ఇంచుమించుగ సంసారనిర్వహణభార మంతయు వీనిదే యన్నను తప్పుగాదు.

ఇది యిట్లుండ, కుటుంబస్థానమం దున్న ఇంద్ర, కుజ, చంద్ర, కేతువుల సంయోగము భయావహముగ నున్నది. పైఁగా, ఈ 'చంద్రమంగళ' యోగమునకు నిండు సమసప్తకమున, అష్టమ (మృత్యు) స్థానమునుండి వరుణుని ప్రత్యక్షవైరదృష్టి యుండుట చాల ప్రమాదసూచకము. మఱియు, ఈ వరుణునినుండియు, చంద్రకుజులనుండియు రవిపై నున్న శత్రు (కేంద్ర) దృష్టి యీదోషమున కుత్తేజన మిచ్చుచున్నది. కటకములోని లగ్నము చలనవశమున కుజ చంద్రసంయోగము నొందుటయు, వరుణుని సమసప్తకవైర దృష్టిని బొందుటయు ఇంచుమించుగ నొకటే వయస్సునందే సంభవించును. క్రూరవేధితమగు దుష్టగ్రహము మృత్యుస్థానమునందున్న జాతకములలో, చలితలగ్నము కుటుంబభావములో సంచరించునపుడు, ఆ దుష్టగ్రహవేధాస్థానమును దాఁటి యేపోవలసివచ్చుటచే, ఆ వయస్సున అపమృత్యువో, అసాధ్యరోగమో సామాన్యముగ సంభవించునని 'సెఫేరియలు' అను పాశ్చాత్యహోరాశాస్త్రవేత్త చాటుచున్నాఁడు. ఇంత చాలక, "నిత్యం సన్నిహితో మృత్యుః" అని సూచించురీతి, అష్టమాధిపతియగు శని లగ్నమందే కలఁడు. ఈ శనికి సప్తమాధిపత్యము సయితముండుటయు, లగ్నాధిపతియగు చంద్రుఁడు కుటుంబస్థానమం దుండి కుజవరుణుల క్రూరవేధపాలగుటయు మనము గమనించితిమేని, రానున్న ప్రమాద మేదైన కానిండు, దానితో కళత్రమున కేమో సంబంధ ముండునేమో అను శంక కవకాశము గలదు. లగ్నముపై గురుశుక్రుల శుభదృష్టినే నమ్ముకొని యుండవలసియున్నది.

జాతకములను పోల్చినచో ముఖ్యముగ నీక్రింది యోగములు కానవచ్చును :— (౧) కన్యక జాతకమందలి పుణ్య సహమ బిందువు వరుని జన్మరవిపై నుండుట ; (౨) కన్యా జాతకమందలి శుక్రచంద్రులతో వరుని జన్మరవి పూర్ణ త్రికోణ మిత్ర దృష్టిలో నుండుట ; (౩) స్త్రీ జాతకమందలి ఇంద్ర గ్రహముతో పురుషజాతకమందలి శుక్రచంద్రులు సంయోగము నొందుట; (౪) స్త్రీ జాతకపు సప్తమ భావ మధ్యమందే పురుషజాతకపు బృహస్పతి వచ్చుట.

ఈ యోగముల పట్టికను జూచితిమేని, ప్రశంసలో నున్న కన్యావరుల పరస్పరాకర్షణ మెంత ఘనమో మనకు బోధపడఁగలదు. కాని, ఇంద్రావరుణుల పరస్పర వేధకు లోనయిన పురుషజాతకపు చంద్రమంగళయోగము ఆకర్షణ మంత్రముకంటె ప్రబలముగా అపకర్షణమంత్రమును పఠింపఁజాలినది. ఇది వీరికి వివాహము జరుగనిచ్చునా, దాంపత్యము నోర్చునా ?

దిన వర్ష దశాపద్ధతిలో శ్యామసుందరుని జాతకమున చలితబుధుఁడు అతని జన్మ వరుణునితో నిండు కేంద్రమునకు వచ్చుటయు, కన్యక జన్మ చంద్రునితో త్రికోణమునకు వచ్చుటయు ఇప్పు డేకకాలమందే సిద్ధించినది. బుధ

చంద్రులు కన్యావరుల లగ్నాధిపతులు గదా? వారి కిపు డపార పరస్పరాకర్షణము కలుగుటలో నాశ్చర్యము లేదు. కాని బుధవరుణ కేంద్రస్థితి యపకర్షణమునే సూచించు చున్నది. పాపము!

శ్యామసుందరభ్రాతజాతకమును సంపాదించి పరీక్షింత మనుకొంటిని. తల్లికొడుకుల కుత్రలు ఫలించుట కవకాశ మా జాతకమునఁ గలదేమో చూత మని తలఁచితిని. కాని ఇది యెట్లో గ్రహించి తన యుద్దేశమునకు భంగము కలుగ వచ్చు నను భయమున, సమర్థురాలగు నతని తల్లి వాని జాతకమును దాఁచియుంచి, నా కది లభ్యము గాకుండఁజేసి నది. మఱియు శ్యామసుందరుఁడు గాని, ఆ కన్నియ కాని ఆ తరువాత మాయింటిపైపు రాకుండ జాగ్రత్తపరచినది.

ఈ శశిలేఖాపరిణయ మేమగునో చూత మని నిరీక్షించుచుంటిని. ఘటోత్కచుఁ డొక్కఁడే కొదవ!

వివాహ లగ్నము సమీపించుచు వచ్చినది. సదాచార శీలములతో నొప్పు శ్యామసుందరునిపై నచటివారి కనేకులకు ప్రీతి. వానికి వివాహ మని చెప్పినదే తడవుగ, ఉదార పురుషులు కొందరు వలయు సాహాయ్యము నొనర్చిరి. కీర కుటుంబపు పెండ్లికిఁ దగినరీతి వస్త్రాభరణాదులు, ఇతర సామగ్రి సమకూర్పఁబడినవి. తగుమట్టుకు పిండివంటలు సయితము సిద్ధమగుచుండినవి. కన్యక ముఖముమాత్రము కళాహీనముగా నున్నదని యెవరో అనుకొనిరి. వీథిలో నెపుడైన నెదురైనచో, శ్యామసుందరుఁడు తలవంచుకొని పోసాగెను. వాని యన్న ముఖమున మాత్రము సంతోష కళ నానాఁటి కభివృద్ధిలో నుండినది. జరుగుచున్న కుత్రల ఫలము కాఁబోలు!

దేవతాసమారాధనము జరుగవలసినదినము సమీపించి నది. వియ్యాలవారి రాకకై శ్యామసుందరుని తలిదండ్రు లెదురు చూచుచుండిరి. ఆనాఁటి యుదయమున సమీపప్రాంత మందలి పట్టణమున కాపురమున్న యొక పెద్దమనుష్యుఁడు జట్కాబండి దిగి యాత్రమున వారియింటికి వచ్చెను. ఆ యింటివారి కతని పరిచయ మున్నదఁట. కూఁతురువివాహ ప్రయత్నమున వలయు వస్త్రాదుల నాయత్తపరచుటకై తమ పురమునకు వచ్చియుండిన కన్యకతల్లి ఆకస్మికముగ సన్ని పాతజ్వరగ్రస్తయై, జ్ఞానాజ్ఞానపరిస్థితులలో తమ యింట మంచము పట్టిన దనియు, కూఁతురును మాటిమాటికి కలవ రించుచున్న యామెపరితాపమును చూడలేక, డాక్టరుగారి సల హాపయిన, తా నామెపుత్రికను పిల్చుకొనిపోవుటకై అత్ర మున జట్కాబండితో వచ్చినా ననియు, రోగి చావుబ్రదుకు లలో నుండుటచే తనకు క్షణకాలమైన నిలుచుటకు వీలులే దనియు విషాదకరమైన కథను చెప్పి యా పెద్దమనుష్యుఁడు, తాత్కాలికముగా వివాహము కొన్నిదినములు నిలుపవలసి వచ్చినందులకై తన పశ్చాత్తాపమును తెలిపినాఁడు. కన్యకతల్లి తనకు దూరపుబంధు వనియు, ఆమెదుర్గత మాన్పుటకై గంటగంటకు గొప్ప డాక్టరులతో సూదిమందు నిప్పించుచున్నా ననియు, కూఁతురు సమీపమం దుండుట యిప్పటి స్థితిలో నామెఆరోగ్యమున కత్యవసరమనియు, ఆరోగ్యము కొంత కుదిరినవెంటనే తన యింటియందే కన్యాదానము చేయించుట కై యామెకు మాటయిచ్చినాననియు అతఁడు శ్యామసుంద రుని తల్లిదండ్రుల కుపన్యసించి, తనసుండి మరల శుభలేఖ వచ్చుచే తడవుగ వరుని పిల్చుకొని తగుసన్నాహముతోరావల యు నని సవినయముగ వారిని ప్రార్థించెను. తల్లియనారోగ్య వార్త విని కూఁతురు భోరున నేడువసాగినది. తనకు రానున్న కష్టమునుగూర్చి తల్లితో చెప్పుకొనుటకై కాచుకొనియున్న యాముగ్ధ కీవార్త గోరుచుట్టుపై రోఁకటిపోటయినది. ఇష్టము లేకున్నను, కన్యకను పంపుటకు శ్యామసుందరుని తల్లి సమ్మ తింపక తప్పినదికాదు. స్నానపానాదులను తీర్చుకొని తాను సయితము వెంటఁబోవుట కామె సిద్ధపడెను కాని, క్షణకాల మైన తామసించుట కాపెద్దమనుష్యుఁడు సాధ్యము కాదనెను. వెంటనే పంపనిచో తాను వెళ్లవలసియేయున్నదని, అతఁడు తనకై కాచుకొనియున్న జట్కాబండియొద్దకుఁ బోయెను. విధి లేక, శ్యామసుందరుని తల్లి కన్యకనుసయితము వెళ్ల నిచ్చినది. ఆకన్యకను పిల్చుకొని యాతఁడు తన జట్కాబం డిలో నాత్రముతో వెళ్లిపోయెను. కడకు కాఫీకషాయము కాచియిచ్చుటకైనా, అతఁ డవకాశ మీయలేదు. జట్కాబండి యెక్కునపు డాకన్యకను జూచుచు నిశ్చేష్టుఁడై నిలిచి యున్న శ్యామసుందరభ్రాతను జూచి, ఇంచుక కన్నుగీటి యాపెద్దమనుష్యుఁడు "ఆత్రపడవలదు. నిస్సంశయముగా కొన్నాళ్లలోనే వివాహముజరుగును." అని యాశ్వాసించి వెడలిపోయెనఁట.

వాన వచ్చి వెలిసిన ట్లయినది. శ్యామసుందరుని యన్న కావేళ నోట కటళము పోలేదు. వారి యిల్లు కళా హీన మయినది. ఆరాత్రి ప్రయాణము చేయవలె నని తల్లి కొడుకులు సంకల్పించిరి. "రోగము ప్రబలమై ఒకటి పోయి యొకటైనచో, అపశకునము కాదా?" అని అమ్మలక్క లెవరో సలహాయీయఁగా, సత్యమని యామెకుసయితము తోఁచినది. నాలుగుదినములు తాళి ఆగ్రామమునకు పోదమని యామె తన కుమారకంఠీరవునకు సమాధానము చెప్పినది.

దైవగతి చాల చిత్రమైనది. కంకణబలము కలిసివచ్చి నపుడు, ప్రతిబంధకము లెన్నియుండినా, కన్యలకు వివాహ

మగు నందురు. నియమితలగ్నమందే యీకన్యకకు పెండ్లి జరిగినది. ౧౯౩౪-వ సంవత్సరమున సెప్టెంబరునెల ౧౩-వ తేదీన జరిగిన వివాహ మిది. నాఁటి దైనికకుండలి యిది:

| | | | |
|---|---|---|---|
| | | న ౦-౫౧<br>(వ) | |
| శ ౨౨-౫౦<br>రా ౪-౫౬ | వివాహ లగ్నము<br>(సాయనము) | | X ౨౭ |
| | | | కే ౪-౫౬<br>కు౧౦-౪ |
| చ ౫-౦ | | బు ౭-౧౦<br>గు ౨౪-౪౦<br>ల ౨౭ | శు౫-౨౦<br>ఇ ౧౨-౩౦<br>ర ౨౧-౫౪ |

లగ్నమున గురు వుండుట శుభసూచకము. కన్యక జాతకమున భర్తృస్థానాధిపతి యగు బృహస్పతి వివాహ కాలమున లగ్నమం దుండుట యుక్తముగనే యున్నది. కాని, లగ్నమున కొకవైపున బృహస్పతి యెన్ని భాగలలో నుండెనో, సప్తమభావమున కావలివైపున అన్ని భాగలలో వరుణుఁ డుండుట విశేషము. రాక్షసవివాహమున కిది తగిన యోగము! జాతకమందలి ఇంద్రునికి. చలితవివాహసహమ బిందువునకు సరిసరుమ కన్యారాశిలో ౧౨త్తి భాగలలో తాత్కాలికచారవశమున నింద్రుఁ డుండుట వింతలలో వింత! దైనికజాతకమును గుణించినచో, దైనికదశమకేంద్ర మానాఁడు కుంభరాశి ౧౨త్తి భాగకు వచ్చుచున్నది. చలిత లగ్నాధిపతి బుధుఁ డుండుట కుంభరాశి ౧౨త్తి భాగయందే అనియు, చలనవశమున నింద్రుఁ డుండునది సింహరాశి ౧౨త్తి భాగయందే అనియు మనము మరవమేని ఇంద్రుని మాయాప్రభావ మీవివాహమున పూర్ణముగా నుండునని యూహించుట సాధ్యము.

వివాహము నియమితలగ్నమందే నడచిన దంటిని, అట్లే అయినది: కన్యకను పిలుచుకొని వెళ్లిన పెద్ద మనుష్యుని యింటిలో నతఁడు వాగ్దానము చేసిన విధముగనే వివాహ మహోత్సవము జరిగినది. విశేష మేమన, వరుఁడుమాత్రము శ్యామసుందరుఁడు కాఁడు; వాని భ్రాతయును కాఁడు. ఆ పెద్దమనుష్యుని సోదరుఁడే పెండ్లికుమారుఁడై పీఁటల మీఁద కూర్చున్నాఁడు. వివాహ మైనది. ఎన్ని ప్రయాసలు పడినా, కన్యక దొరకని తన తమ్మునికి వివాహము చేయుటకై యా పెద్దమనుష్యుఁ డీనాటక మాడినాఁడు. ఇచట జరుగుచున్న కథ నెల్ల ఎట్లో గమనించి, తన తమ్ముని యదృష్టమును పరీక్షింప నెంచి, ఏదో మిషతో కన్యకతల్లి నచటికి పిలిపించుకొన్నాఁడు. మాయకన్నీరు కార్చి కన్యక నతఁడు పిల్చుకొనిపోయిన కథ మన మెఱుఁగుదుము. శ్యామసుందరుని తల్లి కావించుచున్న కుట్రల నెల్ల కన్యకతల్లికి విశదీకరించి, సత్యమా కాదా తెలుపుమని అతఁడు కన్యకనే సాక్షి కోరినాఁడు. శ్యామసుందరుని భ్రాతను పెండ్లియాడినచో రత్నమువంటి కన్యకకు రానున్న ఘోరవిపత్తును చిత్రవిచిత్రముగ వర్ణించి, ఆ యాపద తప్పించుటకే తా నీయుక్తి చేయ వలసివచ్చె నని యతఁ డా అమాయకలకు నచ్చఁ జెప్పినాఁడు. శ్యామసుందరుని యన్నకు తన కూఁతురు నిచ్చుటకు తల్లి కేమాత్రము నిష్టము లేదు. శ్యామసుందరుఁడు లభించనినాఁడు వాని యన్నకన్న నెవఁడైనా మేలే యని యామె సమ్మతించినది: కన్నియకు సయిత మట్లే తోఁచెను. తన్నవమానించుచుండిన యా మూర్ఖుని కన్నులలో దుమ్ముగొట్టఁగలిగినందుకు సంతసించి యాముగ్ధ నూతన వరుని వివాహమాడి సంసారి అయినది. అంతా ఇంద్రుని మాయ।

సప్తమ భావమందలి గ్రహకూటవు ఘర్షణయే పాత్ర సామగ్రిగా, ద్వాదశ భావమందలి ఇంద్రుఁడు మాయా వివాహ నాటక మాడించఁగా, బుధరవులతో మైత్రి నెరపుచున్న లగ్నగత బృహస్పతి ఈ కన్యారత్నమునకు భావి శుభమునకే తోడుపడినాఁడేమో? భర్తజాతకము లభించినఁ గాని, యిది చర్చించుట భావ్యము కాదు. అది యట్లుండె.

"నాకు ప్రాప్తి లేదు" అనుకొని శ్యామసుందరుఁడు నెమ్మది పడినాఁడు.

"గయ్యాళి! తప్పిపోయినదే మేలైనది" అని యిరుగు పొరుగు అమ్మలక్కలతో వాని తల్లి చెప్పుకొనెనఁట! ఆమె పెద్దకుమారునికి మాత్రము కన్యక కలవరము చాలకాల ముండినది. చేతికి చిక్కిన కన్యకను పోఁగొట్టుకొన్నందుకై యతఁడు చాలకాలము తల్లి వివేకమును తప్పుపట్టుచుండెడి వాఁడు. వివాహమైన దని యెఱిఁగిన కొన్ని దినములలోనే, అత్తవారింటికి పోయి పసుపు వస్త్రములతో నున్న యా వధువును జూచి "ఏమమ్మా! చెప్పకనే వివాహము చేసుకొన్నావే?" అని నవ్వితివి.

"పెద్దల యనుగ్రహము" అని నవ్వుచు నా ముగ్ధ లోనికి పోయినది. తా నాడిన నాటకకథాకలాప మంతయు నామెదావ సగర్వముగ విస్తరించి నాకు వర్ణించెను.

తరువాత నొక సంవత్సర కాలములో శ్యామసుందరున కొక బీదయింటి కన్యకతో పెండ్లి అయినది. ఈ క్రిందనున్నదే ఆ వడుచు సాయన జాతకచక్రము :—

| కే ౨౩-౧౪<br>వ ౯-౪౪ (వ)<br>I ౬ | | | చ ౧౨-౩౨ |
|---|---|---|---|
| కు ౫-౦ | భార్య జాతకము | | |
| | (సాయనము) | | ఇ ౧౭-౭ |
| X ౧౨<br>శు ౯-౪౦ | గు ౨-౩౨<br>ర ౧౪-౧౦ | శ ౧౪-౨౨<br>బు ౨౩-౪౦ | రా<br>౨౩-౧౪ |

లగ్నముననే వరుణుఁ డున్నాఁడు. లగ్నాధిపతియగు గురుఁడు ధర్మస్థానమందే యున్నాఁడు. కాని వాని కా స్థానాధిపతి యగు కుజునినుండి వేధయున్నది. నాల్గింట నున్న చంద్రుఁడు వరుణుని క్రూరదృష్టితో చెడినాఁడు. సప్తమాధిపతి యగు బుధుఁడు ధర్మస్థానమున గురు సంయోగమునం దుండుటచే, నిర్మలవర్తనుఁ డగు భర్తను సూచించును. కాని వానికి మనఃకారకుఁడు, మాతృకారకుఁడు అగు చంద్రునినుండి సార్ధ కేంద్ర శత్రుదృష్టి పూర్ణముగ నున్నది. అష్టమాధిపతి యగు శుక్రుఁడు చంద్రునికి సమసప్తకమున రాజ్యస్థానమం దుండి వరుణుని శత్రు దృష్టికి లోఁబడియుండుట యొక గొప్ప లోపము. ధర్మస్థానమందలి రవి, ఇంద్రునితో కేంద్రమం దుండి, ౯౦ భాగల దృష్టి నభిలషించుచుండుట గొప్ప దోషమే. ధర్మనాశనమో, ద్రోహచింతనమో, ఆశాభంగమో సూచింపఁజాలిన యోగమిది. రవియు, సప్తమాధిపతియు చెడుటచే భర్తృభావమున దౌర్బల్యము కానరావచ్చును. అష్టమ స్థానమున శని యుండి భర్త కనారోగ్య మనుచున్నాఁడు. ( మందేష్టమే పతీ రోగీ" అని జాతకతత్త్వము.)

ఈమె జాతకమును భర్త జాతకముతో పోల్చి చూచినచో భయావహముగ నుండును. ముఖ్యవిషయము లివి:—

భార్యరవితో భర్తచంద్రుఁడు కేంద్రము. భర్తరవి భార్య చంద్రునితో షష్ఠాష్టకము. దీనితో పరస్పర భక్తి సున్న ! పురుషజాతకపు కుజునితో స్త్రీజాతకపు శుక్రునికి మాత్రము మైత్రి కలదు. లగ్నముల కేమో అనుకూల్యమున్నది. భక్తి మృగ్యమైనా, తగుపాటి రక్తి కానవచ్చును. సంసారయాత్ర నారంభించిన రెండేండ్లకే సంతానప్రాప్తి చేకూరినది. ఈమాత్రపు టానుకూల్య మున్న స్త్రీపురుషు లెందరో సామాన్యపరిస్థితులలో మంచిదంపతులుగ కాలము గడపుచుండుట చూచుచున్నారము. కాని, విమర్శించినచో ఈ దాంపత్యమునఁ గొన్ని విశేషములు గలవు.

వీరికి రక్తినిచ్చునవి రెండు గ్రహములు కదా ?— పురుష కుజుఁడు, స్త్రీ శుక్రుఁడు. ఈ రెండు గ్రహములు ఆయా జాతకములలో వరుణగ్రహ క్రూర దృష్టి వేధకు లోనయినవే : చూడుఁడు : పురుషజాతకమున కుజవరుణులకు పరస్పర సమసప్తక వైరము : స్త్రీజాతకమున శుక్ర వరుణుల కన్యోన్య కేంద్రవేధ. ఇట్టి కుజశుక్రు లిచ్చు రక్తిని వరుణుఁ డెంతకాల మోర్వఁగలఁడు ? విప్రలంభ శృంగార ప్రియుఁడు గదా వరుణుఁడు ! మఱియొక విశేషము: రక్తి నీయఁగల స్త్రీ జాతకపు శుక్రుఁడు పురుష జాతకమున షష్ఠ (రోగ)స్థానమునకు వచ్చుచున్నాఁడు. రక్తివలననో, రక్తికారకో, రక్తిని గూర్చియో, అనారోగ్యమో, ఆఁడు దాని వైరమో రాఁగలదని సూచన. ఆ శుక్రునికి కేంద్రమం దున్న వరుణుఁడు వియోగమును దెచ్చుట కీసామగ్రి నుపయోగించుకొనఁగలఁ డేమో ? స్త్రీజాతకపు శుక్రునికి సమసప్తకమున చంద్రుని వేధ యున్నది. శుక్రుని కార్యములో చంద్రుని చేయి నయిత ముండకపోదు. చంద్రుఁ డీమె జాతకమున (పంచమ) విషయసుఖస్థానాధిపతి. వ్యామోహ పరవశమైన విపరీతబుద్ధి రావచ్చును. కాక, మాతృకారకుఁడైన యీ చంద్రుఁడు మాతృస్థానమందే యున్నాఁడు. విషయసుఖకాంక్షతోటి విపరీత బుద్ధియో, తల్లి చేయు తంత్రమో ఈ చంద్రుఁడు చూపవచ్చును క్రూరవేధితుఁడగు మిథున చంద్రుఁడు కుత్రలు పన్నుటలో సమర్థుఁడఁట ! ఈ చంద్రుఁడు భర్తృ స్థానాధిపతి యగు బుధుని సార్ధకేంద్ర శత్రు దృష్టితో వేధించుచున్నాఁడు. జాతకురాలికి భర్తతో వైమనస్యమో, వియోగమో రాకతప్పదు గదా ! అట్లు వచ్చెనేని, దానికి తల్లికుత్ర యొక కారణ మనిపించుకొనునేమో ?

పురుషజాతకమున ప్రమాదకరమగు క్రూరవేధ కుజవరుణుల కున్నది. ఈకుజుఁడు దశమాధిపతి — అనఁగా, భార్యాస్థానమునుండి మాతృస్థానాధిపతి—అగుటచే వేధాఫలములో నత్తగారికి సంబంధ మున్నదని సూచించఁగలఁడు. నవమభావమున మీనరాశిలోనున్న రోగస్థానాధిపతియగు బృహస్పతి మాయలమారి ఇంద్రగ్రహమునుండి సార్ధకేంద్ర శత్రుదృష్టిని పొందుచున్నాఁడు.అసాధారణములగు మానసిక కారణములవలననో, కృత్రిమతంత్రముల మూలముననో అసాధ్యరోగప్రాప్తి కవకాశమున్నదను సూచన గలదు. పురుషజాతకమున రోగసహమబిందువు మిథునరాశి ౨౫ వ భాగలో నున్నది. ఇది భార్యజాతకమున రాహుకేతువుల

పరిణతుమే నుండుట చదువరులు గమనింపఁగలరు. విషప్రయోగమో, విషజ్వరమో దీని సూచన?

భార్యజాతకమున మాతృస్థానముపై నధికారము గల చంద్రునికి పురుషజాతకమందలి కుజవరుణుల ప్రబలమిత్ర దృష్టి గమనింపఁదగియున్నది. అత్తగారి కల్లునిపై నభిమానము తీవ్రముగా నుండవచ్చునేమో? రక్తిగల భార్య, అభిమానముగల యత్త అనారోగ్యమునకు కారణ మగుదురా? ఏమి దీని యర్థము? పురుషజాతకమున మాతృస్థానాధిపతి యగు శుక్రునిపై కుజవరుణుల కేంద్రఘర్షణ యుండుట వాస్తవమే: జాతకుని తల్లి సమర్థురాలు. ఇతరులతో పొంది పొసగియుండఁగల యోర్పు సామాన్యముగ నామె కుండుట కష్టమే. కాని, సప్తమాధిపతియగు శనితో నీశుక్రునికి మంచి దృష్టి యుండుకారణమున నీమెకు కోడలిపై విశ్వాస ముండును. కాని, ఈ శుక్రునికి పూర్ణకేంద్రమున భార్యజాతకమునందలి యింద్రుఁ డుండుటవలన, ఏదో కుట్రయో, కుతంత్రమో కారణముగ వీరికి మనస్సులు చెడు సంభవ మున్నది. ఇంద్రుఁడు కోడలిజాతకపు గ్రహముకావున, కారణ మచటనుండియే రావలయును. మఱియు, ఈ శుక్రుఁడు పురుషజాతకమున విషయసుఖస్థానమం దుండి, రోగస్థానాధిపతి యగు గురువుతో నానుకూల్యదృష్టి నందుచున్నాఁడు. అనఁగా, స్త్రీవ్యామోహము కారణముగా ననారోగ్యము దెచ్చు విషయమున, ఈరెండుగ్రహముల కైకమత్య మున్నదనుట: ఈ గ్రహద్వయమునకు, శనికిఁ గల త్రికోణదృష్టి చిత్రమైనది. ఈశనికి కళత్రాధిపత్యమేకాక, అష్టమాధిపత్యము నయిత మున్నదికదా? ఇన్నింటిని సరిపుచ్చి సమన్వయపరచుట చాల కష్టము.

శీలసంపన్నుఁడగు సుందరపురుషుఁడు; అనురక్తరాలగు భార్య; సమర్థురాలయి అన్యుల అధికార మోర్వని తల్లి; అల్లునిపై నభిమానము గల అత్త; విపరీతచిత్తవృత్తి కవకాశ మిచ్చు భార్యావ్యామోహము; తీవ్రమైన యభిమానముతో అత్త చేయు తంత్రములు; ఆఁడుదానితోడ వైరము; మానసికకారణములో, కృత్రిమతంత్రములో నిదానముగాఁ గల అనారోగ్యము; వియోగమును సూచింపఁగల దుర్గత:—ఈ పద్మవ్యూహమును భేదించుట సామాన్యముగ నసాధ్యము. కాని, తగినంత యూహాశక్తితోటి ప్రపంచానుభవము లేని లోపము మనదేకాని శాస్త్రముది కాదనుట నిస్సందేహము.

వివాహానంతర మైదుసంవత్సరములలో పురుషజాతకమున లగ్నము చలించి జన్మవరుణుని కెదురుగా సమసప్తకస్థానమునకు వచ్చినది. క్రమక్రమముగా జాతకుఁడు ఆరోగ్యముచెడి మంచముపట్టినాఁడు. ఏ వైద్యుఁడు చూచినా, ఏమి రోగమో చెప్పుట సాధ్యము కాలేదు. రక్తము క్షీణించినది. నెలలు గడచుకొలఁది, దేహ మాద్యంతము తెల్లబారినది. రోగస్థానాధిపతి గురువుకదా? జలరాశిలో నున్నాఁడు. దేహమాద్యంతము శోఫ: కామిలారోగ మని కొంద రనిరి, క్షయరోగ మని మఱికొంద రూహించిరి. ఇంగ్లీషువైద్యులు 'టి.బి.' అని యేదో పేరుపెట్టిరి కాని, మఱికొందరు పరీక్షించి కాదనిరి. ఆరోగి నపుడు చూచి దుఃఖించనివారు లేరు. అనేక స్థలములలో మందుమాకు లిప్పించి తల్లిదండ్రులు వేసరి పోయిరి. మందులతో రోగికే విసుకువచ్చెను. మంత్రములు, జపములు జరిగినవి. ఫలము కానరాలేదు. విషప్రయోగమో, శాబరవిద్యయో కావలయు నను శంకలు బయలుదేరినవి. తాంత్రికుఁ డెవఁడో వచ్చి యుపసంహారమంత్రముప్రయోగించి చాలించుకొనెను. వశీకరణపు మందు విషముగా మారి యుండు నని మఱియెవరో సూచించి కొన్ని నిదర్శనములు చూపిరఁట. ఆమంటమీఁద భార్య శత్రువుగా పరిణమించినది, ఆమెసేవలుసయితము విషప్రాయ మైనవి. ఇఁక అత్తగారి మాట యడుగపనిలేదు. ఆమెతంత్రమే యిది యను నమ్మకము వచ్చినది. ముఖము చూచుటకు నయిత మిష్టపడక జాతకుఁడు భార్యను వెంటనే పుట్టినింటికి పంపివైచినాఁడు. ఆమెయవస్థ కర్మమనిపించుచుండెను. కొన్ని నెలలలోనే చలితలగ్నము జన్మకుజచంద్రసంయోగమునకు రాఁగా, చలితవరుణుఁ డపుడు పూర్ణముగా దాని కెదురునిలచినాఁడు. ఆలుబిడ్డల ననాథలఁ గావించి, శ్యామసుందరుఁడు శరీరయాత్ర చాలించుకొనెను. సర్వదయామయుఁడగు భగవంతుఁడు వాని యాత్మకు శాంతి నొసంగుఁగాక!

మరచితిని. ఏ దినమున నాపెద్దమనుష్యుఁడు శ్యామసుందరుని తల్లిని మోసగించి ఆకన్యకను పిల్చుకొనివెళ్లెనో, నాఁటిదినమున కుజచంద్రసంయోగము (సింహరాశి ౩.వ భాగలో) శ్యామసుందరుని జాతకమందలి ఇంద్రునిపైననే వచ్చియుండుటయు, ఇంద్రరవిసంయోగము (కన్యారాశి ౧౨.వ భాగలో) ఆకన్యకజాతకమందలి చంద్రునికెదురుగా సమసప్తకముననే నిలుచుటయు చదువరులు చూడఁగలరు. ఇంద్రుని మాయానాటకసూత్రధారిత్వమును రుజువుపరచుట కింతకన్న వేరు సాక్ష్యము కావలయునా? 'జాతకాదేశమార్గ' మందలి యీవాక్యమును జూడుఁడు:—

"లగ్నం లగ్నే శస్తరాశ్యాదికం వా,
భావాధీశే కారకే వోపయాతే,
భావప్రాప్తిర్భావలగ్నాధిపత్యో
ర్యోగేన్యోన్యంవీక్షణే వా తథాస్యాత్"

ఇంద్రావరుణగ్రహములకు జాతకములలోఁ గల వెలను తెలుపుటకై విషాదాంతమైన యీవాస్తవ చరిత్రను వ్రాసితిని. పాఠకమహాశయులు మన్నింతురుగాక.

# దేవుళ్లకు కోపంలో చిరునవ్వా?*



= కీ. శే. శ్రీ కపిస్థలం కృష్ణమాచార్యులు =

పొలిమేరలోనించి జలదాలు ముసురుకుంటుంటే, లోకాన్ని చీకట్లు ముంచేసినాయి. మిణుగురుచుక్కలు కళ్లు మూసుకోవటం చూచి, చందమామ తెల్లబోతూ చూపు తప్పుకుంటున్నాడు. ఉరుము వురుముతోంది; పుడమి వడకుతోంది; కదం త్రొక్కుతూ మెరుములు చేసే ఆర్భాటం చూస్తే, సర్వాన్నీ హతమారుస్తాయా అనిపిస్తోంది. మత్తుతో నృత్యం చేస్తూ వీస్తోంది పెన్గాలి. ఉన్మాదక్రోధమూ తానూ మరీ భీషణంగా వుంది తుపాను. పాతాళంలో భూతాలన్నీ కారుమబ్బులై లేచి, నెత్తురు పేరే మంగళగీతా లాలాపించే తమ విలయ వివాహంలో, నేలా నింగీ కావిలించుకుంటున్నై. వల్లకాటిలోకంలో వూపిరిజాడలు లేనేలేవు. ఆరునల్లని కాళరాత్రికి అంతూ పొంతూ వున్నట్టే లేదు. ఇదేనేమో ప్రళయం అనిపించిందే కాని —

ఉన్నట్టుండి తూరుపుమింట చీలిక తోచింది. దిక్కులేని లోకానికి ఆశాలేశం లాగే, వేకువసూర్యుని కిరణం ఒక్కటి చీలిక దారిని తొంగి చూడ సాగింది. చీలిక పెరిగింది; మబ్బులు చెదిరాయి. జలకమాడిన కన్నెజవరాలిలా గుంది భూమి. సెలలూ కాలువలూ చిరునవ్వుకెరటాలతో ఆడుకుంటూ, గలగలా జలజలా పాడుకుంటున్నై. పిట్టలన్నీ గొంతువిచ్చి శ్రుతికలుపుతున్నై. గొడ్డూ గోదా కమ్మని పచ్చిక విందులు మేస్తూ, కళ్లు మూసితెరుస్తుంటే, లోతులేని నీళ్లల్లో పిల్లలు నడకా పరుగూ సాగిస్తున్నారు. పెద్దలుమాత్రం వచ్చే కోతల లెక్కలు వేస్తూ సంతోషిస్తున్నారు...

ఈతుపాను రావటం మంచిదేకదూ?

౨

శూన్యసింహాసనంలోనించి నియంత తన యిష్టం వచ్చినట్లల్లా ఆడిస్తున్నాడు జనాన్ని. ఎంత రాబట్టినా తృప్తి కలగటం లేదు. చిల్లిగవ్వైనా దక్కుతుందో లేదో అనిపిస్తోంది వాళ్లకు. నిరాశ పెరిగేకొద్దీ అది రహస్య మైపోతోంది. వాడు అన్యాయార్జితవిత్తం లెక్కపెట్టుతూవుంటే, వీళ్లు దుర్భరదారిద్ర్యంలో కుళ్లి కుములుతున్నారు. అధికారం యెక్కువయ్యేకొద్దీ వాడు కళ్లు మూసుకుని కలలు కంటూ వుంటే, వీళ్లు పడ్డ పాట్లలో మైకం చెల్లి వేయికళ్లతో చూస్తూవున్నారు.

ఏడుస్తూవున్న ఆకాశంలో ఒక్క చుక్క మెరుస్తోండడం చూస్తే, అది తన

* 'Broken Shells' అని మాతంగ్రిగారి అముద్రిత ఆంగ్లవ్యాససంపుటి ఒకటి వుంది. అందులోని ఒక వ్యాసానికి ఇది నా అనువాదం.

—కపిస్థలం శ్రీరంగాచారి.

కాంతిసంపదను చాటిస్తోందా అనిపిస్తుంది. మబ్బులు దాన్ని మహాకప్పితే, కాస్సేపే. వాటికి తప్పదు చావు. కాని, అది ఆకాశానికి శాశ్వతభూవ. ప్రజ లాచుక్కను చూచి, యథార్థం గ్రహించేసరికి, వారిలో స్వభక్తి మేలుకుంది. నియంతకూ మోకాలు వంగింది వెంటనే. వంగటంతోటే, ప్రజా సేవకుడు ప్రభువు......

ఇలా చూస్తే, నియంతకూడా దయాళు ప్రభువేకాడూ?

3

ఒక ప్రచారకుడు వచ్చి మతాన్ని గూర్చీ, దైవాన్నిగూర్చీ మాట్లాడుతాడు. తనది తప్ప, మతాలన్నీ బూటకాలు. పవిత్రగ్రంథాలన్నీ పరిశీలిస్తే, అంతా చెత్తా చెదారం. అందాకా ఆగ్రంథాలేవీ చదవని మూకలు నోరుతెరిచి విస్తుపోతూ 'ఈయనమాటలు నిజమేనేమో' అంటూ వుంటే, వాళ్లకూ ఆమతానికీ వున్న శాస్త్ర సమ్మంధమూ తెగిపోతుంది. కొత్తమతం మీద మోజూ అంతగా లేదు; పాతమతం మీద పట్టా అసలే లేదు. అదీ త్రిశంకు స్వర్గం. అంతా మాయే అనిపిస్తుం దప్పుడు. గతాన్నించి బలం రావటం లేదు; భవిష్యత్తు గురించి ఆశలేవీ లేవు—బ్రతుకే బరువై పోతుంది. మహాసముద్రం లోతుపాతు లేమో తెలీవుకాని ఏసహాయమూ లేకుండా దాన్ని దాటేయాలని కోరికమాత్రం యింతో అంతో వుంది. ఆ సాహసానికి పూనుకుంటే, లేచింది సందేహం—ఒకే మహాసముద్రం దాటటందుకు యిన్ని పడవ లెందుకా అని. ఎవరి పడవలు వారివే. కడలిమాత్రం ఎవరిదో!

కట్టకడపట తెలివి వచ్చింది. మనక కళ్లకు పదును కలిగింది. అన్నిమతాలూ ముక్తికిబాటలు అన్న రహస్యం తోచింది. పుట్టిన మతమే, పెద్దల మతమే మరీ మంచి దనిపించింది......

మన కళ్లు తెరిచిన ప్రచారకుడు వాస్తవంగా మంచివాడేగా?

౪

ఎక్కడో దూరదేశంనించి ఒక వర్తకుడు వచ్చాడు. వచ్చి, మిరుమిట్లుకొలిపే రంగురంగుల ఆట బొమ్మలు తనముందు పరుచుకున్నాడు. పల్లెటూరి పామరులు నోరు తెరిచి చూస్తున్నారు. బడికి పోతూ పోతూ పిల్లలు దారిలో ఆగి ఈ వింతలు చూస్తూ నిలబడిపోతారు. దారిని పోయే బాటసారి 'నేనూ చూచాను'అని సంతోషిస్తున్నాడు. కాపు నాగేటిబరువులో ఒక దొంగచూపు విసిరిపోతూవుంటే, పనితొందరలో అధికారి, నిలిచిచూడడం కేవలం అనుకున్నా, పక్క చూపులు చూచినందుకు రహస్యంగా తృప్తి పడతాడు. ఆబొమ్మల్లో ఏ ఒకటో రెండో తమవి అనిపించుకోవా లని తహతహలాడని వారే లేరు. ఆ నక్కజిత్తులవ్యాపారి చూచే చూపుల అర్థం—'మీరు కొంటే యెంత; కొనకుంటే యెంత?' మనసులో మాట—'చూడు నాదెబ్బ!' వెండిబంగారాలకుగాని సరకు అమ్మనంటాడు. క్షణక్షణానికీ జనం యెక్కువౌతోంది. కవులూ, కళోపాసకులూ, పండితులూ, ప్రభువులూ ఈవ్యామోహంలో పడ్డారంటే, తక్కిన వాళ్ల సంగ తెందుకూ? ఎవరి వృత్తులూ, ఎవరి జీవనం వారు మరిచిపోయారు. ఆ

వర్తకుని అంగట్లో అడుగుపెట్టినవాళ్లది అధోగతి. దేశంలో దారిద్ర్యం పాలిస్తూ వుంటే, క్షామదేవతకూ మహామ్మారికీ స్వైర విహారం చెలరేగింది. అనంతంగా వర్తుల నృత్యం ఆరంభించింది—దారిద్ర్యం, క్షామం, వ్యాధి; దారిద్ర్యం, క్షామం, వ్యాధి.

ఈ ఎడారినృత్యంలో బడలిన పాంథుడు దప్పికకు ఆగలేక పోతున్నాడు. రెండు చుక్కల వాననీరు పడినా చాలు, సంతోషంగా పడిపోవచ్చు అని డీలుపడుతూవుంటే, వాని కంటికి నీరు కనిపిస్తుంది. అది యెండ మావులేమోనని బెంగ, పాపం! దేవుణ్ణి ప్రార్థిస్తాడు అది నీరే కావాలని, హృదయ పూర్వకంగా. దగ్గరికి వెళ్లేసరికి—అది నీరే—ఆ ఆనందం అనిర్వాచ్యం. 'ఇది నీరు కాదు; అమృతం'అనుకుంటూ దప్పి తీర్చుకుని, ఒక్కసారి వెనుక చూచాడు—తను త్రొక్కింది పెడదారి; బైలుదేరినచోటికి నాలుగడుగుల్లోనే వుంది రాజమార్గం! తన తెలివితక్కువకు తన్ను తానే తిట్టుకుంటూ, రాజమార్గం విడిచి యికముందు ఎన్నడూ నడవనని నిశ్చయించుకుంటాడు.

ఇలాగే ఆ యెడారిబాటసారు లందరూ వర్తులనృత్యం చాలించాలని సంకల్పిస్తూ యోచించేసరికి, వారి చూపు గతంవంక పారుతుంది. దాని వెలుగులో వర్తమానం చదువుకుంటారు. భూతవర్తమానాల కాంతి ప్రసారంలో భవిష్యత్తును నిర్ణయించుకుని—విరహంలో వేగి, పునఃశరీరంభంలో కళ్లు మూసే ప్రియులలాగు—తమతమ వృత్తుల్ని, జీవనాల్ని సంతోషంతో అవలంబిస్తారు...

ఆవర్తకుడూ మంచి మధ్యవర్తే కదూ?
దేవుళ్లకు కోపంలో చిరునవ్వా!



# రమణ సందర్శనము

•

= శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులు =

నిన్నుం గాంచకముందె, నీచరణసాన్నిధ్యంబునన్ భక్తితో
తెన్నుంజూపు మటంచు జేరుటకు ముందే, రామ శ్రీరామ! ఆ
పన్నుం బ్రోవు మటన్న ధారణమునన్ బ్రహ్మర్షి! నీపేరు నా
కెన్నోమార్లు వినంగనయ్యె రమణా! యేదారి జూపింతువో!

కరములు మోడ్చి మ్రొక్కితిని గాంధిమహాత్మున కే ధరాసుతా
వరునకు దక్క నన్యులకు ప్రాంజలి పట్టగ లేదు కాని నా
కరము లదేల నీదు పదకంజములన్ ఘటియించె జూచునే
సరి నిను; నీమహామహితశక్తి 'జితోఽస్మి' యనంగ జేయదే?

చూడగవచ్చియున్ గనుల జూచుదు, ధారణ పూనిపూని నే
నోడితి నిన్ను జూడగ, కనుల్ తమయంతట దామె నిద్రకున్
జాడ లెరుంగజొచ్చినవి ఝల్లు మనెన్ దను వంతకంత నే
వాడల బట్టెనో మనసు ప్రాపమె శాంతిసమాధి యట్టులే.

వినదగు నాయుదంత మొక వింతసుమా, విన నేల నీవు లో
గననగు, నీ కసాధ్యమగు కార్యము గా దది; కాలవేత్త వౌ
మునివి, త్రికాలశాసనవిభుండవు, ఎంచినమాత్ర సర్వమున్
విన గన నేర్చు యోగివి పవిత్రపరాత్మవిదుండవున్ గదా!

మూడుదినంబు లుంటి నిట ముచ్చటగా నిను జూచిచూచి, నీ
వాడ మెలంగినాడను కృపన్ గనుమీ నను కర్మయోగ మే
వాడల ద్రిప్పుచుండినను వారక నిన్ మది నెంచుచుండు, నీ
వాడనుమా ప్రశాంతిమయబ్రహ్మము నీశ! యనుగ్రహింపుమా.

చేరితి శాంతిపాల్కడలి జెచ్చెర ద్రావగ నాన దాని గ
న్నారగ నంగనైతి హృదయం బాకమారె మునుంగగగ్లై నీ
సారకణమ్ము పొందితిని; చాలదు శాంతి, వసింప నెన్నిరో
వారము లప్పుడే మరల వత్తుసుమా రమణా! మునీశ్వరా!

---

# సహగమనం

[కథానిక]

●

= శ్రీ అనిసెట్టి సుబ్బారావు =

ఆరోగ్యమైన ప్రాణులలో పక్షపాతమై, శాపమై తిరుగుతున్నది కరువు. వాతావరణం భారమై, భీకరమై స్టీమరుగొలుసులవలె బంధిస్తున్నది.

ఎర్రగా - వేడిగా - భయంకరంగా పైకి వచ్చే ఉదయము. నిలబెట్టి పీడించే మధ్యాహ్నము. ఎక్కడ నెయ్యిసాచటానికీ వేళ యివ్వక, నిద్రమైకం క్రమ్మించి దిగిపోయే సాయంత్రము. రాత్రికత్తులబోను.

ఆకలికడుపులు ఎండుటాకులవలె భగ్గుమంటే ఒళ్లు బిగుసుకుపోయే చలి.

రాత్రి నిద్రపోయేందుకు, పగలు కూడబెట్టుకు నేందుకు. పగలు దారితప్పింది. రాత్రి మేలుకుని వ్యథ పడుతుంది. చీమలు నయం.

ఎప్పటివలె సాయంత్రం చీకటి తారు ధారగా పోస్తున్నది. ఇంటింటా ప్రజలు మసిలీమసలని నీడల వలె గూళ్లు చేరుతున్నారు.

ఇంట్లో-దొడ్డిలో గోడ గోడలుకూలే అరుపులు. పిల్లలు అరవలేరు. ఏడ్వలేరు. చీకటిలో పెద్దపిల్ల గమ్ముగమనకుండా పడుకున్నది కళ్లు తెరిచి. మిగిలిన రెండు చిరుసులు ఒడిలో వేసుకుని కుత్తేసెపంతో సంతృప్తిపడే బీబీప్రక్కను మైకంలో పడుకున్న పసిబిడ్డ. ఎప్పటివలెనే!

ఆదంతల్లి గొణుగుతున్నది. మంచంమీద పడు కుని వేలపేర్లతో కొడుకును పూజిస్తున్నది.

"వాడు రాడు !—ఎవరూ రారు!...కోడలా! ఊళ్లో అంతా నాశనమైనారేమో, సందడైనా లేదు!

"పెట్టె చంకనేసుకుని ఊరిమీద తిరిగినట్టు తిరిగి ఇంటికి వచ్చి నాలుక కొరుక్కుంటాడు. ఏమిరా అంటే గాండ్రిస్తాడు...అల్లాకి దయ లేదంటాడు. కునిష్టి మొహాలకి అల్లా ఏమి చేస్తాడే కోడలా!"

ఆదంతల్లి బలహీనంగా వీధివంక చూసింది. తలుపుసందులోనుంచి బైటి దీపంకాంతి ఇంట్లోకి జారుతున్నది. కేకలు ప్రారంభించింది. ఆమెకు సౌమ్యంగా మాట్లాడే అలవాటు ఆకలిలో నశించింది.

"ఒసే కోడలా! పరదా లాగవేమే! మీకు పొయ్యేకాల మొచ్చింది."

మౌనంగా అగాధమైన దుఃఖాన్ని భరిస్తూ బీబీ దినదినమూ క్రుంగిపోయింది. వయసువచ్చిన పెద్ద పిల్లగతి యేమికాను? వెళ్లి పరదా పూర్తిగా లాగి వచ్చింది.

ఇంట్లో ప్రాణులు కుళ్లి కాలిపోతున్నవి. ఆచారం పరదా పూర్తిగా లాగివుంచమంటుంది.

ఆదంతల్లి కేకలు !

"వాడి గొంతు కొయ్యా, వాడిల్లు వల్లకాడు గానూ! వాడి జీవానికి పడి చావాల్నొచ్చిందేమో... అల్లా !!"

రోదన ప్రారంభించింది పెద్దగా.

పొరుగిళ్లవారు ఎవరూ రారు. ఏయింటి కాయిల్లు నిశ్శబ్దంగా కూలుతున్నది. బీబీ విసుగుకున్నది. "వల్ల కాడే ఐందిగా!"

"నీవు మా ఇంటికి కొచ్చావని!"

"నేనేం చేశానని—"

"ఎవరూ ఎరగరే కోడలా! పాపం, కంటె అమ్మకుని కమ్మగా తిన్నారుగాని-ఎవరూ ఎరగరట సంగనాచులు! చావండి!"

బీబీ కాపురానికి వచ్చిన ఇరవై య్యేళ్లనుంచీ సమయం దొరికితే సాధించటం అత్తస్వభావంలో జీర్ణించింది.

ఈ వెగటుమాటలు ఇంత బాధలో విని బీబీ సహించుకుపోతున్నది.

ఇంట్లో మూలలు వెతికితే ఒక్క గొడుసులైనా దొరకవు. పెద్దపిల్ల మొదటిరోజుల్లో భుజా లెక్కి తొక్కి ఏడ్చేది. ఆ స్వల్ప శక్తికూడా లేక రెండు నెలలనుంచీ నేలమీద పడి ఏడుస్తూ వుంటుంది. పసిబిడ్డ ఎండిపోయిన తల్లి రొమ్ము పీల్చిపీల్చి ఆకలి తీరక అప్పుడప్పుడు కళ్లు తేలవేసి సంధిలో పడుతుంది.

గలగలమని శబ్దం చేసి వంట నటించుకోటానికైనా సామాన్లు ఒకటీ లేదు. మిగిలిన ఒకటే కుండ పగిలి, గీరితే నల్లని మట్టిచారలు లేస్తాయి.

బిడ్డల్ని చూచుక మురిసిన బీబీ - ఇల్లు తన పేరిటే వుందని అధికారగర్వం పెరిగిన ఆదంతల్లి — మిసమిసలాడే వయస్సులో సౌఖ్యం వూహించుకుని పెళ్లపడిన పెద్దపిల్ల-పాలు కడుపునిండా త్రాగి తల్లి రొమ్ముతో ఆడుకున్న పసిబిడ్డ-అత్తర్లు తయారుచేసి మన్నవలు పొంది ముందువెనుక లెరుగక తిరిగే ఆదం!

ఆకలి దేహంలో త్రవ్వుకవస్తున్నది. దిగులు భూతమై తొక్కుతున్నది; ఉరిత్రాళ్లు వేసి లాగుతున్నది.

హేతువు ఊహించలేని సాధారణులు, తమ జీవనసౌఖ్యానికి తాము బాధ్యులుగాని పతితులు రవంత సుఖంచిక్కితే ప్రాణంనిండా ఉల్లాసం పొందుతారు. దుఃఖం వస్తే క్రుంగి నిశ్శబ్దంగా అనుభవిస్తారు.

"కోడలా, నిన్నే! పిల్ల ఏడుస్తున్నది. పాలివ్వు!"

బీబీ లేచి తడుముకుంటూ ఏడుపు వినవచ్చే వైపు అడుగులు వేసింది. ఇంట్లో దీపం వుంటుందని ఎన్నడో మరిచారు. పైకప్పు కొంత వికలమై పక్షం రోజులు వెలుతురు రావచ్చును. గుడ్డికన్ను మెరిసినట్లు వీథిలో కిరోసిన్ దీపం వెలిగినా, తలుపుకు సందులు వున్నా గోనెపట్టపరదా ఎప్పుడూ లాగేసివుంటుంది. ఇల్లు పూర్తిగా చీకట్లో మూడిపోయింది.

నేలమీద పిల్లప్రక్కన పడుకుని రొమ్ము పిల్ల నోట జొనిపింది. "పిల్ల ఏడుస్తున్నది-వచ్చావా" —అత్త. ప్రక్కనే వున్నా ఒకరికొకరు కనిపించరు. మైకం క్రమ్మిన ఆకలికళ్లకు చీకటి మట్టివలె పేరుకుంటుంది.

"పాలిస్తున్నా!"

త్రాగుతున్నది పాలో రక్తమో పిల్లకు తెలియదు. చప్పరిస్తుంది. కొరుకుతుంది. బీబీ బాధగా మూలుగుతుంది. పెద్దపిల్ల ఏడుపు గొంతులో గడ్డకడుతుంది. పసిబిడ్డ అమాయకంగా ఏడుస్తుంది.

తలుపు గుద్దుతున్నాడు ఆదం. తల్లి క్రోధం కంఠంలో పలికింది. "వచ్చాడు మొగాడు!...తియ్యవే తలుపు!"

"తీస్తున్నా అత్తా!"

"తియ్యకపోతే మునిగిం దేముంది!"

బీబీ లేచి తడుముకుంటూ పెద్దపిల్లను తొక్కి వెళ్లి తెరిచింది.

"బ్రతికున్నానే అమ్మా!" పెద్దపిల్ల గాద్గదిక స్వరం పలికింది. దేహంలో ఆకలి విద్యుత్తువలె కాల్చుతున్నా నోరు తెరిచి అడగని పెద్దపిల్ల పెద్దగా మాట్లాడలేదు.

చీకటిని దూసుకుని చూపులు. చింతనిప్పుల కండ్లు. పెద్దగా శబ్దంచేసి అత్తరుపెట్టె క్రింద పడవేశాడు. పెళుచుగా కూచున్నాడు ఆదం.

కరకుగా "వచ్చావా!" అని తల్లి.

పెళుసుగా "రాక!"—ఆదం.

"తెచ్చావుగా!"—తల్లి.

"ఏం తెచ్చానే ముండా!"—ఆదం.

"మొగవాడివే!"—తల్లి.

"నోర్మూయ్!"—ఆదం.

"నీప్రతాపం నామీద దేనికి?"—తల్లి.

"నోట మట్టిగొట్ట!"—ఆదం.

"ఊరుకో—ఊరుకో!"—భార్య బీబీ.

"ఎగరనియ్యవే! కాళ్లు విరిగినయ్!"—తల్లి.

"వెళ్లు ఇంట్లోనుంచి. లే!"లేచాడు కస్సున.

"నా ఇల్లు!"—తల్లి.

"గెంటేస్తా!"—ఆదం.

"తల్లిని గెంటెయ్యి! చావరాదురా, పీడ వదులుతుంది!"—తల్లి.

ఎప్పుడూ ఇంతే. ఆదంకు దిక్కుతోచదు. "ఏం చేస్తాను? ఏం చేస్తాను?" తీవ్రమైన సిగ్గుతో, భయంతో కాలిపోతున్నాడు. లేచి నిలిచాడు. "ఏం చేస్తాను?" అత్తర్లపెట్టె కాలితో తన్ని, హఠాత్తుగా తల్లిమీద ఎగిరిపడ్డాడు.

"వెధవముండ! అమ్మవుగదా అని...చావు—సంజెలున్నయ్యంటే, వెళ్లమంటావ్! చావు!—చూస్తా, చూస్తా"

భార్య రెండుచేతులూ పుచ్చుకుని ప్రక్కకు నెట్టుకుపోతూన్నది. "ఊరుకోండి! నాకోసం—నాకోసం ఊరుకోండీ—నవ్వుతారు!"

ప్రతిఇంట్లోనూ ఇంతే. ఎప్పుడూ ఇంతే. కాని, సంఘంభయం తగ్గదు. పెద్దపిల్ల లేచి గోడకానుకుని, ఓపిక చాలక మళ్లీ నేలమీద వాలింది. ఆదం వెనక్కు తగ్గాడు. కసి! కసి! ఎవరిమీద? మనస్సులో బాకులతో పొడిచినట్లు గాయాలు-ఏం చెయ్యాలి? భార్య కూచోబెట్టింది. ఆదం ఉక్రోషంతో శ్వాసవిడుస్తున్నాడు. "ఏగాడిద అత్తరు కొంటాడే! దీని పని తేలుస్తా—తిండిలేక మాడుతుంటే ఏగాడ్దె—ఏగాడ్దె—అత్తర్లు తాగుతారంటే!"

ఆదంవొళ్లు నిమురుతున్నది భార్య.

"ఆమె ఏమంది?"

"చావమంది — వాళ్లాయన వద్దన్నాడని తేల్చింది!"

"ఇవాళ్లు తిప్పి?"

"తిరిగితే నేనేగా మాడేది...అవునే, ఆడవాళ్లకు అత్తరుపిచ్చి, మొగవాళ్లకు మోటారుపిచ్చి"—పళ్లు పటపట కొరికాడు.

"పిచ్చి కుదిరింది!"

"వాళ్లకేం?"

"అందరికీ అంతే. కటకటలాడుతుంది—ఉన్నవాళ్లకు ఐపోతుందని, లేనివాళ్లు గయావార్!"

వీధిలో కేక విని వెళ్లాడు. వెల అడగలేదు. నారింజపండ్లు చూస్తే ఆపాళంగా మింగెయ్యాలనిపించింది. వీధిలో కేక వినిపించి నెలల్లు గడిచాయి. డజను పండ్లు ఇంట్లో పోసివచ్చాడు. పెద్దపిల్ల, భార్య, తల్లి ఎగబడి చీకటిలో పండ్లకోసం వెతుకుతున్నారు. తిట్టుకొంటున్నారు. వాకిలివద్ద ఆదం పండ్లవాడిని బ్రతిమాలుతున్నాడు.

"తీసుకోవోయ్! చిల్లర లేదు!"

"నాకాడ వుండాది నవాబ్!"

"ఇది తీసుకో; లేకపోతే పండ్లు తీసుకో."

"పండ్లే ఇప్పిచ్చండి నవాబ్!"

గడ్డంపట్టుకుని బ్రతిమాలుతున్నాడు. "ఇది నాలుగురూపాయలు. అచ్చం రోజాఅత్తరు...సీసా నిండా వుందోయ్, తీసుకోవూ!"

"బాగుండాదే! మాకెందుకయ్య—పండ్లియ్యి"

"పండ్లు తెచ్చియ్యవే!" ఆదంగొంతు వినుకున్నది. దర్జాగా అన్నాడు. పెద్దపిల్ల, తల్లి ఎవరిచోట వారు గుట్టుగా వెళ్లి పడుకున్నారు. తల్లిగొణుగుడు వింటూ వాకిలివద్ద నిటారుగా నిలిచాడు ఆదం.

సీసా తెరిచాడు. వాసన చూచి, మూసి ఎదురింటిగోడకు విసిరికొట్టాడు. "ఠ్లక్"మని బ్రద్దలై, వాసన ధార కట్టింది. ఇంట్లోకి చూచుకున్నాడు. విన్పించేది చెవులకే. చీకట్లో పూడిపోయిన ఇంట్లోనుంచి తారాచువ్వలవలె శబ్దాలు లేస్తున్నవి.

దొడ్డిలో గేదె తలుపుతన్ని గగ్గోలుగా అరుస్తున్నది. పెద్దపిల్ల కుళ్లికుళ్లి ఏడుపు. భార్య జోలపాట పాడేందుకు వృథాయాస. తల్లి—"అమ్మా! తల్లి!"—శాపాలు. వచ్చి కూచునిగట్టిగా నిశ్చయంగా అన్నాడు: "నావల్ల కాదు!"

"ఏపాట్లైనా పడాలి ఇక!"—భార్య.

"ఈసంసారం మండిపోను. నావల్ల కాదు!"

"ఇప్పుడు మండటం లేదురా!"—తల్లి.

"మాలాతాత రాలేదే!"—భార్య.

"వాడు నయం. ఒకే ఆదం, కూడు పెట్టలేని వాడివి చావనన్నా చావవేంరా!"—తల్లి.

"అబ్బ! ఈమెతో పొయ్యేకాల మొచ్చింది"-భర్తా, భార్య ఒకేమారు గదిమారు. దొడ్లో గేద అరుపులు గోడలు కూలే అరుపులు. పెద్దపిల్ల వెక్కి వెక్కి ఏడుస్తున్నది. సముద్రం పొంగి ఉప్పెనలో అల్లలాడుతున్నాడు ఆదం. కళ్లముందే రాజుకుని భగ్గుమని దశదిశలు క్రమ్మే జ్వాలలై-అతని సర్వమూ దహనమౌతున్నాడు. అత్తర్ల పెట్టె తెరచాడు. ఊరు వస్తుల కట్టలు వీథిలాంతరువద్ద ముట్టించి తెచ్చాడు. అగరుధూపం ఇల్లంతా అల్లుకున్నది.

"అదేమిట్రా!"—తల్లి.

"నీకే ధూపమేస్తున్నా!"

భార్య భయపడుతున్నది. ఒక్కొక్కసీసా తెరిచి అన్నాడు. "సంపంగి" పొలకపోశాడు. "జాస్మిన్" బొళబొళ కారిపోయింది.

"ఏమిట్రా!"—పెద్దగా తల్లి.

"నీకే వారు పోస్తున్నా!"

భార్య నిశ్శబ్దంగా కళ్లు తుడుచుకుంటున్నది. పెద్దపిల్ల చకితయై వచ్చి, బురదమీద చేతులద్ది తీసి తన దుస్తులమీద, నిద్రపొయ్యే చెల్లెలివొంటిమీద, చాపమీద పులుముతున్నది.

బీబీ ఆదంచేతులు పట్టుకున్నది.

"వదలవే!" ఘోరమైన అరుపు.

ముగించి, మెల్లగా లేచి ప్రక్కఇంటి వామి నుంచి రహస్యంగా మేత చేరవేశాడు. ప్రక్కఇంటి ఆసాములు పూర్వమే ఇల్లు విడిచారని తెలుసు. ఇంట్లో వామితప్ప ఏమీ లేదని తెలుసు. భార్య వారించింది.

"మీకు పెట్టలేను - దానైనా కడుపునిండా తిననివ్"—ఘోరమైన అరుపులే అతని సంభాషణ.

చుక్కలు దిగిపోయే వేళకు నటిస్తున్న నిద్ర లేచాడు. ఇల్లు చిరిగిన మాసిన బట్టల మూట. నిశ్శబ్దంగా బెరుకుగా వున్నది. వీథిలో కుక్క ఐనా మొరగటం లేదు. ఊరిలో కుక్కలు లేవు. భార్యపక్కలో బిడ్డ మసిలింది, ఏడ్చింది. 'అయ్యో!' విడిన కప్పులోనుంచి చుక్కలకేసి శూన్యంగా చూస్తున్నాడు. తల్లి కలవరిస్తున్నది. "ఇల్లు ... ప-న్నూ." ఆదంకు ఇప్పుడు గుర్తు. "అమ్మో, పన్ను!" బిడ్డ ఏడుపు చాలించి తల్లికడుపులో ఒదిగింది. లేచాడు. వీథితలుపు తెరిచాడు. పగటి ఎండ సూదులుగ్రుచ్చుతున్నది. ఇల్లంతా గగ్గోలుగా వున్నది. పాలకోసం ఏడ్చే బిడ్డకు తల్లి పెద్దపిల్లరోదన అర్థంకాదు. అత్త దిగాలుపడ్డది. జారిన గుండె పైకెత్తుతున్నది. కోడు కును వేలపేర్లతో పూజిస్తున్నది. మస్తుగా మేసిన గేద మేతలో పడుకుని ప్రొద్దెక్కుతున్నా లేవలేదు.

తలుపునప్పుడు సైట. ఆతురతగా చూచారు. నవ్వుతూ మాలా ప్రవేశించాడు. బ్రతుకనేర్చిన అతను ఎప్పుడూ నవ్వుతూనేవుంటాడు. రెప్పలవెనుక, కోడిగుడ్లవలె కన్నులు తిప్పుతాడు. తలమీద ఎప్పుడూ కుచ్చులటోపీ. వంకరగా బరువుగా ముందుకు వంగిన ముక్కు కనుగుడ్లకుదించిన లంగరు. చొక్కాలేని చిరుగుల పొడుగుకోటు. తెల్లని మరాయి. గడుసరి. మోసంలేని మాట చెప్పలేదు.

అతని జుత్తు తెల్లగా వుంటుంది. అతని నవ్వు నల్లగా వుంటుంది. పెద్దపిల్ల ఆకలి తల్లికి తెలుసు. అందుకే పసిబిడ్డకు పాలివ్వటం నటిస్తున్నది. కుంపటి రాజినట్లు అత్త గొణుగుతూనేవున్నది. "ఆదం ఏడీ?" అణిగిన రోదన మళ్లీ లేపాడు మాలా. బీబీ జవాబివ్వలేదు. "ఏడమ్మా?" మారవుబంధువనీ, కుటుంబ శ్రేయోభిలాషి అనీ కొన్నాళ్లనుంచి మాలా వస్తున్నాడు.

"ఎందుకడుగుతావ్ తాతా!" — బీబీ.

"ఖాసిం ఇంట్లో ఏకాదశంటూకే—ఏకాదశి."

"ఇది ఆరోనాడు తాతా!" — బీబీకి ఏడుపైనా రాదు.

"నాకు తెలుసు, అందుకే వచ్చాను ... ఉపాయం వుందిలే"— మాలా. హెచ్చిన అతని అభిప్రా

యానికి నాపటి ముక్కుతలవలె కుమార్గాలు చాలా తెలుసు. "ఇంట్లో ఏమీ లేదా?" ఎవరూ పలకలేదు. ఏమీ లేదని అతనికి తెలుసు. పెద్దపిల్ల పత్తుకడియాల వంక చూశాడు. మిగిలినవి అవే.

అప్యాయంగా పలకరించాడు. పెద్దపిల్లవంక చూచి నవ్వుకున్నాడు. "నీవొళ్లు అత్తరువాసన గుమ్మమంటున్నది పిల్లా!" అన్నాడు. మధ్యాహ్నానికి అన్నం తెస్తానన్నాడు. ఆకలికి ప్రశ్నలు, సందేహాలు లేవు. మనస్సులన్నీ ఆకర్షితమైనాయి. అత్త నిద్రపోతున్నప్పుడు మాలా అన్నం తెచ్చాడు. ఆవురుమంటూ తిన్నారు బీబీ, పెద్దపిల్ల. మాలా కూచుని పరిహాసంగా మాట్లాడుతున్నాడు. పెద్దపిల్ల ప్రాణం తేరుకుని పడుకున్నది.

అత్త నిద్రలేచింది. 'తనకు ఆవేళకే ఎందుకు కళ్లు తిరిగి మైకంకమ్మాలి?' 'మెతుకైనా తనకు మిగల్చరేం!' ఇల్లు తన పేరిటే వున్నది. బూజుపట్టి, పెళ్లలు రాలి, పెంకులు పగిలి, కుళ్లిన పండువాసన వేస్తున్నది. ఇల్లు బాగుచేయించుకోవాలి! బీబీని ఆజ్ఞాపించింది: "కోడలా! కడుపునిండా తింటారు గాని దొడ్డుకోలేరేం!" "నీఅబ్బసొమ్మన్నదని తిని పడుకుంటావ్?" "శుభ్రంగా బాగుచేస్తే వుండండి, లేకపోతే—."

"చేస్తానత్తా" బీబీ వోపిక బిగబట్టి లేచింది. 'రేపు అన్నం ఎలాగా?' అని వాపోతున్నది. ఆశ పూర్తిగా వశించినప్పుడు ముందాలోచన వుండదు. కొంచెం సంతృప్తి దొరకినప్పుడు 'తరవాత?' నిసురించి ఆరాటం ఎక్కువ.

అత్తఆజ్ఞ మీరితే కొలూవటానికే అస్కారం లేదు. శ్రమిస్తే అన్నం త్వరగా జీర్ణమై పిల్లపాలకు కష్టమని భయం! తూలుతున్నది, లేస్తున్నది. బూజు తుడుస్తూనే వున్నది. మాలా వెళ్లినతర్వాత తలుపు చప్పుడయింది. ప్రతిఒక్కరూ ఆతురతగా చూచారు.

"వాడే. తలుపుతియ్యొద్దు" - అత్త.

"నీకొడుకు కాదూ?"—బీబీ.

"వాడి జిమ్మడ - పన్నుకోసం - తియ్యొద్దు." తలుపుగుద్దిన చప్పుడు ధబీధబీమని బైటినించి విన్పించింది. "స్వంతాస్తులు రోళ్లయి మెడకి వేళ్లాడుతున్నై - అదే శాపంలే!" అని. తర్వాత బైటితలుపువెనుకనుంచి చూచి (ఘోష) "అల్లరిపిల్లలు కొయితం అంటించారత్తా" అన్నది బీబీ. అత్త గ్రహించింది. దూషిస్తున్నది. గొణుగుతున్నది. రాత్రివేళకు మాలా రిక్తహస్తాలతో వచ్చి, వెంటనే "ఒకపని చెయ్యాలి - ఒకపని చెయ్యాలి! డబ్బు రాలుతుంది!" అంటున్నాడు. కులాసాగా పుష్తూపదాలు పాడుతున్నాడు. బీబీ ప్రశ్నించలేదు. పెద్దపిల్ల గాఢనిద్రలో వున్నది.

"నా కంటె అమ్మి కడుపునిండా తిని పడుకున్నారు." అత్తకు పన్నును గురించిన భయం. నిజమే! ఒక్కొక్కప్పుడు స్వంతాస్తులు కాటువెయ్యబోతున్న పాములై, కూడబెట్టుకున్న పాపమై మెడలకెక్కుతాయి. "దయ్యాలు! కమ్మగా తిని పడుకున్నారు - వాడు బావో చెరువో చూసుకున్నాడు. నేనే, నేనే!! మిగిలాను-అల్లా!"

మాలా అత్తకోపానికి బెదిరిపోయాడు. పదాలు మాని నిద్రపోతున్నాడు.

ఇల్లు నిశ్శబ్దంగా వున్నది. కప్పులోనుంచి అత్తకు చుక్కలు కన్పించటం లేదు. మురిగిన కుళ్లిన వాసన ఇల్లంతా ప్రాకింది.

అత్తకడుపులో ఆకలి గర్జిస్తున్నది. క్రోధం— ఎవరిమైననో తెలియదు. మనసులో శూలాలు దించుతున్నది.

చీకటి బరువుగా నల్లరాతివలె పడి ఎవరూ కన్పించరు. ఆకలి తాగలేనిమంట అంతటా అదే. కళ్ళు జిమ్మమంటున్నవి. ప్రాణం తేలిపోతున్నది. లేవాలనుకుంటుంది అత్త. "కళ్ళశానంలో పూడ్చారే మిమ్మల్ని" తిట్టుకుంటున్నది. వింటున్నది. మేలుకుని వున్నా కలమోభయం. ప్రక్కనే భారంగా శ్వాస విడుస్తున్నట్లు విన్పిస్తుంది. అదేమిటి?

"తలుపు!"

"ఎవరు?" దీనంగా లేచింది. దొడ్లో గేదె త్రాడు తెంచుకొని గిట్టలతో తలుపు రాచే శబ్దం. గేదె ఒక్కసారి గోడలు కూలేలాగు అరిచింది.

గేదను కట్టి, చిందరవందరగా పడివున్న మేత నోటిలో తురిమివచ్చింది.

శబ్దం విన్నప్పుడు పన్నువాడు ఆరాత్రివేళ ఎలా వచ్చాడా అని హడలిపడ్డది. గేదనోట్లో మేత పెడుతున్నప్పుడు తనే నోట్లో కురుముకుని కసకస నమలాలనిపించింది.

తన మంచంవంక చూచుకున్నది. తెల్లగా తన ఎముకలు పరిచివున్నవా? ఇంటివంక చూచుకున్నది. తన ఇల్లే - అయ్యో! నాగోరీ ఇదే! హడలిపడ్డది.

ఆకలి? లేచుముకుంటూ కూచుని ఒక్కొక్కరి కాళ్ళు వెతుకుతున్నది. వీధివాకిలి చప్పుడు లేకుండా తెరిచి చూపింది. పైట ఒళ్లు బిగుసుకుపోయే చలి - మంచు.

మాలాపిదార్ప్యుల్లోని గూఢార్థాలు అతని కోడి గుడ్లకళ్లలో మెరుస్తాయి. పగలంతా బీబీ ఎదురు చూస్తుంది. తలుపుకొట్టి ఆదం వేసే కేక విన్పిస్తుం దేమోనని!

ఉత్తరం వస్తే ఇదే తొలిసారి. బంట్రోతు సైకిల్ గంట మ్రోగుతుందేమోనని. పరదా పూర్తిగా లాగేసివుంటుంది ఎప్పటివలెనే.

రెండురోజుల కొకసారి అన్నం తెస్తున్న మాలా ఐదురోజులై ఆమాటే ఎత్తడు. కడియాలు పెరుకుకొన్న అత్తను మెల్లగా మనసారా దూషిస్తాడు. ఆమెమంచంమీద అతని పడక.

"తరతరాలనుంచీ మన కుటుంబాలు ఆప్తమిత్రులే బీబీ" అంటాడు.

పళ్లతో గట్టిగా చనుమొనలు కొరికి పసిబిడ్డ తప్పనిసరిగా నిద్రపోతుంది. మేలుకోవటం నిద్ర ఒకటే. "నన్ను కోసుకు నమలండి!" బీబీ ఏడుస్తుంది. పెద్దపిల్ల దూరంగా పడుకుని పైటకొంగు నాలుకతో తడుపుకుని కసితీర, ఆకలితీర నములుతుంది. ఉత్తరం ఆశ వదలదు. కాని - ఉత్తరాలు అతిథులవంటివి. లేనివాళ్ల ఇళ్లు దర్శించవు.

సాయంత్రానికి మాలా వచ్చాడు. బెదిరినట్లు కన్పిస్తున్నాడు. త్వరపడుతున్నాడు. పరదా నిండుగా లాగివచ్చాడు.

"ఏమైంది?"

"మాతమ్ముడు ... నీకు చెప్పానే — వాడి ప్రాణానికే ముప్పువచ్చింది." భయంతో చేతులు వొణుకుతున్నాయి. ఆశతో లేచిన పెద్దపిల్ల తిరిగి పడుకున్నది. పవిటగుడ్డ కసితో నములుతూనేవుంది.

"ఏమి" - బీబీ.

"దేశం గగ్గోలుగా వుంది-ఇప్పుడే కూడూ గుడ్డా దొరికేది అన్నాడు. గుంపులుకూడి బజారువెళ్లనూ, పోలీసులు పొడిచి లాకప్ చెయ్యనూ-" తెల్లని గడ్డం చెదురుగా దువ్వుకున్నాడు. "బజారులో అడుగుపెట్ట డానికే భయం!"

"పట్టిదే?"

"పోలీసులు మనల్ని ఊచవకేం?"

"అనుకుంటే చంపగలరుకూడా-"

"చస్తే కావలసిం దేముంది!" బీబీకి బిడ్డపక్క లో పడుకోవాలన్నా భయమే.

చస్తేనే మంచిది.

"ఎప్పుడు చస్తామో-ఇల్లు కొస్తా పందులగుంట అవుతున్నదీ. అబ్బ! వాసన-సైతాన్ తిరుగుతున్నాడు ఇంట్లో!" మాలా వినడు. పెద్దపిల్ల చేరువగా వెళ్లి "ఒక మేలు చెయ్యాలి పిల్లా!" పలుకలేదు. లాలిస్తున్నాడు. "నిన్నే పిల్లా! ఒక మేలు చేశావా-" హీనస్వరంతో "ఊ" అన్నది. ఇప్పుడే వస్తానని మాలా చరచరా వెళ్లి పోయాడు.

ఆకలితో ప్రాణాన్ని చల్లారే దేహాలకు రాత్రి చీకటిజబ్బుపైకం క్రమ్ముకున్నది. ఉత్తరం రాదని బీబీకి నిశ్చయంగా తెల్సు. కాని, నమ్మితే సంతృప్తి. కల్పించుకున్న ఆశతోనే దగ్ధమౌతున్నది బీబీ. హీన స్వరంతో పెద్దమ్మాయి అన్నది: "మాలాతాతకి , మన మీద ప్రేమమ్మా!" "దిక్కులేనివాళ్లు అందరినీ ప్రే మిస్తారే" అన్నది తల్లి. దొడ్లో గేదెరంకెల అరుపులు. "ఏడవలేనిగేదె అరుస్తున్నది. నాకు నాలిక పిడచ కట్టింది. అమ్మా! ఏంచెయ్యాలే" అని పెద్దమ్మాయి యాతన.

బీబీ హఠాత్తుగా రోదన ప్రారంభించింది. లేచింది. తల గోడకు బాదుకుని "పిల్లా! పిల్లా!

నాగతి-చూడవే-నాగతి-పిల్ల కళ్లు తేలేస్తున్నదే - చూడవే తల్లీ! ఎండిపోయినదయ్యో - అల్లా! ఓ అల్లా!" పసిపిల్ల ఏడుపు చాలించింది. నాళాల్లో రక్తం మందంగా కదులుతున్నది. దొడ్లో గేద గోడలు కూలే అరుపులు.

బైట పరదా కదిలి రెపరెపమన్నది. వాకిట్లో మాలా తాత "పిల్లా!" అని కేక వేశాడు. "ఏదో తెచ్చాడు" అని రాళ్లు క్రక్కినట్లు మాట్లాడి పెద్దపిల్ల వెళ్లింది.

వాకిలిచాటుగా నిలబెట్టి బుజ్జగింపుగా భుజం దువ్వాడు. "చూడు-కన్పించలా?" ఘంతో ఘంతో మృదువుగా మాటలు జార్చుతున్నాడు. "ఎవరు?" వీధిలాంతరుమూగవెలుగుక్రింద ఏదో నీడ కదులుతున్నది. "చూడు! మరి-మరి -నీఒళ్ల త్తరు వాసన తగ్గలేదే పిల్లా!" నవ్వుతున్నాడు.

తీక్షణంగా నీడవంక చూచి సిగ్గుతో, అభిమానముతో క్రుంగిపోయిన పెద్దపిల్ల ఏడవలేక తల్లిఒడిలో వచ్చి వాలింది. "మా బ్రతుకు కింతకి వచ్చింది"— బీబీ మంచంపట్టెకు తల కొట్టుకుంటున్నది. విషయం తెలిసి త్రాచువలె లేచింది. "ముసల్మాను బిడ్డని ఎంత మాటన్నావురా నీకడుపుమండా! నీకుపిల్లలు లేర్రా, నాశనమైనార్రా! ముసల్మాను బిడ్డని ఎంతమాట అన్నావురా సైతాన్!"— మాలా చలించలేదు. "మీమంచికే — నాకేం!— మీకోసం — కుళ్లి పోతున్నారని — నేనూ కుళ్లుతున్నా—" మంచమెక్కి పడుకుని పదాలు పాడుతున్నాడు. బిగుసుకుపోయే ముక్కుల్లో గాలి వూది, పైటకొంగు బిడ్డ చుట్టూ కప్పుతున్నది బీబీ. తీవ్రంగా చలి విసురుతున్నది.

"మేకే మాలా బులాలో..." ప్రారంభించి నిద్రపోయేవరకు పాడుతూనేవున్నాడు.

పెద్దపిల్ల ఒకచావు చచ్చిన అభిమానంతో కుళ్లి కుళ్లి పోతున్నది. దొడ్లో గేద గగ్గోలుగా అరుస్తున్నది. గర్జిస్తున్నది.

ఇల్లు రాయి కప్పని గోరీలాగా ఘాటైన వాసన లేచింది. దిక్కుతోచని గబ్బిలమై తిరిగే చలి.

బిడ్డను కడుపుకు కరిపించుకుని ఒళ్లు వెచ్చగా నిమురుతున్నది బీబీ. తనకు నరాలు కాలుతున్నవి.

"రేపు — పన్ను — ఇల్లు వేలం వేస్తారు" జ్ఞాపకం చేశాడు మాలా. బీబీ గుండెలో కుమ్మిన మాటలు. మెల్లగా అడిగింది.

"తప్పనిసరా?"

"ఆహా!"

"ఏం చెయ్యమంటావ్ తాతా?"

మాలా దయతలిచినట్లు "నువ్వా ఇంతవరకు పరాయిమొహం చూళ్లేదు.......... పెద్దపిల్ల పెంకిది, అమాయకురాలు. పరదా పీకేసి వాళ్లింట్లో ప్రాణం పెడితే—నువ్వు ముసల్మానుబిడ్డవి!"

బీబీకి నిద్ర రాలేదు. రాదు. సంధివచ్చిన రోగిలో ప్రాణశక్తి అల్లలాడినట్లు తల్లడిల్లుతున్నది బీబీ. పెద్దపిల్ల కళ్లు మూసివున్నది వింటూనే. పల్లెత్తి మాట్లాడే ధైర్యం ఎవరికీ లేదు. మాలా మళ్లీ అన్నాడు. "ఎట్లా వుంటావోనమ్మా!— ఇల్లంతా కుళ్లిన కుక్కకంపు—అబ్బ!" పదం పాడుతున్నాడు. మాలా ఎప్పుడు నిద్రపోతాడా అని బీబీ కాచుకున్నది. దొడ్లో గేదెఅరుపులు గర్జనలు.

నడిరాత్రికి లేచి పక్కఇంటి వాకిలోనికి దూకి గేదెకు మేత చేర వేసింది. చంకలో బిడ్డ. పెద్దపిల్ల లేచింది. మళ్లీ పరదా నిండుగా లాగింది. బైటి చీకటెక్కి షికారు తిరుగుతున్న చలి.

ఎండలో తళ తళ మెరిసే మంచు. ఎలుకలు, కుక్కలు ఎక్కడ చూచినా ఇండ్లలో, వీథులలో పడి వాసనలేస్తున్నాయి.

మాలా ఆశ్చర్యచకితుడై దొడ్లోకి వెళ్లి వెతికాడు. మస్తుగా మేసి పడుకున్న గేదెమీద కుక్కఎముక కరచుకుని కూచున్న కాకి.

"హుష్!" కాకి ఎగిరిపోయింది. తన గేదె మరి. తన ఇల్లే! పెద్దపిల్ల వెళ్లిపోయిందని విచారం. ఇల్లంతా తిరిగిచూచుకుని తాళం తెచ్చి బిగించాడు.

మాలపల్లె తోలుకువెళ్లిన గేదను తెచ్చి ఊరిలో వదిలాడు.

"వెధవ బంధువులు! అన్నిటికీ ఆక్షేపించడమే! అంత దయుంటే కొనేసుకోరాదూ!" అని విసుగుకున్నాడు. ఇపుడు సర్వకాలాల్లోనూ ఇంట్లో తనే. కొన్నాళ్ళుగా అతని నిశ్శబ్దానికి అంతరాయమే లేదు. అధికార్లు వొచ్చారు. మాలాకు కోపం వచ్చింది.

"ఈ ఇంటివా డేడీ?"

"నేనే!"

"నువ్వుకాదే—"

"నేనేనంటే"

"వేలం వెయ్యాలి — తాళం చెవి ఇవ్వు"

"ఇవ్వను!" కుంటుతూ పరుగెత్తివెళ్లాడు. అధికార్లు విచిత్రంగా చూశారు. తెరిచారు. వేలంలో పాట పెరుగక, ఇల్లు శూన్యంగా నిశ్శబ్దంగా కూలిపోతున్నది. పగటివేళ ఎండకు ఇంటి దుర్వాసన వీథిలోకి జారుతుంటుంది. ఎవరూ రారు. రాత్రివేళ చీకటి గడ్డకట్టి కూచుంటుంది. ఎవరూ రారు. చావులేని వేపచెట్టుమాత్రం దొడ్లో పూత రాల్చుతున్నది.

దీపావళినాటికి మాలా శంకిస్తూవచ్చాడు. అతని నమ్మకం రూఢీఐంది. కుష్ఠువాడి కుళ్లుచేతికి బంగారపు తాయెత్తులాగు క్రొత్త తాళం. కూలుతున్న గోడలు. రాలుతున్న పెంకుల గోడలు. ఎవరూ లేరు. గోడ దూకి-అతని కళ్లు జిగేలుమన్నాయి.

ఇంట్లో పడివున్న పాట్లాం విప్పి బట్టల జత తొడుక్కుని "అచ్చం మిలిటరీవాణ్ణే!" అని మురిసిపోయాడు.

"ఈకవరుకోసం చదు నెవడికొస్తుంది!" అని ఫక్కున ఉత్తరం చించేశాడు. ఇంట్లోకి నడిచాడు. అరుస్తున్న గుడ్లగూబ హఠాత్తుగా వెళ్లిపోయింది. పైనుంచి దిగిన ఎండగిరిలో నేలమీద రెండు బల్లుల్ని చీమలు లాక్కుపోతున్నాయి. ఘాటైన దుర్వాసన పొగవలె లేస్తుంది.

కరకైన శబ్దాలు విన్పించే దొడ్డిగుమ్మంవద్దకు ధీమాగా నడిచాడు. "ఏమిటదీ?" గేదె! బైటినుంచి తలుపు కుమ్మి గగ్గోలుచేస్తున్నది. పూర్తిగా జల్లని వెదురుబుట్టలాగు ఎముకలు దాని శరీరమంతా పొడుచుకొచ్చాయి. "నీఅబ్బసొమ్ము ఏముందని వస్తావ్!" అని నేలలో పాతిన కొయ్య పెరికి ఛడీఛడీమని కొట్టి తలుపు మూశాడు. ఎండలో మెరసే రక్తపు చారలపై వాలే ఈగలకు తోక ఆడిస్తూ మెల్లగా వెళ్లిపోయింది. మంచంమీద సుఖంగా మత్తుగా పడుకున్నాడు. బైటికి వెళ్లబోతున్నప్పుడు, సంధ్యచీకటిలో దీనంగా బేలగా ఎదురుగా నిలుచున్నది పెద్దమ్మాయి. "పిల్లా, చూడు!" బట్టలు చూపుతున్నాడు. "నావే—" నవ్వాడు.

"బంట్రోతు విసిరాడుగామాలు."

"రెండునెల్లయి - అమ్మ నన్ను మరిపించి పోయింది - ఇట్లాగే తిరుగుతున్నా - అయ్యేడీ?"

"అమ్మదగ్గిరుంటాడే పిల్లా. ఒప్పుకోవే ఇప్పుడైనా! ఏం?"

"ముసలితొత్తుకొడకా!" రాయి విసిరికొట్టింది. విరుచుకుతినేలాగు పైకెగసింది.

"కోపమెందుకే" అని తలుపు బంధించుకుని పరదా పూర్తిగా లాగి "నా ఇంటి కొచ్చేవు! పరువు దక్కదు!" అన్నాడు.

పెద్దపిల్లకు దూరదూరాలవరకూ తనచుట్టూ శ్మశానమేనా అనిపించింది. ప్రాణంసందడిలేని ఇళ్లన్నీ చీకటిశిలకప్పిన గోరీలాగున్నవి.

ఆకలితో చెవులలో నక్కలు, పులులు అరుస్తున్నవి. చలికి బిగుసుకునే వొళ్లు విరుచుకుంటూ నడిచింది. మాలా బట్టలు తడుముకుని సంతోషిస్తూ "దాని వొళ్లు అత్తరువాసన లేదు." అనుకున్నాడు. శవాలకంపు ఇల్లు-మరామతుచేయించాలి!" "మేరే మాలాబులాలో"తో పదాలు ప్రారంభించాడు. దొడ్డిగోడ కూలినట్లు దభీమని శబ్దం వినిపించింది.

---




# ఫిట్జిరాల్డు సంకోచము

= శ్రీ వసంతరావు వెంకటరావు =

ఈశతాబ్దారంభంలో వైజ్ఞానిక భావపరివర్తనం ముమ్మరంగా కలిగింది. జగత్తులో సత్యమైనది ద్రవ్యమే అనిన్నీ, ద్రవ్యగుణములే సత్యతకు ప్రధాన లక్షణములనిన్నీ భావింపబడుచున్న సమయంలో ద్రవ్యంలో ద్రవ్యత్వమే లేదన్న విప్లవభావాన్ని నీల్సు భోరు రుథర్‌ఫర్డులు ప్రతిపాదించేరు. సంతతధారావాహికంగా ప్రసరించుచున్నట్లు గోచరించు శక్తి సూక్ష్మాతిసూక్ష్మ కణపరంపరగా వ్యక్తమౌచున్నదని మాక్సు ప్లాంకు సిద్ధాంతీకరించేడు. కాలంగురించి, ఆకాశం (Space) గురించి నాటివరకు ప్రచారంలో నున్న అభిప్రాయాలు సరియైనవి కావని ఐన్‌స్టయిను మింకోస్కీలు ప్రకటించేరు. ఖగోళశాస్త్రజ్ఞులు అకాశకుహరాల నన్వేషించి విశ్వంయొక్క వ్యాప్తికి అంతుందా అన్న సందేహాన్ని కలిగించేరు. కాని, పైయభిప్రాయాలలో విజ్ఞానలోకమందు అత్యధికసంచలనం కలిగించినది ద్రవ్యనిర్మాణ సంబంధమైన భావము. ఏమంటే, కఠినద్రవ్యమంతా శూన్యాకాశంలో తేలియాడు సూక్ష్మకణ సమూహాలుగా తెలియవచ్చింది. దృఢమైన పరమాణువు ఆకాశపూరితమని బయల్పడింది. ఖగోళశాస్త్రం కనుగొన్న దురూహ్యమగు అంతర్నక్షత్రాంతరాళాల కన్న పరమాణువులో గల అంతరాళాలే అధికాశ్చర్యకరమైనాయి.

నిర్మాణంలో పరమాణువు సౌరమండలమంత శూన్యాకాశ ప్రధానంగా ఉంది. మానవుని శరీరంలో నున్న అణువులందలి ఎలక్ట్రాను ప్రోటాను న్యూట్రానులను ఖాళీలేకుండా దట్టంగా కుదించగలిగినట్లైతే మానవశరీరమంతా సూక్ష్మదర్శిని (Microscope) లో కాని గోచరింపని సూక్ష్మకణంగా కృశించిపోతుంది. కాని, ద్రవ్యంలో ఇంతింత అంతరాళాలుంటాయని పరమాణుసిద్ధాంతం సూచించలేదు. అంతేకాక, వాయువులో అణువులు దూరదూరంగా ఉంటాయని, ఘనపదార్థంలో అణువులు క్రిక్కిరిసినట్లు దట్టించబడి ఉంటాయని అనుకొనడంచేత ద్రవ్యనిర్మాణ విషయమై పెంపొందింపబడుచున్న భావములు ప్రాచీనపరమాణువాదంతో ఏకీభవించేయి. ౧౯-వ శతాబ్దాంతంలో విద్యుత్పరంగా ప్రతిపాదింపబడిన వాదంకూడ ద్రవ్యంయొక్క ద్రవ్యత్వానికి భంగం కలిగించలేదు. ఏమంటే, ఋణవిద్యుత్తు సూక్ష్మపరిమాణంగల ఆవేశాలలో నున్నట్లును, ధనవిద్యుత్తు పరమాణువంత పరిమాణంగల మెత్తని ద్రవ్యంగానున్నట్లును భావింపబడ్డాయి. ధనవిద్యుత్తులో సూక్ష్మమైన ఋణవిద్యుత్ఖండాలు వాసమేర్పరుచుకొన్నట్లు తలచుటచే ఘనపదార్థంలోనున్న స్థలం చాలవరకు ఆక్రమితమైనట్లే కనిపించింది.

కాని, ధనవిద్యుత్తుకూడ సూక్ష్మకణాలుగా కేంద్రీకరింపబడినట్లు ౧౯౧౧ లో రుథర్‌ఫర్డు చూపించేడు. కొన్ని ప్రయోగాలవల్ల ధనవిద్యుత్తును కేంద్రీకృత విద్యుదావేశం (Electric charge) గా చిత్రిం

చుకొనక తప్పిందికాదు. ధనవిద్యుదావేశం ఒక కేం
ద్రకం (Nucleus) లో నిబిడీకృతమైనట్లును, ఆ కేంద్ర
కం పరమాణువుకన్న ఎన్నో రెట్లు చిన్నదైనట్లును
భావిస్తేగాని, పరమాణువులో వ్యక్తమౌతున్న అత్య
ధిక విద్యుద్బలాలను సమర్థించుట కావకాశం లేకపో
యింది. కాగా, ఘనంగా అంగీకరింపబడిన పరమా
ణువు శూన్యమైపోయింది. తరువాత, శూన్యాకాశ
ప్రధానమైన పరమాణు చిత్రాన్నే తీసికొని నీల్సుభోరు
పరమాణు సిద్ధాంతం పురస్కరించేడు. పరమాణు
నిర్మాణ విషయమై మునుముందెట్టి మార్పులు కలిగి
నప్పటికి, పరమాణువులు కఠినగోళాలన్న యభిప్రా
యానికి తావున్నట్లు కనిపించదు.

విద్యుత్తుయొక్క మూలరూపాలైన ఎలక్ట్రాను
ప్రోటాను న్యూట్రానులతో యావద్ద్రవ్యము ఏర్పడి
నట్లుగా నేటి అభిప్రాయము. అందులో ఎలక్ట్రాను
ప్రోటానులు సమానవిద్యుదావేశంగల ఋణధనవిద్యు
త్ఖండాలు. న్యూట్రానునకు విద్యుదావేశం లేదు.
ఎలక్ట్రానుకన్న ప్రోటాను సుమారు ౧౮౫౦ రెట్లు
బరువుంది. న్యూట్రాను భారంకూడ సుమారంతే. అగుట,
ద్రవ్యంలోని ద్రవ్యరాశి (mass) కి దాని రచకము
లైన ప్రోటాను న్యూట్రానులే కారణము. ఉదజని
పరమాణువులో ప్రోటాను వివిక్తంగా కనిపిస్తుంది.
దానిచుట్టు ఒక ఎలక్ట్రాను పరిభ్రమిస్తూంది. ఇతర
మూల తత్త్వాల పరమాణువులలో కొన్ని న్యూట్రాను
లతో చేరిన ప్రోటానులు కేంద్రకంకాగా, దానిచుట్టు
గ్రహసన్నిభంగా ఎలక్ట్రానులు తిరుగుచున్నాయి; ఈ
ఎలక్ట్రానులసంఖ్య కేంద్రకంలోని ప్రోటానులసంఖ్యకు
సమానము. పరివర్తియ ఎలక్ట్రానులలో కొన్ని పర
మాణువును విడిచిపెట్టి ఆ పదార్థంలో యథేచ్ఛగా
సంచరించగలవు. పరమాణువుయొక్క వ్యాసం సుమా
రుగా ఒక సెంటిమీటరులో సహస్రలక్షాంశము. అట్టి
పరమాణు వ్యాసంమీద ౫౦౦౦౦ ఎలక్ట్రానులను
క్రమంగా పేర్చవచ్చును. కేంద్రకంయొక్క వ్యాసం
అంతకన్న స్వల్పము. దానికన్న సూక్ష్మమైనది ప్రో
టానుయొక్క వ్యాసం. వీటినుండి గమనింపదగ్గవిష
యాలు రెండున్నాయి: పరమాణువు విద్యుదావేశా
లతో నిర్మింపబడిందని, అది చాలవరకు శూన్యమని.

అయినప్పటికి ఈ పరమాణుభావం ప్రధాన
వైజ్ఞానికవిప్లవంగా పరిగణింపబడలేదు. ఏమంటే,
ఆ భావం సనాతన పదార్థవిజ్ఞానాభిప్రాయాలతో అను
గుణంగానే ఉంది. అనగా, నాటివరకు ప్రబలంగా
నున్న అభిప్రాయాలతో పరమాణు నిర్మాణాన్ని
వివరింపవచ్చును. నిజవిప్లవాన్ని తెచ్చిపెట్టినవి సాపేక్ష
సిద్ధాంతము, క్వాంటంసిద్ధాంతము అని గుర్తించాలి.
అవి జగత్సంబంధమై క్రొత్తగా కనుగొబడ్డ విషయాలు
మాత్రమే కావు; జగచ్చిత్రాన్ని అవగాహనచేసికొనుట
కుపయోగించు యోచనవిధానంలోనే మార్పులు కలి
గించేయి. సనాతనంగా సంక్రమిస్తూన్న భావాలతో
ఆ రెండుసిద్ధాంతాలను విశదీకరించడానికి అవకాశం
లేదు. సనాతనభావాలంటే సుమారు న్యూటన్ కాలం
నుండి పెంపొందుచూవచ్చినవి. సాపేక్షసిద్ధాంత
భావాలు వాటి కతీతమైనవి. నాటినుండి కొన్నిశాఖ
లలో మహత్తరమైన మార్పులు కలిగేయి. కాంతితరంగ
సిద్ధాంతం కణసిద్ధాంతాన్ని త్రోసిపుచ్చింది. ఒక పదా
ర్థంగా భావింపబడుతూన్న వేడిమి ద్రవ్యాణుచలనం
యొక్క శక్తిగా గుర్తింపబడింది. విద్యుత్తు సంతత
ద్రవంగా గాక సూక్ష్మకణ నిర్మితమని అంగీకరింప
బడింది. అయినప్పటికి తరంగాలు, గతిజశక్తి మొద
లైనవి సనాతనపదార్థవిజ్ఞానంలో గల అభిప్రాయా
లాటచేత ఆమార్పులలో వైపరీత్యం కనిపించలేదు.
అయితే, సనాతనభావం ఎట్లు భంగపడిందో విచార
ణీయము.

అతివేగంగా గమిస్తూన్న ఒకదండం గలదను
కొందము. దాని గమనదిశకు లంబం (Perpendicu-
lar)గా నున్న దండాన్ని ఒక సమకోణం త్రిప్పి
గమనదిశకు సమాంతరంగా ఉంచడమయిందనుకొం
దము. అప్పుడాదండం సంకోచిస్తుంది; అనగా, గమన
దిశకు లంబంగా ఉన్నప్పుడుకన్న సమాంతరంగా
ఉన్నప్పుడది పొట్టి అవుతుంది. ఈ సంకోచాన్నే "ఫిట్జ
రాల్డు సంకోచము" (Fitzgerald contraction) అంటా
రు. సామాన్యపరిస్థితులలో అది గుర్తింపబడజాలనంత
స్వల్పంగా ఉంటుంది. ఆ సంకోచం దండంయొక్క
పదార్థంపై ఆధారపడినది కాదు; అది కేవలం దండం

యొక్క చలనవేగంతోనే సంబంధించినది. ఉదాహరణంగా: సూర్యునిచుట్టు కక్ష్యలో సెకనుకు ౧౯ మైళ్ల వేగంతో భూమి పరిభ్రమిస్తూంది. ఆ వేగానికి సంకోచ మెంతవగా ౨౦౦,౦౦౦,౦౦౦ లో ఒక వంతు. కాగా, భూమియొక్క పరిభ్రమణంవల్ల, దానివ్యాసం ౨½ అంగుళాలు తగ్గుతుంది. ఈవిషయం అనేక ప్రయోగాలవల్ల ఋజువయింది.

కాని, చలనంలో నున్న ఒక దండం వేరువేరు దిక్ముఖంగా నున్నప్పుడు దాని పరిమాణం మారడమనేది ఆశ్చర్య కరమైన విషయంగా కనిపిస్తుంది. దాని పరిమాణం నిశ్చితంగా నుండవలసినట్లు తోస్తుంది. కాని, ఏ దండం విషయమై చర్చిస్తున్నామో నిశ్చయించుకోవాలి. ఏమంటే, రెండు దండా లున్నాయి: ఒకటి సామాన్యదండము, రెండవది వైజ్ఞానిక దండము. దృఢంగా ఉండి, ఆకాశంలో వ్యాప్తికలిగి, స్పర్శకు కఠినంగాతోచు దండం గురించి యోచిస్తూఉంటే దాని పరిమాణం మారడానికి తగిన కారణం కనిపించదు. కాని, దూరస్థంగా ఉండి, నిత్యం మహావేగంగా పరుగిడుతూన్న సూక్ష్మ విద్యుత్కణ సమూహమే వైజ్ఞానిక దండము. అట్టి సమూహం ఒక నియతాకారం వహించియుండడమే విచిత్రమైన సంగతి. అయితే, ఈ కణాలు నిత్యము ఒక సరాసరి దూరాన ఉండుట చేత దాని ఘనపరిమాణమంతా నియతంగా ఉంటుంది. ఈకణాలు అన్యోన్యంగా విద్యుద్బలాకృష్టమైయున్నాయి. ఆకర్షణబలాలు వాటిని దగ్గరగా లాగుచుండగా వాటిని దూరస్థం చేయ ప్రయత్నించు బలాలు మరి కొన్ని వున్నాయి. ఇట్టి విషమబలాలకు లోనై, ఒక సమత్వస్థితిలో ఉన్నప్పు డాకణాలు ఆక్రమించు స్థలమే వాటి ఘనపరిమాణము. అట్టి దండాన్ని చలనంలో పెట్టినప్పుడు విద్యుద్బలాలు మారుతాయి. చలనంలో నున్న విద్యుత్తే విద్యుత్ప్రవాహము (**Electric Current**). విద్యుత్ప్రవాహం నూతనబలాలను కలిగిస్తుంది. అవి అయస్కాంత (**magnetic**) బలాలు. ఒక విద్యుద్వాహకంలోనుండి విద్యుత్తు ప్రవహిస్తూన్నప్పుడు ఆవాహకం చుట్టు అయస్కాంత క్షేత్రం ఏర్పడుతుంది. ఇట్లు చలనవిద్యుత్తువలన కలిగిన బలాలు ఒక్కొక్క దిశలో ఒక్కొక్క పరిమాణం కలిగి ఉంటాయి.

అందుచేత విద్యుత్కణసమూహమైన దండాన్ని చలనంలో పెట్టగానే ఆకణాలమధ్య అయస్కాంత బలాలు జనిస్తాయి. తన్మూలంగా వాటి స్థావర స్థితి మారుతుంది. తిరిగి స్థావరత కుదిరేవరకు ఆ కణాలమధ్య నున్న సరాసరిదూరం మారుతుంది. కాగా, ఈ కణసమూహంయొక్క వ్యాప్తి లేక దండంయొక్క పొడవు మారుతుంది. జాగ్రత్తగా విమర్శిస్తే ఫిట్జిరాల్డు సంకోచం విచిత్ర మైనది కాదు. ద్రవ్య స్వభావంచే స్థలమాక్రమిస్తూ, దృఢంగా ఉన్నట్లు భావింపబడిన సామాన్య దండం సంకోచించడం అసహజంగా కనిపిస్తుంది గాని, విద్యుదయస్కాంత బలాలచే సుకుమారంగా బంధింపబడి, అవి ఆక్రమించిన ప్రదేశంలోనికి ఇతర వస్తువులను జొరబడనీయకుండా ప్రతిఘటిస్తూన్న కణసమూహం అన్యబలాయత్తమైనప్పుడు సంకోచమొందడమే సహజము. ఒక దండం గమిస్తూన్నంతమాత్రాన అది అన్యబల ప్రచోదితమూటకు కారణం కనిపించదు. కాని, చలనమందున్న దండంలో దాని విద్యున్నిర్మాణ కారణంగా క్రొత్త అయస్కాంతబలాలు జనిస్తున్నాయి. తన్మూలంగా సంకోచం సంభవిస్తుంది. అతిదృఢమైన దండమైతే ఒకప్పుడు సంకోచాన్ని నిరోధించగలదేమో అని సందేహం కలగవచ్చును. కాని దండంయొక్క దార్ఢ్యంతో సంకోచానికి సంబంధం లేదు. ఆ దండం ఉక్కుదైనా, కర్రదైనా, గాజుదైనా, రబ్బరుదైనా అది ఒకేవిధంగా కృశిస్తుంది. దండం నిశ్చిత పరిమాణాన్ని వహించకపోవడం దాని అసమగ్రతచేత నన్న భావాన్ని మనం మార్చుకోవాలి. యథార్థంగాచూస్తే, సాంద్రత, జడత్వము మొదలైన ప్రధానలక్షణాలవలె ఈసంకోచంకూడా ద్రవ్యంయొక్క సహజలక్షణమే.

ఫిట్జిరాల్డు సంకోచము సనాతన విజ్ఞానాభిప్రాయాలనుగూర్చి కొంతకలవరం కలిగించింది. కొలతలు లేనిదే విజ్ఞానంలో సామాన్యంగా ఒక్క ప్రయోగంకూడ సాగదు. ఏవస్తువునైనా కొలవడానికి విజ్ఞాని తన కొలబద్దను కావలసిన దిశలోఉంచుతాడు. కొలబద్దయొక్క దిశను

మార్చినప్పుడు దాని పరిమాణం విధిగా మారుతుందని భావించదు. కాని, భూమి స్థావరంగా ఉంటే తప్ప భూమితోపాటు గమిస్తూన్న కొలబద్ద మార్పు చెందక తప్పదు. కొలబద్దయొక్క పరిమాణస్థిరత్వంమీదనే పదార్థవిజ్ఞానసౌధం నిర్మింపబడింది. ఇప్పు డాస్థిరత్వానికే ముప్పుకలిగింది. అయినప్పటికి, సులభంగా గుర్తింపబడనంత సూక్ష్మపరిమాణం గల మార్పులు విజ్ఞానికి నష్టదాయకం కాజాలదని భావింపకూడదు. ఏమంటే ఫిట్జిరాల్డు సంకోచంయొక్క ఫలితా లెంతవిచిత్రంగా ఉంటాయో విమర్శిస్తే బోధపడుతుంది.

ఊహాతీతమైన విషయమే కావచ్చునుగాని, ఈ బృహద్విశ్వంలో సెకనుకు ౧౬౧౦౦౦ మైళ్ల వేగంతో గమిస్తూన్న గ్రహమున్నదనుకొనడం దోషయుతం కాదు. ఆ వేగానికి సంకోచం సగమని గమనించియున్నాము. ఏవస్తువైనా గమనదిశకు లంబంగా ఉన్నప్పుడు కన్న సమాంతరంగా ఉన్నప్పుడు సగానికిసగం కృశిస్తుంది. మధ్యాహ్న మప్పుడు రెండు పట్టణాల మధ్యనున్న దూరం ౮౦ మైళ్లయితే సాయంకాలం ౬ గంటలకు ఆగ్రహం ఒకసమకోణం తిరగడంచేత ఆదూరం ౪౦ మైళ్లే ఉంటుంది. ఆలోకజీవులు కూడ ఉదయంకన్న మధ్యాహ్నంసరికి రెండింతలై సాయంకాలానికి యథాప్రకారంగా కృశిస్తూ ఉంటారు.

కాని, అంత విపరీత వేగంతో గమిస్తూన్న గ్రహం జగత్తులో ఉన్నట్లు తెలియదు. కాని అతిదూరస్థంగాఉన్న సర్పిలనెబ్యులా(**Spiral Nebula**) ఒకటి సెకనుకు ౧౦౦౦౦ మైళ్ల వేగంతో గమిస్తూంది. ఆనెబ్యులాలో ఒకగ్రహముండవచ్చును. ఆగ్రహంలో మేధావంతులైన జీవులుండవచ్చును. సెకనుకు ౧౦౦౦౦ మైళ్ల వేగానికి వాటిల్లు సంకోచం సామాన్య జీవితంలో గుర్తింపబడునంత ఎక్కువగా ఉండదు. కాని సూక్ష్మయంత్రాలతో చేసిన ప్రయోగాలలో ఇది సులభంగా గుర్తింపబడుతుంది. ఆ గ్రహంలోని విజ్ఞానులు మనవలె ప్రయోగాలలో ముఖ్యంగా కొలబద్దతో పొడవులు కొలుస్తారు. ఆ క్రియలో కొలబద్దను ఏవిధంగా అవసరమైతే ఆవిధంగా పట్టుకొంటారు. బహుకాలం శ్రమించి ప్రయోగాలుచేసి తత్ఫలితాల నాధారంగాచేసికొని వివరించిన నియమాలు, నిర్మించిన సిద్ధాంతాలు వారు తొలుత గమనింపని ఈస్వల్ప సంకోచంమూలంగా దోషయుతములైనట్లు తెలిసికొన్నప్పుడు వారెంత విహ్వలచిత్తులౌతారో ఊహించుకొనవచ్చును. అంత వరకు వారుచేసిన ప్రయోగాలలో ఎప్పుడెప్పుడు కొలబద్ద నేవిధంగా పెట్టేరో గుర్తించుకొని, ఏకొలతప్పుడు కలిగిన సంకోచంతో ఆకొలతను సవరించుకొంటూ, అప్పటికి ప్రతిపాదితములయిన భౌతికనియమాలను విసర్జించి నూతన నియమావళిని నిర్మించడమంటే ఎంత దుష్కరకార్యమో, ఎంత వ్యర్థప్రయాసమో చెప్ప నక్కరలేదు. ఈవిషయం గ్రహించిన భూలోకవిజ్ఞానులు దౌడుతీస్తూన్న గెలాక్సీలో కాక మందంగా గమించు భూలోకంలో పుట్టినందుకు కృతజ్ఞులైయుంటారు; వారికీ ఫిట్జిరాల్డు సంకోచంయొక్క బాధలేదు.

కాని, మందంగాగమించు గ్రహంమీదనే మనమున్నామా? ఆ దూరస్థ నెబ్యులిక విజ్ఞానులు ఒక సామాన్యగ్రహావృతమైన సామాన్యనక్షత్రాన్ని ఒకదానిని చూస్తారు. భూమి అనే ఆ గ్రహం ౧౦౦౦౦ మైళ్ల వేగంతో పరుగిడుతూన్నట్లు వారు భావిస్తారు. ఏమంటే, మన కా నెబ్యులా ౧౦౦౦౦ మైళ్ల వేగంతో పరుగిడుతూన్నట్లు కనిపించినప్పుడు వారికి మనభూమి ౧౦౦౦౦ మైళ్ల వేగంతో పరుగిడుతూన్నట్లు కనిపిస్తుంది. అప్పుడు, వారినిగూర్చి మనమనుకొన్నట్లే మనవిషయమై వారనుకొంటారు. భూలోకవిజ్ఞానులు దురదృష్టవంతులని, భూమిగమిస్తూన్న వేగానికి ఫిట్జిరాల్డుసంకోచము ఎక్కువగానే ఉండుటచేత మనకొలతలు తప్పని, ఆ తప్పుకొలతలపై నిర్మించిన సిద్ధాంతాలు సరియైనవికావని, ప్రకృతివిషయమై మనం సంగ్రహించిన జ్ఞానము అసమగ్రమని గ్రహించి వారు మనకు సానుభూతి చూపుతారు.

అయితే, నిజంగా ఎవరికెవరు సానుభూతి చూపవలసియుంటుందో నిర్ణయించలేము. ఈరెండు గ్రహాలలో సెకనుకు ౧౦౦౦౦ మైళ్ల వేగంతో భూమి గమిస్తూందో, ఆనెబ్యులాలో గ్రహమే యాత్ర

చేస్తాందో తెలియదు. విశ్వజనీనదృష్టిలో మనభూమిని పొందిన గెలాక్సీకి ఎట్టిప్రాధాన్యంలేదు. కాబట్టి, మన భూమే సుమారు స్థావరంగాఉందని భావించడం అహం భావంకన్న వేరొండుకాదు. కాని, నిజంగా మన భూమే ౧౦౦౦౦ మైళ్ల వేగంతో గమిస్తాంటే తన్మూలంగా కలిగిన సంకోచంవల్ల కొలతలలో దోషంరాదా అని, ఆ దోషాన్ని మనం ప్రాయోగికంగా కనిపెట్టగలమని, అట్టిది సంభవించలేదుకనక భూమి మందంగానే గమిస్తూన్నదని సహేతుకంగా నిర్ణయింపగలిగినట్లు కనిపిస్తుంది. మనమే మహావేగంగా గమిస్తూండి, గమన కారణంచే మనకొలతలు మారినప్పటికి మన ఉపకరణాలేవియు ఆవిషయాన్ని కనుగొనలేవు.

ఒకదేవోత్సవంలో పాల్గొనడానికి మనమందరము ఒకదేవాలయంలో సమావేశమైనా మనుకొందము. హఠాత్తుగా ఆదేవాలయం ఊర్ధ్వముఖంగా ౧౬౧౦౦౦ మైళ్ల వేగంతో పరుగిడ మొదలుపెట్టిందనుకొందము. ఆవిషయాన్ని అంగీకరించనివారు కాదని ఋజువుచేయవలసిన బాధ్యతవహించాలి. సాష్టాంగపడిన నేను లేచి నిలుచుండగానే సగంపొట్టిఅయిపోయేను. ౧౮ అంగుళాలున్న నామూర ౯ అంగుళాలయింది. నామూరను కొలిచిచూస్తే ౧౮ అంగుళాలుంటుంది. ఏమంటే, పడుకొన్నప్పుడు గజంబద్దలో ౧౮ అంగుళాలాక్రమించింది. నిలువుగామన్న గజంబద్దలో అంగుళాలు అరంగుళాలుగా కృశించేయి. కాబట్టి, పొట్టయిన నామూర పొట్టయిన గజంబద్దలో ౧౮ అంగుళాలు ఆక్రమిస్తుంది. అంటే ౧౮ అరంగుళాలన్నమాట. అయితే, మూరపొట్టయినట్లు కంటికి కనుపించదుకదా మనదృష్టినే మనం నమ్మలేమా అన్న ప్రశ్న వస్తుంది. కాని, కంటికి దోషం తగిలిందని గుర్తించాలి. పడుకొన్నప్పుడుకన్న నిలుచున్నప్పుడు నా నాడీతెర (**Retina**) నిలువుగా సగానికితగ్గింది. అందుచేత కన్ను మార్పును గుర్తించలేదు. లేచినిలబడకుండా క్రిందపరుండే ఏటవాలుగా పెట్టిన అద్దాలలో నా మూరనుచూస్తే కన్నుదోషయుతంగాదు కాబట్టి మూర కృశించడం కనిపించవచ్చునేమో అని ఆశింపవచ్చును. అదైనా లాభంలేదు. అప్పుడాదోషం అద్దాన్ని ఆశ్రయిస్తుంది. ప్రతిప్రయోగ ఫలిత మిట్లే పరిణమిస్తుంది. ఏ విధంగా ఆదోషాన్ని కనిపెట్టనెంచినప్పటికి అది నిష్ఫలమౌతుంది. అయితే, నిజంగా సంకోచమున్నదని ఋజువేమిటి అని ప్రశ్నింపవచ్చును. భూగమనంవల్ల వైద్యుతీయంగాను, కాంతిపరంగాను సంభవించవలసిన మార్పులు కనిపెట్టడానికి ప్రయోగాలుచేసేరు. అవి అతిసూక్ష్మమైన ప్రయోగాలు. కాని, ఎట్టిమార్పులు కనిపించలేదు. కాబట్టి మన మూహించిన మార్పు వ్యక్తంకాకుండా దానిని సరిగ్గా సవరించే మరొక మార్పు వాటిల్లినదని నిర్ణయించేరు. అదే ఫిట్జిరాల్డు సంకోచము. ఏప్రయోగంలోను సంకోచ పరిమాణాన్ని కొలవలేదు. అదే సందర్భంలోను కొలవబడదు. అట్లది కొలవబడక పోవడమే సంకోచంయొక్క ఉనికికి తార్కాణము.

దీనినిబట్టి ఒక్కవిషయం స్పష్టమౌతుంది. భూలోకవిజ్ఞానులకు నెబ్యులిక విజ్ఞానులకు గల వివాదను నిర్ణయించడాని కవకాశంలేదు. ౧౦౦౦౦ మైళ్ల వేగంతో భూమి గమిస్తూన్నదని నెబ్యులిక విజ్ఞానులు, నెబ్యులాయే ౧౦౦౦౦ మైళ్ల వేగంతో గమిస్తూన్నదని భూలోకవిజ్ఞానులు భావిస్తూన్నట్లు గమనించేము. ఎవరిమట్టుకువారు ప్రయోగాలు చేసి చూస్తారు; ఎవరిమట్టుకువారే మందంగా గమిస్తూన్నట్లు నిశ్చయిస్తారు. అందులో ఎవరివాదం సత్యమో తెలియదు. వారి తగువు ప్రయోగం తీర్చలేదు. ఏమంటే, ఎవరు ప్రయోగం చేసినా అందులో రెండుదోషాలుంటాయి; అవి ఒకదాని నొకటిసవరించుకొంటాయి. ప్రయోగఫలితం శూన్యము.

భూలోకవిజ్ఞానులు, నెబ్యులికవిజ్ఞానులు, విశ్వాన్ని శోధించి పరిసర వస్తువుల స్థానాలను నిర్ణయిస్తున్నారనుకొందము. మనభూమి అధిక వేగంతో గమిస్తూన్నదనికూడ అనుకొందము. అప్పుడు భూలోకంలోని కొలబద్దలు భూమిగమిస్తూన్న దిశలో సంకోచిస్తాయి. కాబట్టి ఆదిక్కున కొలిచిన దూరాలు ఎక్కువగా నున్నట్టు భూలోకవిజ్ఞానులు గణిస్తారు. భూలోకపు కొలబద్ద భూవేగంచేత ౧౦ లో ౧ సంకోచించినదనుకొంటే ౯ కోట్ల మైళ్లదూరాన్ని ౧౦ కోట్ల మైళ్లుగా కొలుస్తారు. కొలతకు ద్రవ్యనిర్మితమైన కొలబద్దగాని,

కాంతికిరణంగాని మరెట్టిదానిని ఉపయోగించినా ౯ కోట్లను ౧౦ కోట్ల మైళ్లని నిర్ణయిస్తారు. ఆవిధంగానే ఒక చతురస్రాన్ని (Square) నిర్మించదలచిన భూలోకవిజ్ఞానులు ఒక దీర్ఘచతురస్రాన్ని నిర్మిస్తారు. ఆవిషయం వారెరుగరు; ఎరుగలేరు. వారు మహామేధావులైతే ఒక్క అవకాశాన్ని అంగీకరిస్తారు. వారికి చతురస్రంగా కనిపిస్తున్నది పరలోకవాసుల కెవరికైనా దీర్ఘచతురస్రంగా కనిపించవచ్చునని, వారి దృష్టిలో చతురస్ర మెంత సత్యమో పరలోకవాసుల దృష్టిలో దీర్ఘచతురస్రాకారము అంతే సత్యమని వారూహింపవచ్చును. అనగా భూవిజ్ఞానుల కేర్పడిన ఆకాశభావం వారి ఆకాశభావానికి భిన్నమయింది. రెండులోకాలవారు ఒకే విశ్వాన్ని చూస్తున్నారు; కాని, ఒక్కొక్కరొక్కొక్క ఆకాశంలో దాని స్థాననిర్ణయం చేస్తున్నారు. సెకెనుకు ౧౦౦౦ మైళ్ల వేగం ఎవరిదన్న వివాద విషమించి, ఒక ఆకాశాన్ని ఇద్దరు విజ్ఞానులు కలిసి ఉపయోగించుకొనలేని దురవస్థను కలిగించింది.

ఇది విచిత్రమైన విషయమే! కాని, ఆకాశము, కాలము అన్నవి రెండుమూడు భావాలు కలిగించే పదాలని గుర్తించుకోవాలి. ఆకాశాన్ని శూన్యంగా భావిస్తాము; లేక ఇన్ని గజాలనో, ఎకరాలనో, ఘంచాలనో వివరిస్తాము. కాల మొక జీవనదీప్రవాహము; లేక అదొకసంజ్ఞ. పదార్థవిజ్ఞాని కిట్టి అసమగ్రభావాల ప్రయోజనంలేదు. కాని, వానికా భావాలున్నాయి; వాటిని యథోచితంగా ఉపయోగించలేడు. ఆకాశమనగానే మనస్సునకు గజాలో ఎకరాలో స్ఫురిస్తాయి. ఆస్ఫురణవల్లనే భూలోకవిజ్ఞానియొక్క ఆకాశం నెబ్యులిక విజ్ఞానియొక్క ఆకాశంతో సరిపోవడంలేదు. ఏమంటే, భూలోకంలోని గజంబద్దకు, నెబ్యులాలోని గజంబద్దకు భేదముంది. అనుట, వివిధలోకాలవారికి వివిధ ఆకాశపు చట్రాలు (Frames of Spaces) ఉన్నాయనుకొనడం సమంజసమేమో! ఏలోకంవారు వారి కనువైన ఆకాశపు చట్రంలో వస్తుస్థానాలను గుర్తిస్తారు. ఆకాశపు చట్రమనేది కృత్రిమంగా కనిపించవచ్చును. ఆకాశాన్ని చూడగానే ఎవరి ఆకాశపు చట్రం వారి హృదయాలకు వ్యక్తమౌతుంది. మనం చతురస్రమనుకొని గీసినచిత్రం పరలోకవాసికి దీర్ఘచతురస్రంగా కనిపించినదంటే, మనకన్న వానికి వేరువిధంగా ఆకాశం వ్యక్తమై యుండాలి.

ఒక ప్రేక్షకునియొక్క ఆకాశపుచట్రం వాని వేగంమీద ఆధారపడి ఉంటుంది. ఒకే వేగంతో గమిస్తున్న వివిధ గ్రహాలలోనున్న జీవులు జగత్తులోని వస్తువుల స్థానాలవిషయమై ఏకభావం వహిస్తారు. వారందరికి జగత్తు ఒకే విధంగా వ్యక్తమౌతుంది. వివిధ వేగాలతో గమించు గ్రహాలలోనున్న జీవులు మాత్రమట్లంగీకరించరు. అయితే ఎవరి ఆకాశపు చట్రాన్ని ప్రమాణంగా ఎంచుకొనడం? సాత్విక ప్రవృత్తిగల ఒక లోకవిజ్ఞాని తనలోకమే యావద్విశ్వానికి ప్రధానమైనదను అహంకారానికి లోనుగాక, నిశ్చలంగానున్న మరొక లోకాన్ని ప్రమాణంగా తీసికొనడానికి సంసిద్ధుడయే డనుకొందము. తన పరిశీలనలు తన ఆకాశపు చట్రానికి సంబంధించినవి. తనలోకంయొక్క గమనంచేత కొలబద్దలు సంకోచించేయి. కాబట్టి, తన పరిశీలనను దిద్దుకొంటే అవి ప్రమాణలోకం యొక్క ఆకాశపు చట్రానికి సరిపోతాయి. అప్పుడు వాటి నాధారంగా చేసుకొని జగద్విషయమైన నియమాలను, సిద్ధాంతాలను ప్రతిపాదింపవచ్చును. కాని, స్థావరంగా నున్న లోకమేదో కనుగొనుమార్గంలేదు. ఎప్పుడైతే తన ఆకాశపు చట్రమే ప్రమాణమన్న భావాన్ని త్యజిస్తాడో అప్పుడే 'ఏది ప్రమాణమైన ఆకాశపుచట్రం?' అన్నప్రశ్న బయలిడుతుంది. ఆప్రశ్నకు సమాధానం లేదు; మన మెరిగినంతవరకు సరియైన సమాధానం వచ్చే యోగ్యతకూడ లేదు.

మన ముపయోగిస్తున్న స్థాననిర్ణయచట్రంలో దోషంలేదు. అది దోషయుతమైతే నిర్దిష్టమైన చట్రాన్ని ఎంచుకొందుము. సుమారు లోకాని కొకటిచొప్పున బహుళంగానున్న ఆకాశపు చట్రాలలో దేని నెంచుకొంటే నిర్దిష్టమైన ఫలితాలు సిద్ధిస్తాయో ఎరుగము. అన్నిచట్రాలూ సంతృప్తికరంగానే ఉన్నాయి.

కాని, సామాన్యమానవునికి ఆకాశవిషయమై సందేహం కలుగదు. వాని నావరించియున్న స్థలం వానికి స్పష్టంగా కనిపిస్తుంది. ఆస్థలంలో అనేక వస్తువులున్నాయి. ఒకటిక్కడ, మరొకటి అక్కడ, ఇంకొకటి మరొకదగ్గర. కొలబద్దల సంకోచంగురించి ఆర్భాటం చేసినంతమాత్రాన వాని నిశ్చితభావాలకు పరివర్తనం కలుగదు. దానికి ముఖ్యకారణమేమంటే, ఆకాశంలో వస్తువులయొక్క స్థానంగురించి కొన్ని అభిప్రాయాలు మనకు పారంపర్యంగా సంక్రమిస్తూ వచ్చేయి. అవి మన భావవిధానంలో వ్రేళ్లు తన్నడంచేత వాటిని నిష్పాక్షికబుద్ధితో విమర్శించి, ఎంతవరకవి సత్యమో నిర్ణయించడానికి సావకాశం కలగడంలేదు. అంతేకాదు; మనల నావరించియున్న వస్తుసముదాయంలో ప్రతివస్తువు ఒక నియతస్థానంలో ఉందని, దాని స్థానంగురించి మనకు పూర్ణజ్ఞానం కలదని మన నమ్మకము. ఒకస్థలమందున్న వస్తువులలో ఏదెక్కడుందో మన మెరిగినప్పుడు అవి ఆయాస్థానాలలోనే ఉన్నాయి; దానికి సందేహంలేదు. పరలోకవిజ్ఞాని వాటిని యంత్రసహాయంతో చూచి, అవి వేరొకవిధంగా ఉన్నాయంటే మన మెంతమాత్రము విశ్వసించము. కాని, ఆవస్తువుల స్థానాలనుగురించి మనకెట్లు జ్ఞానం కలిగిందన్న ప్రశ్నకు సమాధానం యోచించలేదు. వాటి స్థానాలనుగురించి సుకుమారయంత్రాలతో ప్రయోగాలుచేసి కనుగొన్నప్పుడు ఆయంత్రాలలో దోషముందేమో అని సందేహింపవచ్చును. కాని, ఆవస్తుస్థానంగురించి మనకు అయాచితంగా, స్వతస్సిద్ధంగా జ్ఞానం కలిగినప్పుడు పరలోకవిజ్ఞానియొక్క పరిశీలనలను ఆమోదించలేము. మన మనస్సు అదృశ్యకరాలనుచాపి వస్తువులస్థానం గుర్తిస్తున్నదని మన అభిప్రాయము. కాని, పంచేంద్రియాలద్వారా మనకాజ్ఞానం కలుగుతూంది. ఒక కుర్చీ రెండడుగులదూరంలో ఉందని, ఒకమంచం మూడుగజాల దూరంలో ఉందని మానసికంగా మనం అంచనావేసినప్పుడు చలనం, స్పర్శ మొదలైనవాటివల్ల వస్తుస్థానజ్ఞానం కలుగుతూందనుట నిర్వివాదము. ఈవిధానానికి, ప్రాయోగికంగా కొలబద్దచే కొలిచే విధానానికి భేదంలేదని స్పష్టమే. వస్తుస్థానాలనుగురించి మనకు సాధారణంగా కలిగిన జ్ఞానంఅత్యద్భుతా విష్కారణంగాదు; ప్రయోగపరిశీలనలపై చేసిన ఊహానంవలె ఇదికూడ ఇంద్రియపరిశీలనలపై చేసిన ఊహనము. కాబట్టి స్వతస్సిద్ధంగా మనకు కలిగినట్లు భావిస్తున్నజ్ఞానం వైజ్ఞానికంగా ప్రయోగాలవల్ల సంపాదించిన జ్ఞానంవంటిదే; అది మన లోకంయొక్క ఆకాశపు చట్రానికి సంబంధించినది.

ఆకాశశోధనకు కంటికి బదులుగా దూరదర్శినిని ఫోటోగ్రాఫిక్ ప్లేటును వాడినమాత్రాన కన్న కన్న సూక్ష్మమైన ఉపకరణాల నుపయోగిస్తున్నామనేగాని శోధనావిధానంలో మార్పులేదు. పారంపర్యంగా ఆకాశవిషయమై మనకు సంక్రమిస్తున్న భావాలను ప్రతిపాదించిన ఆదిమవిజ్ఞానులకు తెలియని కొన్ని నూతనలక్షణాలను ఈసూక్ష్మపరిశోధనమే వ్యక్తమొనర్చింది. విజ్ఞాని అట్టేవేగంగా గమించనంతవరకు వానియొక్క వస్తుస్థాన నిర్ణయ విధానం చక్కగా పనిచేస్తుంది. కాని, ఆవిజ్ఞాని వేగంగా గమించినప్పుడు వేగంయొక్కమార్పుచేత వేరొక ఆకాశపుచట్రంలోనికి తీసికొనిపోబడతాడు. ఇట్టి చట్రా లనేకముండుటచేత ఒకవస్తువు ఒకేచోటున ఉన్నట్లు ప్రతిచట్రం సూచిస్తుందని చెప్పలేము. కాబట్టి వస్తుస్థాననిర్ణయం మనస్సునకు ఆధ్యాత్మికంగా ఆవిష్కృతమైనట్లు భావించలేము; అది దృష్టికిగాని, యితర సూక్ష్మోపకరణాలకుగాని తెలిసిన వస్తువుల పరస్పర సంబంధాలను సంప్రదాయంగా వివరించు విధానమని తెలియవస్తుంది. అయినచో, ఆకాశంలో ఒకవస్తువుయొక్క యథార్థస్థాననిర్ణయమన్నది అర్థవిహీనమని స్పష్టమే! ప్రాచీనపదార్థవిజ్ఞానంలో వస్తుస్థానానికున్న ప్రాధాన్యం నేడులేదు.

ఇట్లు, ఫిట్జిరాల్డు సంకోచంచేత మనకొలబద్దల సత్యానికి భంగంకలిగింది. దానితో మన పరిశీలనలన్నీ దోషయుతములని తెలిసింది; ఆకాశం గురించి నూతనభావం కలిగింది; ప్రాచీనపదార్థ విజ్ఞానం జగద్విషయమై సమగ్రసత్యాన్ని విశదమొనరింప లేదని స్పష్టమయింది.

## ఆంధ్ర గ్రంథమాల, పోస్టుబాక్సు 212, మద్రాసు.

**ప**ండితారాధ్య చరిత్ర: శైవమత ప్రతిపాదకమగు ద్విపద కావ్యము. పాల్కురికి సోమనాథ కవి రచితము. డా. చిలుకూరి నారాయణరావుగారు సంస్కరించిరి. దీక్షా, పురాతన, వాద, మహిమ, పర్వతములను పంచ ప్రకరణములును ఒకే సంపుటమున గలవు. ఇంత నిర్దుష్టముగ ఈ గ్రంథము నిదివర కెవ్వరును ప్రకటించ లేదు. నారాయణరావుగారు రచించిన అమూల్యమైన పెద్ద పీఠిక కూడ కలదు.

రూ. 5-0-0

**అ**ళియరామభూపాలుడు: టి. శివశంకరముగారు రచించినది. విజయనగరపురాజగు అళియరామరాయల సమగ్రజీవితచరిత్ర. త్రివర్ణ, ద్వివర్ణ, ఏకవర్ణ చిత్రములతో సర్వాంగసుందరముగా ప్రకటితమైన చరిత్రగ్రంథము.

వెల 1-0-0.

**తం**జాపురాంధ్రనాయకరాజచరిత్ర: కురుగంటి సీతారామయ్య గారు రచించినది. తంజావూరును పరిపాలించిన ఆంధ్ర నాయకరాజుల చరిత్రోదంతములు యుక్తియుక్తములైన ఆధారములతో సవిస్తరముగా వివరింపబడియున్నవి. అనేక చిత్రపటములు గలవు.

వెల 1-0-0.

**జీ**ర్ణవిజయనగర చరిత్ర: కుందూరు ఈశ్వరదత్తుగారు రచించినది. కృష్ణదేవరాయల రాజధానియైన హంపీవిజయనగరముయొక్క ప్రాచీన వైభవమును కన్నులకు కట్టినట్లు వివరించుచున్న చారిత్రక గ్రంథము. అనేకచిత్రములతో సంకలితమైనది.

వెల 1-0-0

# పంచాంగ సంస్కరణము

= శ్రీ విస్సా అప్పారావు =

మన దేశమందలి పంచాంగకర్తలలో సుమారు ౪౦ ఏండ్లనుంచి వివాదములుండుట, పెద్దసభలు జరుగుట, అధ్యక్షులు తీర్మానములిచ్చుట, తీర్మానములమలుజరుగకుండుట, తిరిగితిరిగి ఆవిషయములే సభలలో చర్చించుచుండుట పరిపాటిగా ఉన్నదని మనకందరకు తెలిసిన విషయమే.

ఈ వివాదలయొక్క స్వరూపస్వభావము లేమనగా, ముఖ్యముగా మూడని చెప్పవచ్చును. (౧) పంచాంగములో వ్రాసిన కాలమునకు ముందో వెనకో గ్రహణములు పట్టుట; (౨) అధికమాసము శ్రావణమా ఆషాఢమా, లేక చైత్రమా వైశాఖమా యని తర్కించుట; (౩) నక్షత్రములలోను, రాసులలోను నవగ్రహములు ప్రవేశించు కాలములు వ్యత్యాసముగా వ్రాయుట. తిథులు, వర్జ్యకాలములు భేదముగా వ్రాయుట.

గోదావరి, కృష్ణ మొదలగు నదీపుష్కరసమయములను భేదముగా వ్రాయుటచేత కలిగే ఇబ్బంది లందరకు బాగుగా తెలిసిన విషయమే.

ఇట్టి భేదములకు, వివాదములకు మూలకారణములు రెండు విషయములను పురస్కరించుకొనియున్నవి. అవి పరిష్కారమైనచో ఈ భేదము లంతరించగలవు. అవి ఏమనగా—(౧) దృక్సిద్ధపద్ధతి గ్రాహ్యమవునా కాదా? దృక్సిద్ధము శాస్త్రీయమేనా? (౨) అయనాంశ లెన్ని అనునవి. సిద్ధాంతులందరును నిష్పక్షపాతబుద్ధితో సత్యాన్వేషణయే పరమార్థ మనుకొని, సంప్రతించుకొని తీర్మానములను ఐకమత్యముతో పాటించినచో పంచాంగసంస్కరణసమస్య సంపూర్తి కాగలదు.

(౧) దృక్సిద్ధము:— పంచాంగములో వ్రాసిన కాలములకు సరిగా ఆకాశమందు దృశ్యములు గోచరించుట దృక్సిద్ధ మనబడును. ఇది గ్రహణాదులయందు సిద్ధించుట లేదు. ఈ విషయమునకు కారణములు, సరిచేయతగిన విషయములు, మార్పులు ఎట్టివని అనేకసార్లు అనేకచోట్ల చర్చింపబడినవి. ౧౯౫౦ ప్రాంతములనాడే శ్రీ శ్రీ శ్రీ కాంచీ కామకోటిపీఠస్వాములవారు విద్వాంసులను, సిద్ధాంతులను రప్పించి దృక్సిద్ధమే గ్రాహ్య మని నిశ్చయించినారు. లోకమాన్య బాలగంగాధరతిలక్ మహాశయుడు మహారాష్ట్రమున సభలు గావించి దృక్సిద్ధమే గ్రాహ్య మని తీర్మానించినారు. మైసూరులో పదేండ్లక్రిందట జరిగిన జ్యోతిషమహాసభలోకూడ అట్లే తీర్మానమైనది. ఇక, మన జిల్లాలలో — రాజమహేంద్రవరమున ప్లవసంవత్సరములోను, రౌద్రసంవత్సరములోను, విశాఖపట్టణములో సాధారణ, క్రోధనసంవత్సరములలోను, బెజవాడలోను సభలు జరిగినవి. అన్నింటియందును దృక్సిద్ధపద్ధతే అనుసరణీయ మని తీర్మానములైనవి. ఈ విషయము ఇంకను చర్చించుట అనవసరము. క్రొత్తసంగతు లేమియును లేవు. ఈపద్ధతియే ఆచరించతగ్గది యని గ్రహించికూడా పంచాంగకర్తలు కొందరు వెనుకంజవేయుచున్నారు. మరికొందరు దృక్సిద్ధము పనికిరాదు, అశాస్త్రీయము, ప్రమాదకరమని కూడ యభిప్రాయములు వెల్లడించి గణితములను వేరుగా వ్రాయుచున్నారు. తారణ ఉగాదిసంచికలోని సుదర్శనపంచాంగపీఠికలో ఏమని వ్రాసియున్నదో చూడండి.* ఈ భేదము లంతరించి, ఎంతత్వరలో

---

*సూర్యగ్రహణము ఆషాఢ బ ౩౦ ఉదయమున స్పర్శ గం.౮-౩ మోక్షకాలము గం.౧౧-౧౫ ఈకాలములు సూర్యసిద్ధాంతానీతములు. పాశ్చాత్య పద్ధతిచే స్పర్శ గం.౮-౩౦. మోక్షం గం.౧-౦. పుష్య పూర్ణిమనాడు శ్రీ సూర్యసిద్ధాంతరీతిచే గ్రహణము లేదు. పాశ్చాత్యపద్ధతిని స్పర్శ గం.౮-౦ లకు. మోక్షం

దృక్పద్ధతి అనుసరణీయమైతే అంతే మంచిది; శ్రేయస్కరమున్నూ.

(౨) అయనాంశలు :—రవ్యాదిగ్రహములు ఆకాశమున క్రాంతివృత్తము (Ecliptic) అనేమార్గములో గుండ్రముగా తిరుగుచుండును. ఈ వృత్తము కంటితో గుర్తించగల అశ్వన్యాది ౨౭ నక్షత్రముల యాధారమునుబట్టి నిర్ణీతమగుచున్నది. ఈవృత్తము ౨౭ నక్షత్రభాగములక్రింద ౧౨ రాసులక్రింద విభజింపబడినది. ఈక్రాంతివృత్తమునకు ఏకాలమున ఎక్కడనుండి ప్రారంభము? ప్రారంభస్థానము నాటినుండి నేటికెంత చలించినది? ఆచలనముయొక్క కొలత, ప్రమాణము డిగ్రీలలో, భాగలలో ఎంత? అనగా అయనాంశలెన్ని? అనునది వివాదాంశము.

భూమిని ఉత్తరార్ధముగాను, దక్షిణార్ధముగాను విభజించువృత్తమును విషువద్వృత్తమని, విషువద్రేఖయని (Equator) అందురు. ఈరేఖకు, క్రాంతివృత్తమునకు మధ్య గల కోణము ౨౩½ డిగ్రీలు. ఈ రెండు వృత్తములును రెండుచోట్ల కలిసియుండును. అనగా క్రాంతివృత్తములో తిరుగుచు సంవత్సరమునకు రెండుసార్లు సూర్యుడు విషువద్వృత్తముమీదికి వచ్చును. ఈరెండు స్థానములను సంపాతము లందురు. (ఒక వృత్తముమీద ఒకటిపడిన చోట్లుగనుక) ఈ సంపాతములలో సూర్యుడున్నప్పుడు రాత్రింబగళ్లు సమముగానుండును. ఇట్టి సమరాత్రిందివములను కాలములనే విషువత్తులు (Equinoxes) అని అందురు. అవి సంవత్సరమునకు రెండుసార్లు వసంతవిషువత్తని, శరద్విషువత్తని సంభవించుచుండును. ఒక వసంతవిషువత్తునుండి తరువాతి వసంతవిషువత్తువరకు గల కాలమునకు విషువద్వత్సర మని పేరు. ఈసంపాతస్థానములు క్రాంతివృత్తములో ఒకచోటనే యెల్లప్పుడు ఉండవు. ఒక సంవత్సరమున అశ్వనీనక్షత్రప్రారంభమున వసంతసంపాత మైనచో రెండవ సంవత్సరమున అశ్వనిప్రథమపాదములోనికి సూర్యుడు రాకుండగనే, రేవతి చివరభాగమున ఉండగనే, అశ్వనీప్రారంభము ఇంకను ౫౦¼ సెకన్ల దూర ముండగనే విషువత్తు వచ్చును. అందుచేత యీసంపాతస్థానము సంవత్సరమునకు ౫౦¼ సెకన్లు క్రాంతివృత్తములో వెనుకకు- అశ్వనినుండి రేవతివైపుకు-సంచలించునని చెప్పుదుము. దీనినే అయనగతి (Precession of the equinoxes) యని అందుము. ఈగతి ప్రకారము సంవత్సరమునకు ౨౦ నిమిషములవంతున ౭౨ యేండ్లకు ఒకరోజుచొప్పున, అనగా రమారమి ఒకడిగ్రీ చొప్పున సంపాతము వెనుకకు పోవును. ఒకరోజుముందే విషువత్తు సంభవించును. ఇట్లు అశ్వన్యాదినక్షత్రములలో ౭౨ యేండ్లకు ఒక భాగ(డిగ్రీ) చొప్పున అయనాంశలు గలుగుచుండును. "తురగముఖాశ్వనీ త్రీణి" అని చెప్పబడు అశ్వనినక్షత్రము ఆకాశమునందు స్థిరముగా ఉండును. అట్లే ౨౭ నక్షత్రములును, ౧౨ రాసులును స్థిరములు. క్రాంతివృత్తమునందు చలింపవు. అందుచేత సూర్యుడు రాసులలో ప్రవేశించు సంక్రమణకాలములు, నక్షత్రములలో ప్రవేశించు కాలములగు కార్తులు స్థిరములు. ఇవి యానములేనివి గాన నిరయనములు అని చెప్పబడుచుండును. రాత్రి, పవలు సమంగా ఉండే రెండు విషువత్పుణ్యకాలములు, మిక్కిలి తక్కువ అహస్సుగల దినమున సంభవించు ఉత్తరాయణపుణ్యకాలము, మిక్కిలి యెక్కువ అహస్సుగల నాడు వచ్చు దక్షిణాయనపుణ్యకాలమున్నూ-ఈనాలుగును చలించు స్వభావము గలవి; అయనసంబంధములు. అందుచేత సాయనములని చెప్పబడుచున్నవి. కనుక పంచాంగగణితమందు నిరయనమని, సాయనమని రెండుపద్ధతులు గలవు. ముహూర్తభాగము, జాతకభాగము, ఉత్సవములు, పండుగలు మొదలైన వన్నీ నిరయనపద్ధతినే నిర్దేశింపబడుచున్నవి. అందుచేత పంచాంగవిషయములలో పాశ్చాత్యులవలె మనముకూడ కేవలము సాయన

---

౧౦. ౯-౪౨ లకు. పాశ్చాత్యరీతి భారతీయులకు గ్రాహ్యము కాదు" మరియు వైదికపద్ధతి ఒకేప్రమాణబద్ధ మని, పాశ్చాత్యపద్ధతియగు దృక్పద్ధతి ఒక ప్రమాణము లేక ప్రతిక్షణమందు ప్రతివానిచేత మార్పునొందునని, లోకాంతరములో ఆముష్మికసంబంధము లేనిదని, అందుచేత గ్రాహ్యము కాదనికూడ వ్రాయబడినది. ఇందలి సత్యాసత్యములు వేరే విమర్శించనక్కరలేదని నమ్ముచున్నాను.

పద్ధతి నవలంబింప వీలులేకున్నది. మతము, సంప్రదాయము, ఆచారము, తిథులు, తీర్థములు, ముహూర్తములు, జాతకములు వీటిని పాటింప అవసరము లేకున్న యెడల, లేక వీటినిగూడ సాయనపద్ధతికి మార్చుకొనగలిగినయెడల కేవలము సాయనము ననుసరించవచ్చును. కాని అది దుర్ఘటము.

అయనాంశలెన్ని అనునదికదా ముఖ్యమైన విషయము. అయనాంశలు శూన్యముగ నున్న కాలమును నిశ్చయించినగాని దీనికి సమాధానము తేలదు. ఈ నిశ్చయము బహుక్లిష్టమైనది. ఇదమిత్థమని తేల్చుటకు వీలులేనిది. ౧౯౩౩ సంవత్సరములో హిందూ పత్రికలో యీచర్చ ౭ మాసములు జరిగినది. ఏమియును తేలలేదు. చిత్రానక్షత్రపద్ధతి యని, రేవతీపక్షమని యీ నిర్ణయమున రెండు మార్గము లున్నవి. చిత్రాపక్షవాదులే హిందూదేశమందు హెచ్చుగా నున్నారని, ఆవాదనే బలీయమైనదని చెప్పవలెను. యీచిత్రాపక్షమునకూడా అనేకసిద్ధాంతవాక్యముల నాధారము చేసికొని లెక్కకట్టగా వివిధములగు అయనాంశలు తేలుచున్నవి. మన ప్రాంతములలో ముఖ్యమైన సిద్ధాంతులు కొందరు ౨౨°౬' అయనాంశలని, మరికొందరు ౨౨°౫౬' అని ప్రమాణములను జూపించుచున్నారు. ప్రమాణములుగా గ్రహించు సిద్ధాంతములయందలి ఆధారవాక్యములలోని వ్యత్యాసములవలన, వాటికి చేసే వ్యాఖ్యానములవలన యీ భేదములు కలుగుచున్నవి. కనుక అందరు యేకీభవించి యేదో ఒక పద్ధతి ననుసరించి అయనాంశలు యిన్ని అని అనుకొనుటతప్ప వేరు మార్గములేదు. యీ నిర్ణయము చేయునపుడు అఖిలభారతదేశము యేకీభవించిచేయుట అత్యుత్తమము. అట్టిపని శీఘ్రకాలమున జరుగుగాక.

ఈ సందర్భములో ఒకవిషయము చెప్పవలసియున్నది. అయనాంశ నిర్ణయము నేడు పుట్టినదికాదు. ప్రాచీను లెరిగి, నిర్ణయించి, వ్యవహరించినదే. ధర్మసింధుసారములో ప్రథమపరిచ్ఛేదములో యిట్లున్నది: "అయనాంశా జ్యోతిశ్శాస్త్రే ప్రసిద్ధాః తేచ ఇదానీం ద్వాదశాధికసప్తదశ శతసంఖ్యాకే (౧౭౧౨) శాలివాహనశకే ఏకవింశతి రయనాంశాః ఇతి ఏకవింశతితమే దినే పూర్వం అయనాంశపుణ్యకాలః ఇతిపర్యవసన్నో అర్థః. ఏవం న్యూనాధికశకే ఊహ్యం" అనగా ౧౭౧౨ శాలివాహన శకమునాడు అయనాంశలు ౨౧. అందుచేత నేటి అయనాంశలు ౨౩°౪' అని తేలుచున్నది. కనుక అందరు కలిసి ఒక పద్ధతిని గ్రహించి అయనాంశలు నిర్ణయించుకొనుట అత్యవసరము.

పంచాంగములు గుణించుపద్ధతి:—దృక్సిద్ధపద్ధతి నంగీకరించి అయనాంశలు తేల్చినతరువాత పంచాంగ గణితపద్ధతి యెట్లుండవలెననునది ముఖ్యమైనవిషయము. ఇందు భిన్నాభిప్రాయములు కలవు. (౧) పూర్వసిద్ధాంతములను—ముఖ్యముగా సూర్యసిద్ధాంతమును—అవలంబించి, అవసరమైనచోట్ల సంస్కరించుకొని, బీజములను కల్పించుకొని దృక్సిద్ధి యగునట్లు గణితమును చేయుట. ఇది చాలా కష్టసాధ్యము. ఏలననగా సూర్యసిద్ధాంతము దురవగాహము. సోపపత్తికముగా దానిని సంస్కరించుట దుర్లభమేమో. (౨) కేట్కర్ వ్రాసిన జ్యోతిర్గణితము ననుసరించి పంచాంగము చేయుట రెండవ పద్ధతి. ఈపద్ధతిని గుణించిన పంచాంగములు మహారాష్ట్రదేశమందు, దక్షిణాదిని, మనప్రాంతములందు నేడు కలవు. అందలి గణితము నాటికల్ ఆల్మనాక్‌తో సరిపోవుచున్నది. బాగుగా దృక్సిద్ధమగుచున్నది. ఈపద్ధతి ననుసరించుట అన్నివిధములమంచిది.

నేడు పంచాంగములు గుణించువారు తరతరములనుండి వచ్చు పద్ధతుల ననుసరించి, సూక్ష్మమార్గములనుబట్టునట్టి, ఉపపత్తిలేనట్టి కరణగ్రంథముల ననుసరించుచున్నారు. ఈ పద్ధతిలో దృక్సిద్ధికై అప్పుడప్పుడు బీజములను (**Corrections**) కల్పించుకోవలెను. కాని అట్లు చేయుటలేదు. చేసినను అది సోపపత్తికములుగాక లెక్క సరిపెట్టుటకై కల్పించినవి గనుక అంత యవలంబనీయములు గావు. జ్యోతిర్గణితము సోపపత్తికము. దాని నవలంబించినచో సిద్ధాంతులకు గణితము విమర్శగా తెలియుట, ఉపపత్తులను తెలిసికొనుట, ప్రాతపద్ధతులలోని లోటుపాట్లను గుర్తించుట మొదలగు అనేకలాభము లుండును. జ్యోతిషసిద్ధాంతవిజ్ఞానము ప్రబలును. సిద్ధాంతులకు, దేశమునకు నిరుపమానమగు వికాసము సర్వతోముఖముగా వ్యాపింపగలదు.

## ౨

ఋతువుల నిర్ణయము, సంవత్సరాది:—తపస్ తపస్యమాసములు శిశిరఋతువని, మధు మాధవమాసములు వసంతమని, శుక్ర శుచిమాసములు గ్రీష్మమని, నభస్ నభస్యలు వర్షర్తువని, ఇషా ఊర్జలు శరత్తని, సహస్ సహస్యలు హేమంతమని వేదమందు ఋతువులు చెప్పబడినవి. పేర్లయొక్క వ్యుత్పత్త్యర్థమును పరిశీలించినచో కాలధర్మమునుబట్టి ఋతువులకు, ఆధర్మములందలి ఈషద్భేదముల ననుసరించి ఋతువులోని మాసములకును పేర్లుపెట్టినట్లు స్పష్టమగుచున్నది.

దక్షిణాయనకాలమందు (June 21) గ్రీష్మము హెచ్చుగా నుండుట, ఉత్తరాయణంరోజులలో (December 22) చలి హెచ్చుగా నుండుట అనుభవసిద్ధము.* అందుచేత ఋతువులు అయనసంబంధములని స్పష్టము. మనము సాధారణముగా మాఘఫాల్గుణములు శిశిరఋతువని, చైత్రవైశాఖములు వసంత మని చెప్పుచున్నాము. దీనిని విమర్శించుదాము. చిత్రానక్షత్రయుక్తపూర్ణిమగలది చైత్రమని, విశాఖనక్షత్రయుక్తపూర్ణిమగలది వైశాఖమని, ఇట్లే తక్కినమాసములకు పేర్లు కలిగినవని మన మెరుగుదుము. చిత్తనక్షత్రమును ఆకాశమందు మనము గుర్తించగలము.(spica) తులారాశికి ప్రారంభ మదే యని సిద్ధాంతములు చెప్పుచున్నవి. ఇట్లే తక్కిన నక్షత్రములును ఆకాశమందు స్థిరములు. అట్టి స్థిరనక్షత్రసంబంధముచేత ఏర్పడిన మాసములు నిరయనములు. కాని కాలధర్మమునకు సంబంధించిన ఋతువులు సాయనములు. అందుచేత సాయనములగు ఋతువులను నిరయనములగు చైత్రమాసాదులచేత పేర్కొనుచున్నాము. ఇది ఎంత అసందర్భమో చూడుడు. ఋతువులు సాయనములు గనుక నిరయనములగు చైత్రవైశాఖాదిమాసములలో వెనుకకు చలించుట స్వభావము. గనుక ఋతువులను నిరయనమాసములతో గాక సాయనమాసములతో సంబంధము చేసి చెప్పుటయే సమంజసము. అట్లు కానినాడు ఏమి జరిగినదో, ఏమి జరుగనున్నదో చూడండి.

చైత్రవైశాఖమాసములు వసంతఋతు వను పద్ధతి వేదాంగజ్యోతిష, భారతకాలములనుండి ఉన్నట్లున్నది. భారతకాలమునుండి నేటికి ౨౦ అయనాంశలనుకొందాము. అలాగైతే మాసములలో ఋతువులు ౨౦ దినములు వెనుకకు చలించియుండాలి. కాలానుసరణముగా ఋతువులు మాసములలో వెనుకకు పోవుచున్నట్లు అనేకనిదర్శనములు గలవు. అది అనుభవసిద్ధముకూడాను. లోకరీతి, లోకానుభవము ఎట్లుండునో దానినే ఇంచుమించుగా కవులు వర్ణించుట స్వభావమే కదా. "చలి ప్రవేశించు నాగులచవుతి నాడు..." అన్నాడు శ్రీనాథుడు కాశీఖండములో. నేడు కార్తీకశుద్ధచవుతి. ఇదే నాగులచవుతి. దీనినిబట్టి కార్తీకమార్గశీర్షములు హేమంత మని చెప్పవలసియుంటుంది. అనగా ఋతువులు ఒకమాసము వెనక్కు నడచా యన్నమాట.

"ఆషాఢస్య ప్రథమదివసే మేఘ మాశ్లిష్టసానుమ్" అన్నాడు కాళిదాసమహాకవి. దీనినిబట్టి ఆషాఢశ్రావణములు వర్షఋతు వనాలి. ఈలెక్కకూడా ఒక మాసము వెనుకకే పోతూంది. ఇట్లే అనేక సాధనముల వలన ఋతువుల చలనము గ్రహించవచ్చును. †కాళి

---

*భూమియొక్క ఉత్తరార్ధము దీరీతిగా నుండును. దక్షిణార్ధమందు తల్లక్రిందుగా నుండును. అనగా మనకు దక్షిణాయనమైనప్పు డక్కడ ఉత్తరాయణము, మనకు గ్రీష్మమైనచో వారికి చలిగా నుండును. రెండు భాగములయందును విషువద్వృత్తమునకు ౩౦-౪౦ డిగ్రీల దూరమువరకే ఈ ఋతువిభాగము పాటింపనగును. అంతకు ఎక్కువగా ఉత్తరమునగాని, దక్షిణమునగాని వెళ్లినచో ౬ ఋతువులు క్రమముగా ౪, ౩, ౨ క్రింద సంకుచితమైపోవును.

† ౧. "ఆషాఢశుద్ధపంచమ్యాం వచ్చెనే వృద్ధగౌతమి" ౨. "మహాలక్ష్మి పండుగలకు మాడంత చలి." (౧) దీనివలన పైన సూచించిన భావమే కలుగుచున్నది. (౨) మహాలక్ష్మిపండుగ లంటే దేవీనవరాత్రిపండుగలు. ఇవి నాగులచవుతికంటే ౧౫-౨౦ దినముల పూర్వమే వచ్చును. గాన ఈసామ్యమువలన నేటి స్థితి తేటతెల్లమగుచున్నది.

దాసుకాలము నాటికి ౩౦ దినములు - ఒకమాసము- ఋతువులు వెనక్కిపోతే, ఇప్పటికి కాళిదాసుకాలము సుమారు ౧౫౦౦ సంవత్సరముల క్రిందటిది గనుక, సుమారు ఇంకొక ౨౦ దినములైనా ఋతువులు వెనక్కు వెళ్లి యుంటాయి. అనగా మొత్తముమీద ౫౦ దినములు వెనక్కున్నమాట. ఇది సరిగానే ఉంది. భారతకాలము నుండి నేటికి అయనాంశలు ౫౦ అనిగదా లెక్క. అందుచేత ఆనాటి శిశిరము మాఘఫాల్గుణములలో ఐతే ఈనాడు శిశిరము మార్గశిరపుష్యములలో అవుతూంది. వసంతఋతువు మాఘఫాల్గుణాల్లో అవుతూంది. కాని ఈఋతుచలనమును గ్రహించకపోవుట చేత మాసరూఢిచేత వసంతమైన ఋతువును శిశిరమనే కాకుండా ఇంకా కొంతకాల మగుసరికి వసంతమై యుండగా దానిని హేమంత మనికూడ పిలుస్తాము. ఇది ఎంత హాస్యాస్పదమో చూచారా? అందుచేత సంస్కార మత్యావశ్యకము.

ఈసందర్భములో ఋతువుల నిర్ణయించుట యందు, సంవత్సరాదిని నిర్ణయించుటయందు ప్రాచీనుల సంప్రదాయ మెట్టిదో తెలుపుటకై కొన్ని వివరములను వ్రాయుచున్నాను.

ఋతువులు చాంద్రమాసములతో గాక కార్తులతో నిర్వచనము చేయు ఆచారముకలదు.

"ధనిష్ఠాద్యాత్ పౌష్ణార్ధాంతం చరతే శ్శిశిరః
వసంతః పౌష్ణార్ధాత్ రోహిణ్యంతం
సౌమ్యా దాశ్లేషార్ధాంతం గ్రీష్మః
ప్రావృ డాశ్లేషార్ధాత్ హస్తాంతం
చిత్రాద్యాత్ జ్యేష్ఠార్ధం శరత్
హేమంతో జ్యేష్ఠార్ధాత్ వైష్ణవాంతిమ్."
(పరాశరసంహిత ౧)

ధనిష్ఠప్రథమపాదముతో శిశిరము ప్రారంభమని, అక్కడనుంచి రత్తి కార్తుల చొప్పున ఋతువులు క్రమముగా లెక్కించవలెనని దీని యర్థము.

మరియు,

"మాఘాద్యుపక్రమ స్తతో ఒయనారంభాత్"(౨)
మాఘశుక్ల ప్రపన్న స్య పౌషకృష్ణసమాపినః
యుగస్యపంచవర్ష స్య కాలజ్ఞానం ప్రచక్షతే"(౩)

ఈ (౨), (౩) వాక్యములవలన మాఘమాసారంభమున ఉత్తరాయణప్రవేశమని, సంవత్సరారంభమని కూడ తెలియుచున్నది. పరాశరవాక్యమునుబట్టి ధనిష్ఠాదిశిశిరాది యని తేలుచున్నది. వీటి పరస్పరసంబంధమును చూడుడు.

మాఘశుద్ధపాడ్యమినాడు ధనిష్ఠనక్షత్రమని, అందులో సూర్యచంద్రులు కలసియున్నారని అనుకొందాము. పాడ్యమినుండి ౧౫ రోజు పూర్ణిమ; ధనిష్ఠనుండి ౧౫ నక్షత్రం మఘ. అందుచేత ఆపూర్ణిమ మాఘపూర్ణిమ. అందుచేత మాఘాదియే ధనిష్ఠాది. అదియే యుగాది. అదే శిశిరారంభము; ఉత్తరాయణ ప్రవేశకాలముకూడాను. ఇట్లు మూడువాక్యములవలన అర్థము సమన్వయమగుచున్నది. ఇట్టికాల మేది యని విమర్శించగా వేదాంగజ్యోతిషకాలమని తేలుచున్నది. ఎట్లనగా—

పరాశరవాక్యమునుబట్టి ఆశ్లేషార్ధమందు సూర్యుడుండగా గ్రీష్మ మంతమగుచున్నదని స్పష్టము. అది ఉత్తరాయణమునుండి మూడు ఋతువులు - ౬ మాసములు-గతించిన కాలముగదా. గనుక ఆశ్లేషార్ధమందు దక్షిణాయన మని స్పష్టము. వరాహమిహిరాచార్యుడు పూర్వశాస్త్రమగు వేదాంగజ్యోతిషమందు దక్షిణాయనము ఆశ్లేషార్ధమం దగుచుండెడిది యని చెప్పియున్నాడు.*తన కాలమందు రెండు విషువత్తులు, రెండు అయనములు ఎప్పుడు తటస్థించుచున్నవో ప్రత్యక్షపరీక్ష చేసి చెప్పియున్నాడు. ఈవెనుక పట్టికలో ఈ కాలభేదములు చూపబడినవి.

(I) వ కాలమునుండి (II) వ కాలమునకు అయనము ఏడు నక్షత్రపాదములు చలించినట్లు పై పట్టిక తెలుపుచున్నది. రెండు కార్తులు-౯ నక్షత్రపాదములు-సూర్యుడు నడచుటకు ౨౭ దినములు పట్టును. గనుక ౭ పాదములకు సుమారు ౨౫ దినములు పట్టును. అందుచేత ఈ రెండుకాలములకు సుమారు ౨౫ × ౭౨ =౧౮౦౦ సంవత్సరముల అంతర మున్నది.

---

* "ఆశ్లేషార్ధా ద్దాసీ ద్యదా నివృత్తిః కిలోష్ణకిరణస్య, యుక్త మయనం తదాసీత్ సాంప్రత మయనం పునర్వసుతః."

౧ పట్టిక

| అయనములు విషువత్తులు | ప్రవేశకాలము | |
|---|---|---|
| | వేదాంగ జ్యోతిషకాలమందు I | వరాహమిహిరుని కాలమందు II |
| (౧) ఉత్తరాయణము | సూర్యుడు ధనిష్ఠ ప్రథమములో ప్రవేశించు చుండగా | ఉత్తరాషాఢా ద్వితీయములో (మకరాదిని) |
| (౨) వసంత విషువత్తు | ,, భరణి చతుర్థములో ... | అశ్వనీ ప్రథమములో (మేషాదిలో) |
| (౩) దక్షిణాయనము | ,, ఆశ్లేషాద్వితీయములో ... | పునర్వసు చతుర్థములో (కర్కటకాదిలో) |
| (౪) శరద్విషువత్తు | ,, విశాఖా ప్రథమములో ... | చిత్తా ద్వితీయములో (తులాదిలో) |

వేదాంగజ్యోతిష కాలమునకు ప్రాచీనమగు బ్రాహ్మణముల కాలములో వసంతవిషువత్తు భరణి ౪ న కాక కృత్తికయందు సంభవించుచుండవలెను. "ముఖం వా ఏత న్నక్షత్రాణాం యత్కృత్తికా" అని తైత్తిరీయ బ్రాహ్మణవాక్యము. నక్షత్ర ఇష్టి చేయునప్పుడు ప్రారంభము కృత్తికతో ఉంటుంది. నక్షత్రములకు కృత్తిక ముఖమని చెప్పబడియున్నది. దీనినిబట్టి ఏనక్షత్రములో వసంతవిషువత్తు సంభవించునో అది నక్షత్రములకు ముఖముగా ఎన్నబడేదన్నమాట. ఆ నక్షత్రముతో నక్షత్రములను లెక్కపెట్టేవా రన్నమాట. జాతకభాగమందు జననకాల మహాదశ కట్టునప్పుడు కూడ 'కృత్తికాది క్రమేణ' దశలు లెక్కపెట్టమని చెప్పబడియున్నది. అందుచేతనే వరాహమిహిరాచార్యుడు తన కాలమందు వసంతఋతువు అశ్వినిలో సంభవించుటచేత పూర్వసంప్రదాయానుసరణముగా అశ్విన్యాదిగా నక్షత్రములను లెక్కపెట్టినాడు. నేడు వసంత విషువత్తు ఉత్తరాభాద్ర ౨ పాదమున ఉన్నది గనుక ఉత్తరాభాద్రతో ఆరంభించి నక్షత్రములు నేడు లెక్కపెట్టవలెను.

వరాహమిహిరాచార్యుడు అశ్వినితో నక్షత్ర ప్రారంభము చేయుటయేగాక ఆ అశ్వినిలో ఉండే వసంతవిషువత్తుతో సంవత్సరముకూడ ప్రారంభించినాడు. అనగా పూర్వాచారమగు ఉత్తరాయణముతో గాక తరువాత మూడు మాసములకు వచ్చు విషువత్తుతో ఉగాది చేసినాడు. ఈనూతనపద్ధతిని వేదాంగ జ్యోతిషకాలమందు వత్సరాది చేసి యుండినచో మాఘముతో మూడు మాసములు గతించగా వైశాఖముతో సంవత్సర మారంభమైయుండేది. అనగా వసంత మధ్యమున ప్రారంభమయి యుండేది. వరాహమిహిరుని కాలమునకు ౨౫ అయనాంశలు, అనగా రమారమి ఒక మాసముగాన వసంతమధ్యము వైశాఖప్రారంభమున నుండక వెనుకకు ఒక మాసము చలించి చైత్ర ప్రారంభమున ఉండినది. అందుచేత వరాహమిహిరుడు చైత్రముతో ఉగాది చేసి సంస్కరించినాడు. ఆటుతరువాత నేటికి ౨౩ అయనాంశలైనను సంస్కరించక మనమున్నా చైత్రముతోనే ఉగాది లెక్కపెట్టుచున్నాము. ఇది సంస్కరణీయమగు విషయము.

పైన చెప్పిన రెండు పద్ధతులకు భిన్నముగా ఉగాది రామాయణకాలమందు వైశాఖమాసముతో-వసంతఋతు ప్రారంభముతో చేయబడినట్లు కనబడుచున్నది. ఈ విషయమును పరిశీలించగా రామాయణ కాలమందు చైత్రవైశాఖమాసములు వసంతఋతువు అను వ్యవహారము రాలేదని స్పష్టమగుచున్నది.

బాలకాండ ౧౮ సర్గలో ఇట్లున్నది:

"తతో యజ్ఞే సమాప్తేతు
ఋతూనాం షట్ సమత్యయుః" (౧)

"తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ.
నక్షత్రే దితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునాసహ
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతమ్ (౨)

చైత్రము ౧౨-వ మాసమని యనుటచేత వైశాఖముతో సంవత్సరారంభ మనుట నిశ్చయము. వ్యాఖ్యానములో నీరీతిని వ్రాయబడినది: "అశ్వమేధమునకు పూర్వము మీమాంసానుసారము, కల్పసూత్రానుసారము అశ్వగమనక్రమ మెట్లనగా. అశ్వమును విడిచినతరువాత ౧౧ మాసములు చనగా అశ్వమును తెచ్చికట్టెదరు. ఫాల్గుణామావాస్యయందు ఋత్విజులతో శాలయందు యజమానుడు ప్రవేశించి, చైత్రశుక్ల ప్రతిపత్తు మొదలుగా నశ్వమేధము నారంభింతురు." అందుచేత ౧౨-వ మాసమగు చైత్రములో యాగము జరుగునని, ఆ మాసాంతముతో పూర్తియగునని చెప్పవలెను. యజ్ఞ సమాప్తితోపాటు ౬ ఋతువులుకూడ సమాప్తిపొందినవని (౧) వాక్యములో నుండుటబట్టి వైశాఖ ప్రారంభమే ఋతువులకు ప్రారంభమని కూడ తేలుచున్నది. వైశాఖాది, వసంతాది, ఉగాదులనా డొకటి యని తేలుచున్నది. మరియు ఆ యజ్ఞము జరిగిన తరువాత (తతశ్చ), ఉగాదియైన తరువాత, ౧౨-వ మాసమగు చైత్రమందు శుద్ధనవమినాడు శ్రీరామచంద్రులవారు పుట్టిరనుట సమంజసమేగదా.

ఈ మూడు పద్ధతులకు భిన్నముగా నాల్గవ పద్ధతిని ఋతువులు, సంవత్సరము ప్రారంభింపబడుచుండినట్లు కనిపించుచున్నది. శాస్త్రవిషయములగు అయనములతోను, విషువత్తులతోను సంబంధము లేకుండ, జనసామాన్యులగు వ్యవసాయకులయొక్క, విజయోత్సాహులగు రాజులయొక్క సౌకర్యములనుబట్టి ఈ నూతన పద్ధతి ఏర్పాటు చేయబడినట్లు తోచుచున్నది. ఈ క్రిందివాక్యములను పరిశీలింతము.

"ఆదాయ మార్గశీర్షాచ్చ
ద్వౌద్వౌ మాసా వృతు స్స్మృతః" (౧)
"హేమంతాద్ధి వత్సర స్యారంభః" ఇతి కాత్యః (౨)
"షడమీ ఋతవః పుంసి
మార్గాదీనాం యుగ్మైః క్రమాత్ (౩)
"ద్వౌద్వౌ మార్గాదిమాసౌ స్యా దృతుః" (౪)
"మార్గశీర్షే సహోమార్గ ఆగ్రహాయణికశ్చ సః" (౫)

ఈ వాక్యములు అమరములోను, క్షీరస్వామి వ్యాఖ్యానములోను చెప్పబడియున్నవి. వీటినిబట్టి మార్గశీర్ష మాసముతో, హేమంతఋతువుతో సంవత్సరారంభ మయ్యేదని స్పష్టము. ౫-వ వాక్యమునుబట్టి సంవత్సరారంభమున నూతనధాన్యముతో హవిర్యాగము చేయుటచేత అగ్రమందు హాయనము గలది 'ఆగ్రహాయణి' యని చెప్పవలసియున్నది.* దీనినిబట్టి వత్సరాదికి పంటలు కోతకువచ్చియుండే వని, వ్యవసాయకుల కుత్సాహసమయ మని స్పష్టము.

మరియు స్ఫీతసస్యసుఖకాలమే కాకుండ, జలకాష్ఠదోహనసమృద్ధి గలిగి, నిష్పంకమగు భూమి కలిగి అల్పమక్షికమై, సమశీతోష్ణకాలమై విజయయాత్రకు సుఖదమగు శరదంతమున, హేమంతప్రారంభము నగు కాలము సంవత్సరారంభముచేయుట కెంతయు తగియున్నదని చెప్పనక్కరలేదు. ఈ విషయమే మహాభారతమందుద్యోగపర్వమున ఇట్లు చెప్పబడియున్నది:

"కాముదే మాసి రేవత్యాం శరదంతే హిమాగమే
స్ఫీతసస్యసుఖే కాలే కల్య స్సత్వవతాం వరః"
"బ్రూయాః కర్ణ ఇతో గత్వా ద్రోణం శాంతనవం కృపమ్
సౌమ్యోయం వర్తతే మాసః సుప్రాపయవసేంధనః
పక్వౌషధివనస్ఫీతః ఫలవా నల్పమక్షికః
నిష్పంకో రసవత్తోయో నాత్యుష్ణ శ్శిశిర స్సుఖః"

'కాముదేమాసి...శరదంతే' యనుటచేత మార్గశీర్ష పుష్యమాసములు హేమంతమని, ఆశ్వయుజ కార్తీకములతో శరదంతమైనదని తెలియుచున్నది. అందుచేత నేటి చైత్రవైశాఖములు వసంతము అను వ్యవహారము భారతకాలమునుండి యున్నదని స్పష్టము. కాని రామాయణకాలములో వైశాఖజ్యేష్ఠములు వసంతమనిగదా పైన చెప్పియుంటిని. రామాయణకాలమునుండి భారతకాలమునకు అయనాంశలు ౩౦ అని చెప్పవలెను. రెండు కాలముల మధ్యకాలము సుమారు ౨౦౦౦ సంవత్సరములని లెక్క తేలుచున్నది.

---

*కొత్తగడ్డితో తోరణమును గట్టి 'జ్వాలాతోరణ' మను ఉత్సవమును దేవాలయములయందు చేయు సంప్రదాయము నేడున్నది. ఇది తత్సంబంధ విషయమై యుండవచ్చును.

ఈ నాలుగు పద్ధతులలోను ఋతువులు, సంవత్సరముకూడ ఒకచోటినుండియే ప్రారంభమగుచున్నట్లు తెలియుచున్నది. అదే సంప్రదాయపద్ధతి. మరియొక సంప్రదాయ మేమనగా కాలానుగుణముగా ఋతువులను చైత్రాదిమాసములలో వెనుకకు జరిపి లెక్కించుట. ఈ క్రింది పట్టికలో ఋతువులను చాంద్రమాసములలో ఎట్లు రామాయణకాలమందు, భారతకాలమందు, వరాహమిహిరుకాలమందు లెక్కపెట్టినారో, అందుచేత మన మీనాడు ఎట్లు లెక్కించవలెనో చూపబడియున్నది. ఈరీతిని మార్చుట కర్తవ్యము.

౨ పట్టిక

| ఋతువులు | రామాయణకాలము | భారతకాలము | వరాహమిహిరుని కాలము | నేడు |
|---|---|---|---|---|
| వసంతము | వైశాఖ. జ్యేష్ఠములు | చైత్ర. వైశాఖములు | ఫాల్గుణ. చైత్రములు | మాఘ. ఫాల్గుణములు |
| గ్రీష్మము | ఆషాఢం. శ్రావణం | జ్యేష్ఠం. ఆషాఢం | వైశాఖం. జ్యేష్ఠం | చైత్రం. వైశాఖం |
| (ప్రావృట్) వర్షకాలము | భాద్రపదం. ఆశ్వయుజం | శ్రావణం. భాద్రపదం | ఆషాఢం. శ్రావణం | జ్యేష్ఠం. ఆషాఢం |
| శరత్తు | కార్తీకం. మార్గశిరం | ఆశ్వయుజం. కార్తీకం | భాద్రపదం. ఆశ్వయుజం | శ్రావణం. భాద్రపదం |
| హేమంతము | పుష్యం. మాఘం | మార్గశిరం. పుష్యం | కార్తీకం. మార్గశిరం | ఆశ్వయుజం. కార్తీకం |
| శిశిరము | ఫాల్గుణం. చైత్రం | మాఘం. ఫాల్గుణం | పుష్యం. మాఘం | మార్గశిరం. పుష్యం |
| వసంత విషువత్తు ఎప్పుడును వసంత ఋతుమధ్యముననే సంభవించును. | జ్యేష్ఠాదిని June 13 | వైశాఖాదిని May 13 | చైత్రాదిని April 13 | ఫాల్గుణాదిని March 13 † |

పైపట్టికలో చాంద్రమాసములతో ఋతువులను లెక్కించుట చూపబడినది. చాంద్రసౌరమాసములు తేడాగలవి గనుకను, ఆ తేడాను ౧౯ ఏండ్లకు ౭ అధిక మాసములను వేసి పరిపూర్తిచేయుదుముగనుకను చాంద్రమాసములు సౌరమాసములలో - ఇంగ్లీషుమాసములలోను - ఎనుదుదిసుదుగా వచ్చుచుండును.* అందుచేత సౌరమాసముల నుపయోగించుట మంచిది. ఋతువులు సాయనములుగనుక సాయనసౌరమాసముల నుపయోగించినచో ఏ తేడాలు లేకుండ ఎల్లప్పుడును ఉండును. మకరాయనము నుండి కుంభాయనమువరకు సాయనమకరమాసము. ఇట్లే ఇతరసాయనసౌరమాసములు లెక్కించుట. అందుచేత సాయనమకర కుంభమాసములు శిశిరఋతువని, సాయనమీన మేషములు వసంతమని లెక్కించిన ఏ తేడా లేక సరిపోవును. ఇట్లు చేసినచో నేడు డిసెంబరు ౨౨ నుండి ఫిబ్రవరి ౨౧వరకు శిశిరఋతువు, ఫిబ్రవరి ౨౨- ఏప్రెలు ౨౧ వసంతఋతువు అగును. ఇట్లే సంవత్సరాదినికూడ సాయనము చేయవలెను. వసంతఋతుమధ్యమగు సాయనమేషాదినాడు (నేటి మార్చి ౨౧) సంవత్సరారంభము చేయవలెను. మేషాయన మేచాంద్రమాసమున ఏతిథినాడైతే నాడే సంవత్సరాది. ఈపద్ధతిని గణించిన ఫాల్గుణబహుళ ద్వాదశినాడు సంవత్సరాదైయుండెను. రాబోవు సంవత్సరాది చైత్రశుద్ధసప్తమినాడు కాగలదు. ఇంకొకసారి ఫాల్గుణశుద్ధపౌర్ణమీప్రాంతములయందు కావచ్చును.

ఈ పైన సూచించిన విషయము లన్నింటిని విద్వాంసులు, సిద్ధాంతులు, మహాజనులు విమర్శించి, చర్చించి యుక్తమగునట్లు అచిరకాలములో పంచాంగములను సంస్కరింతురని నమ్ముచున్నాను.

---

* నేటి అయనాంశలు ౨౩ గనుక - మాసమునకు ౭ రోజులు తక్కువగనుక నిజముగా నేడు వసంత విషువత్తు మార్చి (౧౩ + ౭) ౨౦ తేదీని సంభవించవలెను. అట్లే ౨౧ మార్చిని జరుగుచున్నది.

† చిత్రభానులో చైత్రశుద్ధపాడ్యమి మార్చి ౧౭ తే ౧౯౪౨
సుభానులో ,, ,, ఏప్రెల్ ౫ తే ౧౯౪౩
తారణలో ,, ,, మార్చి ౨౫ తే ౧౯౪౪
పార్థివలో ,, ,, ,, ౧౫ తే ౧౯౪౫

చిత్రభానులో ఒక అధికమాసము వచ్చింది. పార్థివలో రానైయున్నది.

# ఆమెయెవరు?

[కథానిక]

= శ్రీ ఆరుమిల్లి విశ్వనాథరావు =

౧

నేను అపుడు సుషుప్తావస్థలో ఉన్నానేమో! ఓవైపున యుద్ధాన్ని గురించిన మూడునాలుగురకాల గొంతుకలు ఆంగ్లమిశ్రమయిన ఆంధ్రంతో వినిపిస్తున్నాయ్. వోమూలనించి చక్కటి కలకంఠివీణానాదసమానమైన కిన్నరస్వరంతో బాటు వొత్తులు దృఢంగా ఉచ్చరిస్తున్న వోమునలిగొంతు సంభాషణ మధ్యమధ్య కట్ అయిపోతూ నాకర్ణముల లీలగా ప్రవేశిస్తూంది. వోహ ప్రక్కనించి 'కిస్మత్' ఫిల్మునుగురించి యిరువుకు మిత్రులు చేస్తున్న ప్రసంగం పరిమితితప్పి నిద్రస్తున్న - కాదు; కలతనిద్రలో ఉన్న నాచెవులకు నానాబీభత్సమూ కలిగిస్తోంది. దూరాన్న యింజను అరుస్తో పరిగెడుతోంది. ప్రక్కనున్న కిటికీలోంచి గాలి హోరున ధ్వనిస్తున్నట్టు తోస్తూంది.

కాళ్లపయిన ... నాకాళ్లపైనే... యేదో బరువైన పదార్థం అనగానే చప్పున కలతకునుకు ఎచటికోపోయింది. మెళుకువవచ్చింది. బరువెక్కిన కనురెప్పలు లేవటం లేదు. వాట్లనంత బలవంతంగా లేపేందుకు ప్రయత్నమూ చెయ్యలేదు. యేమీ అంటే బద్ధకం ఎక్కువగా ఉంది. నా కాళ్లమీంది బరువూ మళ్లా వో పదిపౌనులు పెఁగినట్టు తోచింది. పై బల్లమీంది నాబెడ్డింగుగాని జారి కాళ్లమీద పడుండవచ్చనుకున్నాను. కాని అది నిశ్చయింపదగ్గదిగా తోచలేదు. యీబరువుకి ప్రాణం వున్నట్టు తోస్తోంది. అంచాతనే ఇటూ అటూ కదుల్తోంది. ప్రాణంలేని పదార్థంలో చలనం ఉండదని నాకు గట్టినమ్మకం.

ఇహ తప్పనిసరిగా కళ్లు విప్పి ఇట్టే చూస్తినిగదా! నాకే సిగ్గేసింది. మరి ఆవిడకెంత సిగ్గులేకపొయ్యిందో, ఆమెగారే నా కాళ్లపయిన కూచున్నది. పోనీ, యే పల్లెటూరి ముసిలమ్మయినా అయితే చింతే లేదు. యేదోవిధంగా, యెక్కడా నించోటానికి కూడ చోటు దొరక్క, ఇందుక విశ్రమించినదని ఊహించటానికయినా వీలుండేది. కాని యీమె అలాటిది కాదు. ఇరవైయేండ్ల వయసు, పండు తమలపాకులాటి ఛాయ గల తనువుశోభ, కెందామరలవలె నీలిఛాయల నీనే కళ్లల్లోని వాలకమూ, ఆధునిక పద్ధతులు స్ఫురించేట్టు ధరించిన ఆ పలాచటి వస్త్రాల్లోని తీరులూ ఇలాటి వన్నీ గమనించిన ఆమెను వృద్ధయని ఎట్లా అనుకోను? ఆమె అలా కూర్చున్నందుకు నేను ఇంతగా బాధపడిఉండేవాణ్ని కాదు. మీాదుమిక్కిలి ఆనందించేవాణ్ని. కాని ఇక్కడ వచ్చిన గట్టిచిక్కు ఒహాటే. పెట్లో ఇతర ప్రయాణీకులు

చాలామంది వున్నారు. వాళ్లంతా చాటుగా మాటుగా ఎదురుగా నవ్వరూ? అటువంటి తరుణి వచ్చి కాళ్లమీద కూచోటం ఎంత అదృష్టం, లక్షరూపాయ లిస్తేమాత్రం అంత మందిలో పబ్లిగ్గా కూచుంటుందా అని కొంత మంది వ్యక్తులు భావించరూ? ఎవరు నవ్వినా, ఎవ రెలా భావించినా, నాకు మాత్రం ఇది అవమానంగానే తోచింది. కారణం ఇది నలుగురూ ఉన్న రైలుపెట్టె కావటమే.

ఆమెప్రవర్తనకు నాకు ఎంతేనా వచ్చింది కోపం. నమిలిమింగేదా మన్నంత. నవ్వుతున్నట్టు తోస్తున్న ఆమొహంలో అందమూ, ప్రశాంతమూ చూస్తే మళ్లా అదంతా పోతోంది. యేది ఎలా ఉన్నా ఆమె అలా కూచోటంమాత్రం భరించలేను. భరించటానికి అవకాశాలూ లేవు. పుస్తెకట్టిన యిల్లాలుకూడ యింత స్వతంత్రాన్ని ఎన్నడూ తీసుకోలేదే, అల్లాంటప్పుడు కళ్ల పరిచయమయినా జీవితంలో లేని యీామె కెలా వచ్చిం దీధైర్యం? ఇప్పటికే ఇందుగురించి పెట్లో ఉన్న నలుగురిలోనూ ఎన్ని గుస గుసలు బయల్దేరినవో? ఎన్ని రాద్ధాంత సిద్ధాంతాలు జరుగుతున్నవో? ఎన్ని సమీక్షలు ప్రారంభమయినవో?

కళ్లు పూర్తిగా తెరవనూ తెరవకుండా, పూర్తిగామూయనూ మూయకుండా, ఆబరువును వోపికతో భరిస్తూ, ఆమె నెలా లెమ్మనేదా అని ఊహిస్తున్నాను.

"మీా ప్రవర్తన ఏమంత మర్యాదగా లేదు." అని అందామా అనుకున్నా. ఆ అనటం మనసులోనే గాని పైకి అనలేక పోయ్యాను. పెదిమలు లేవటం లేదు. ముద్దుగా ఆవిణ్ని లేపే ఉపాయం నాకు స్ఫురించలేదు. ఎంతసేపని మనిషిబరువు కాళ్లతో మొయ్యగలం? మావూ రొచ్చిన సర్కసులోని పహిల్వాన్ కూడ అయిదు నిమిషాలకంటె అదనం మొయ్యలేక పోయ్యాడు. మరి అలా వోపిగ్గా ఉండలేక పోయి, శక్తంతా ఉపయోగించి కాళ్లు గట్టిగా లాక్కున్నాను. ఆమె వొళ్లో పెట్టుకున్న చిన్న సూటుకేసుతో సహా ఆమె పరధ్యానంలో ఉండగా నాకాళ్లని లాక్కున్నానేమో— ఒక్కసారిగా ముందుకు తూలి పడింది. అలా చెయ్యాలిసొచ్చినందుకు నా మనసు కించపడింది. ఆమె దులుపుకుంటూ లేచి నిల్చుంది. నేను ఆమెవంక చూస్తూ లేచి సర్దుకుని కూచున్నాను. ఆమె అలా నిలబడే నావంక కొరకొరా చూస్తోంది. సూచనయినాయివ్వకుండా తనను అంతమందిలో క్రిందికిత్రోసి అవమానపరిచా ననేమో! మరి యింతసేపట్నించీ నేను పొందుతూ వున్న అవమానం! ఎవరితో చెప్పకునేది? ఆమె అలా నిల్చునే ఉంది. చూస్తూనేవుంది. "లేవమంటే లేచేదాన్నిగా!" అని కాబోలు ఆచూపుల్లోని భావం. లోన యిష్టం లేక పోయినా, నెమ్మదిగా పైకిలా అన్నాను: "క్షమించండి."

"ఊ...క్షమించాం." అన్నట్టు చూస్తూ నాప్రక్కను సర్దుకు కూచుంది.

తెలతెలవారుతూ ఉంది. చీకట్లింకా పోలేదు. పెట్లోకూడా అంత చెప్పుకో దగ్గ వెల్తురు లేదు. వెలవెల బోతున్న రేరాజు దూరాన్నించి రైల్తో పందెం కట్టినట్టు

పరిగెత్తుకొస్తున్నాడు. పక్కబల్లమీద కూచున్నవాళ్ల మొహాల్నంతా యీదర గాలి స్పృశిస్తోంది. ఆమె ఉన్నట్టుండి నావైపుకు తిరిగింది. ఆమెతో నేస్తం కలపాలనే సంకల్పం నాలో ఉద్భవించింది. యేవిధంగా ఆమెతో ఉబుసుబోని కబుర్లకు ఉపక్రమించాలి, ప్రస్తావన యే విధంగా మొదలుపెడితే బాగుంటుందో నని నేను తర్జనభర్జన చేసేలోగా ఆమె పెదవులెత్తి "ఎక్కడ దిగేది?" అన్నది నెమ్మదిగా, నోట్లోని పలువరుసయినా బయటికి కనబడ్డేటంత నాజూకుతో.

నేనూ అన్నాను: "ఇంకా చాలా దూరం వెళ్లాలి, ఈబండి."

"యీ బల్లంతా మీ వొక్కరి నిమిత్తం రిజర్వు చేసినట్టున్నారు!" అన్నది చిరునవ్వుతో, కనుబొమలు ఎగరవేస్తూ.

"అటువంటి దేం జరగలా." అని నే నంటిని. కొంచెం విసురుగానే, మీద కూచున్నదనే చిన్న కోపం కొద్దీ, కొంచెం ప్రత్యేకంగా చూస్తో.

"క్షమించండి, చీకట్లో కనుపించలేదు. బల్లే అనుకుంటిని. అదీకాక మరోచోట స్థలం కనుపించలేదు. అక్కడికీ వొకంట కాలం నిల్చునే ఉన్నాను. కాళ్లు లాగిన మీదట......"

తూర్పుదిక్కు ఆకాశపు టంచులు ఎర్రబడుతోన్నయ్. పెట్లోకి కొంచెం వెల్తురు బాగా వస్తోంది. వెలుగు బాగా వచ్చే కొలదీ ఆమెమొహం బాగా స్పష్టంగా కనుపించటంతో నా బుర్రలో యేదో మెదిలింది. ఇలాంటి మొహా న్నెక్కడో చూసినట్టు జ్ఞాపకం. ఎక్కడ చూసిందీ గుర్తు రావటం లేదు. మా బంధువుల్లోనే ఇలాంటి అమ్మాయ్ ఉండాలి. ఆ మొహం, ఆ కళ్లు, ఆ నవ్వు, ఆ మాటల్లోని ముద్దేసుకొచ్చే మృదుత్వం, ఆగొంతుకున్నడాను, అచ్చం, మరేం భేదం లేకుండా, ముమ్మూర్తులా, ఇలాంటి అమ్మాయిని — కాదు; ఈ అమ్మాయినే ఎక్కడచూస్తినో ఆ జ్ఞాపకమనేది రావటం లేదు. దాన్ని తగలెయ్య — నోట్లో ఆడుతోందికాని రావటంమటుకు లేదు. నిద్ర గట్టిగా రాకపోయినా కళ్లు మండుతున్న కారణాన వెనక బల్లకు జార్లాబడి రెప్పలు మూసుకుని అలా ఆమెను గురించి ఆలోచిస్తూనే. కూచున్నాను. ఒక్కసారి మా బంధువుల్లోని యావత్తు అమ్మాయిల్నందర్నీ సింహావలోకనం చేస్తూ. ఎన్ని రూపాలయినా హృదయంలోనికి వస్తూపోతూ ఉన్నాయ్. ఇలాటి రూపం లీలగా అయినా రాలేదు. ఇంతలో యేదో స్టేషను రావటం వల్ల కాబోలు బండి ఆగింది. ఆగిన మరో అయిదు నిమిషాల కాలం గడిచాక, పరధ్యానంతో అప్రయత్నంగా ఇట్టే కళ్లు తెరిచి చూస్తినిగదా, ప్రక్కన ఆమె లేదు! నలువంకలా పెట్లోనికి నాచూపులు పోయినా ఎక్కడా లేదు. ఏమయిపొయ్యిందా అని ఆలోచించాను. ఒకానొకవేళ ఇక్కడ దిగిపోయిందేమో? ఆమె దిగాల్సింది యీస్టేషనే అయ్యుంటుందా? నాకు పాలుపోలేదు. మరోరెండు మూడు నిమిషాలకి బండి కదలబొయ్యేవేళ ఆమె వచ్చి ఎక్కింది. మళ్లీ యథాస్థానంలోనే, అంటే నాప్రక్కనే, కొంచెం తగుల్తూ తగుల్తూ కూచుంది. నే నడిగాను కొంచెం ఆశ్చర్యంతోనే —

"ఎక్కడికో వెళ్లినట్టున్నారే!"

"వెళ్లానుకదూమరి! పైపువద్ద మొహం కడుక్కోవాలని వెళ్లాను."

అన్నది నిమీలిత నేత్రాల్తో.

"మీ మొహం కడిగినట్టు కనుపించదే?"

"లేందే? సమయం సరిపోలేదు."

"పదినిమిషాలు ఆగిందిగా?"

"ఆగినా, అస లక్కడ పైపు ఉన్నట్టే తోచలేదు."

"అరే! నాకు జ్ఞాపకం. అక్కడ పైపు చూసినట్టు."

"ఉందేమో. కాని పలుదోముపుల్ల దొరకందే?"

ఆమెమాటలు నవ్వొదగ్గవిగా తోచలేదు. మొత్తానికి మరోచోటికి పోయి, ఈలా మాట్లాడి ఉంటుంది. ఎలా మాటాడితే మనకెందుకు?

మేమిరువురం యిలాగ్గా మాట్లాడుకుంటూ ఉండగా వోమూల గొడవ బయల్దేరింది. ఏమా యీగలభా అని క్షణం శ్రద్ధగా ఆలకించేసరికి తేలిన విషయం— వొహాయనది తలక్రింది మూట మెవరో దొంగిలించారట. ఆ దొంగిలించిన ప్రముఖులెవరో, ఎప్పుడు దొంగిలించారో, మెక్కడ దిగిపోయారో తేలలేదు. పాపం, ఆ పోగొట్టుకున్నాయన గోలపెడుతున్నాడు. ఆయన మొహం చూస్తే నా కెంతో జాలికలిగింది. ఆమూటలో రెండు కొత్త అంగోస్త్రాలు, వొహ రాగిచెంబు, శ్రీ వెంకటేశ్వరులవారి తాలూకు ఏదో ప్రసాదం, ఇంకా వగయిరా వగయిరా ఏమేమో ఆయన లిస్టువేశాడు. కళ్లమ్మట నీళ్ల పర్యంతమూ తెచ్చుకున్నాడు.

"అయ్యో పాపం!" అంటూ సానుభూతితో విచారాన్ని వెలిబుచ్చారు కొందరు పెద్దలు. "అంత అజాగ్రత్తగా ఎందుకున్నావయ్యా స్వామీ?" అంటూ సాగదీశారు కొందరు అనుభవనీయులు. "అంత వొళ్లు మరిచి నిద్రపొయ్యేందుకు ఇది రైలన్నసంగతి మరిచారు శాస్త్రిలుగారు." అంటూ నవ్వులు ప్రారంభించారు కొందరు యువకులు. ఎవరు ఎన్ని అన్నప్పటికీ ఆయునదుఃఖాన్ని తీర్చేవా రొక్కరూ లేకపొయ్యారు పాపం. ఇదే నా విచారం. నాప్రక్కన కూర్చున్న ఆమె ఎందుకో నవ్వుతోంది. ఎందుకో నాకు స్ఫురించ లేదు. మూట పోగొట్టుకున్న ఆబ్రాహ్మడిని చూస్తే యీమెకు నవ్వుగా ఉందికాబోలు.

ఎందుకేనా మంచిదని నేను ఇట్టే లేచి ఒక్కసారి పైబల్లవంక చూస్తినిగదా, ఇంకేముంది, నాకొంపకు వచ్చింది అల్లరి! నా గుండె జారిపోయింది. చెవులు వేడెక్కేసయ్. తనువు తనవారిని విడిచిపోతున్నట్టు, రైలు తల్లక్రిందులుగా బోల్తాకొట్టినట్టు నా కాక్షణంలో అనిపించిందంటే ఆశ్చర్యపడ నవసరంలేదు. యీ నా ప్రళయానికి కారణం పైబల్లమీద పెట్టిన నా బెడ్డింగు ఉంది; కాని దాని అడుగున పెట్టుకున్న లెదర్ సూటుకేసు మాయమయ్యింది. కంపార్టుమెంటు అంతా కలయువెదికేస్తున్నయ్ నాకళ్లు. ప్రతి సూటుకేసుమీదకీ, ప్రతిట్రంకుమీదకీ నా దృష్టి కేంద్రీకరించబడింది. నాపెట్టె ఎక్కడా కనుపించదు. అసలు ఉంటేకదూ కనుపించ

టానికి? నాపెట్టెకు గొళ్లెంవద్ద పేరుకూడా ఉంది, నాపేరు. నిస్పృహతో, నిరాశతో బల్లమీద చతికిలబడ్డాను. బుర్ర పూర్తిగా చెడిపోయింది. ఆక్షణంలో నామొహం ఏయే రూపాలు దాల్చిందో నాకంటె నాప్రక్కనున్నవాళ్లు బాగా చెబుతారు. సంవత్సరం కష్టపడి చదివి, ఫలితాలు తెలిసిన రోజున పరీక్షతప్పిన స్టూడెంటుమొహంకూడ నా మొహం పోయినంత వెలవెల పోదేమో? బట్టల్తో సూటుకేసు పోతే ఇంత వ్యథకు లోనయ్యేవాణ్ణే కాదు. మెదడు కింత కష్టమూ కలిగించకపోదును. అయితే, వో తెలివి తక్కువ పని చేశాను. జేబులో ఉంటే బరువుగా ఉండనీ, వోహానాకవేళ జారిపోతుందేమో అనీ, నిద్రపోయే సమయంలో ఎవరేనా తీస్తారేమో అనీ ఇలాటి అనుమానాలు యేడిపించి జేబులో యాభైరూపాయలు పైచిల్లరతో ఉన్న పర్సు తీసి పెట్లో జాగర్త పెట్టాను. ఇలా తేడిచ్చింది నాతెలివి. టిక్కెట్టుకూడ పర్సులోనే వుండిపోయింది. పెట్టెకు కాళ్లొస్తయ్యని ఏమాత్రం ఊహించివున్నా నాతెలివి ఇలా కాలేది కాదు.

ఇంతవరకూ ఆయన మాట పోగొట్టుకుంటేనే ఇన్నిరకాలుగా మాట్లాడిన యీ మనుషులు నాసంగతి బయటపెట్టుకుంటే ఇంకెన్నివిధాలుగా మాట్లాడి, నా అసమర్థతకు నవ్వుకుంటారో, హేళనచేస్తారో? పోయిన సొమ్ము మరి తిరిగి రాదుసరికదా, ఇవన్నీ భరించాలి. వళ్లీ వో అయిదునిమిషాలు యోచించగా—ప్రయత్నిస్తే దొరుకుద్దేమో అనే ఆశ! మరుక్షణానికి వచ్చే స్టేషనులో రిపోర్టు యిద్దామా అనుకుంటాను. ఆపై క్షణానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా పోయిన పెట్టె మరి తిరిగిరావటమనేవిషయం స్వప్నవార్తఅని ఆత్మకి సంబంధించిన నిశ్చయం. పెట్టె పోయాక యెన్ని గంటలు గడిచాయో మనకి తెలీదాయె. రాత్రే పోయిందో, అర్ధరాత్రే పరిగట్టిందో, తెల్లారుజామునే మిస్ అయిందో? నాకు పట్టుకున్నది ఒక్కటే— పెట్టె తీసికెళ్లేవాడు హోల్డాలు ఎందుకు విడవాలీ అని. నాతో చెప్పకుండా, కనీసం, కొంచెం చప్పుడయినా చెయ్యకుండా ఆపని ఎందుకు చెయ్యాలీ అనిన్నీ. నే నిలా కిందామీదా పడుతూ ఉండగా యేదో పెద్దస్టేషను వచ్చింది. ఒక్క కుదుపుతో బండి ఆగింది.

౩

ఆగటమే తడవుగా ఆమె లేచి నిల్చుంది. "మీరు మొహం కడగరూ?" అన్నది. జారిపోతూన్న పైటను కొంచెంగా సర్దుకుంటూ. పోయిన పెట్టె పోనే పోయింది; దానికోసం చింతిస్తూ మొహం కడుక్కోవటంకూడా ఎక్కడ మానను మరి! ఆమెను నడవమంటూ నేనూ దిగాను. ఒహోయన సంచీలోంచి వేపపుల్లల కట్ట తీస్తూంటే రెండు పుల్లలు యాచించి తీసుకున్నాను. మేం జోడా ఉన్నాంకదూ మరి! సంబంధం లేని జోడా మాది. పమ్మల్ని చూసేవాళ్లంతా ఏమనుకుంటారో? మిథునమనుకుంటారో, ఇతరవరుసలు భావిస్తారో, స్నేహితులని ఊహిస్తారో? నా కింకో భయం కూడా లేకపోలేదు. నన్ను తెలిసున్నవాళ్లెవరయినా కనుపించి విమర్శచేస్తే! ఏం చెప్పాలి? ఏమో! నాకే తెలీదుకదా!

మేమిద్దరం పైపువద్ద అయిదునిమిషాల్లో మొహం కడగటం ముగించాం. ఆతర్వాత

అధమపక్షం గుక్కెడు కాఫీ అయినా తాగాల్సిన అలవా టుంది. నాజేబులోమటుకు రాగి కాసీకూడా లేదు. ఓనిమిషం తటపటాయించాను. ఎంత ఊహించినా ఉపయోగమున్నట్టు తోచలేదు. మాట్లాడకుండా త్రాగేసి, 'అయ్యరుగారూ! అరు'వని మనవి చేసుకోటానికి ఇదేమయినా స్వంతఊరు గనుకనా! ఈమధ్య, రోజులు మారి, అక్కడా పలకటం లేదు అరువు. మరేం మాట్లాడకుండా వెళ్లి పెట్లో యెక్కి కూర్చున్నాను ఉసూరుమంటూ. ప్రయాణ మధ్యస్థంలో ఇలా మోనం చెయ్యటంకంటే, తెగని కత్తితో ఒక్కసారిగా యీకంఠాన్ని కోయటం ఎన్నోరెట్లు ఉత్తమం అని నాఊహ. యీవిషయాన్ని అటువంటి మహానుభావులంతా గ్రహించాల్సిందని మనవికూడాను. యీ పోగొట్టుకున్న వాళ్లు పడే వ్యథ వాళ్లకే తెలియాలి. ఆబాధను చెప్పటానికీ, రాయటానికీ యీభాషలో మాటలు లేవు. యింటి దగ్గర ఎంతాస్తి ఉంటేనేం? ఎంత డబ్బు ఉంటేనేం? యీక్షణంలో అరకప్పుకాఫీ తాగాలంటే ఒక్క అణా లేదుకదా! ఎంతటి దీనస్థితి!

ఇంటి కెళ్లేవరకూ ఉపవాసం సాగించ దలుచుకున్నాను. ఎవరికోసమూ కాదు, నాకోసం. కాఫీ యెలానూ లేదు, సిగిరెట్టయినా కాల్చుకుందామని జేబులో చెయ్యి పెట్టాను. కాళీపాకెట్టు గలగలమంది. నేను వచ్చెయ్యటంతో నావెనుకనే ఆమెకూడ వచ్చింది. నే కూచున్న కిటికీదగ్గరగా ప్లాట్ ఫారం పయిన నిల్చుని, ఆప్యాయతతో కూడిన స్వరంతో—

"కాఫీతీసుకోకుండా వచ్చేశారేం?"

యేం చెప్పను సమాధానం? నావద్ద డబ్బేం లేదని చెప్పటానికి సిగ్గూ, అభిమానం యేడిపిస్తున్నయ్. ఆమెకు సమాధానం యివ్వాల్సిన బాధ్యత నాయందు ప్రస్తుతం ఉంది. మరేం తోచక, ఇలా అన్నాను—

"కాఫీ అలవాటులేదు."

ఒక్కొక్కప్పుడు అనుకోకుండాకూడా అబద్ధం ఆడాల్సిన అవసరం వస్తుందికాబోలు. ఆమెవంక చూడకుండానే యీమాటలు అన్నాను.

"అబద్ధమాడుతున్నారు!"

నవ్వుతూ అంది. ఎవరో ఈమెతో చెప్పింది నే నబద్ధమాడుతున్నట్టు. అసలు నాకాఫీగొడవ యీమె కెందుకో నాకు తెలీటంలేదు.

"నే నబద్ధమాడుతున్నానా?"

ఆమె మొహంలోనికి అదోలా చూస్తూ అన్నాను.

"నేను చెప్పాలా? మీకు తెలీనప్పుడు కదా!" కొంచెం నిక్కచ్చిగానే అంది.

"యీచర్చ దేనికిగాని, మీరు తీసుకు రండి. టైము లేదు." అన్నాను బెట్టుసరిగా.

"అలా కాదు. నాకోసమయినా మీరు తీసుకోవాలి."

బ్రతిమాలుతున్నట్టు స్ఫురిస్తున్న చూపుల్తో అటువైపుకున్న నాచేతిని తన చేత్తో స్పర్శించింది! ఆమెసాహసానికి నాకు ఆశ్చర్యమే కలిగింది. ఆమెస్పర్శ నాలో తెలియని ఆనందాన్ని కలిగించింది. నేననుకుంటాను- యీ అమ్మాయి నన్నుగాని ప్రేమించటం లేదుగదా? ఆమె అంతపనీ చెయ్యటంగాని

ఆంధ్ర దేశములో నవంబర్ 3 విడుదలైనది

లక్ష్మీ టాకీస్ బెజవాడ



జయా టాకీస్ రాజమండ్రి

పక్షిరాజా వారి

# జగతలప్రతాపన్

తమిళటాకి

**NARASU PICTURES CIRCUIT**

MADRAS - BEZWADA

తటస్థించిననాడు నాగతేం గాను? ఇంటి దగ్గరున్న ఇల్లాలు చీపురుకట్ట తీసేటంత పని చేయదూ! "నాకోసమైనా" అంటే ఆమాట ల్లోని సిసలయిన భావం ఏమయ్యుంటుందీ? మీారు తాగన్నాడు నేనూ మానేస్తాను సుమా అని చెప్పటమా? ఆమెకూ నాకూ యేమిటి సంబంధం? యేం లేదు, ఇందా కటినించీ అయిన కొద్దిపరిచయంమాత్రమే. అంతగా బలవంతపరుస్తుంటే మరేం చేసేది? విధిలేక దిగాను. ఆమెను అనుసరించాను. బుర్రంతా ఆలోచనల్తో రేగిపోతోంది.

3

కాఫీకి ఆమెతోకూడా వెడుతున్నా నన్న మాటేగాని, నాలోని శక్తులన్నీ ఒక్కొటీ వెనక్కి పారిపోతూనే ఉన్నయ్. నిజానికి నాకు ప్రతిరోజూ కాఫీ తాగాల్సిన అలవాటు రెగ్యులర్ గా ఉన్నప్పటికీ అవ్వాళమాత్రం యేమో దానిమీాద వాంఛ లేనేలేదు. తీరా కాఫీ తీసుకున్నాక నేనే డబ్బులు చెల్లించ వలసిన పరిస్థితులు యేర్పడితే—ఇంతవరకూ ఆమెదృష్టిలో నాకున్న గౌరవం కాస్తా గం గనుకలిసిపోదూ? మోజు కాస్తా గుటుక్కు మనదూ? దిక్కుమాలినవాడు, నాపెట్టె తీసుకుపోవాలీ? నాపెట్టెకంటె మంచివీ, పెద్దవీ దానిమెదురుగా, ప్రక్కగా యెన్ని లేవు? సరే, ఎలా జరగాల్నుందో చూదాం! ఉరిశిక్షపడ్డ నేరస్థుడుకూడా ఆపని రేపే జరుగుద్దని తెలిసినా, యింత జిజ్ఞాస పడడేమో!

వెళ్లాం. కూర్చున్నాం. నేనుమాత్రం యీప్రపంచానికి సంబంధించిలేను. మరెక్క డున్నావయ్యా అని ఎవరయినా నిలదీసి అడిగితే—టక్కున చెబుతాను—పెట్టెలు, పర్సులు, అర్ధాంతరమధ్యస్థంలో పోగొట్టు కున్న నాలాంటి దద్దమ్మల బుర్రలన్నీ ఎక్క డుంటయ్యో తెలీదుటయ్యా అని. కర్మం చక్కగా కాల్తేగాని, రైల్లో, సొమ్ములు శీదాగా కోల్పోటం జరగదు. (కసీసం అప్పటి నాదృష్టిలో) పుట్టిబుద్ధెరిగింత ర్వాత ఇలాంటి భంగపాటు ఎన్నడూ ఎరగనుకదా!

ఆవిడ ఏం చెప్పిందో, నా క్కాసింతయినా తెలీలేదు. ముందుకు వచ్చి పడేవల్లా అవి మినపఅడ్లన్లో, పెసరఅట్లో, ఉప్మా పేరుతో చెలామణీ అవుతున్న ఉప్పుడు పిండో తెలుసుకోకుండానే నేను తింటున్నాను. యింతలో వచ్చింది పొగలు గ్రక్కుతూ కాఫీదేవత. తొందరగా తాగేస్తే డబ్బులు ఎక్కడ ఇవ్వాలిసొస్తుందో అని తీరిగ్గా బోల్లా వేస్తూ కూర్చున్నాను. ఆమె కాఫీ త్రాగేసి, లేచి వెళ్లి మొత్తంబిల్లు చెల్లించింది. నాకళ్లారా చూశాను. అప్పుడు వెళ్లింది కాఫీకప్పు నోటివద్దకు. రామరామా! చల్లారిపోయింది, గోరువెచ్చగా అయినా లేదు, చేదువిషం! మరి చేతులు నొప్పిపెట్టే వరకూ తిరగబోశానాయె! కళ్లు మూసుకు ఆముదం మింగినట్టు — అప్పుడప్పుడు మా డాక్టరుగారు యిచ్చే డోసు మింగినట్టు— అయిందనిపించి లేచాను. లావాటివాడు నిల్చున్నాడు బల్లముందు. జేబులో చెయ్యి పెడుతూ—

"ఆవిడదీ, నాదీ బిల్లు!"

అన్నాను మోజుగా. ఆమె యిచ్చిందన్న ధైర్యంతో. ఏ డింకా సమాధానం యివ్వకుండానే బయట నాకోసం నిల్చుని వెయిట్ చేస్తున్న నా నూత్న స్నేహితురాలు-

"రండి, రండి. నే యిచ్చాను."

అంది. ముక్కునున్న బేసరులోని రాయి పొద్దుపొడుపుఎండకు మిలమిలా తళతళా మెరుస్తోంటే, సైకు పోజులో.

యింతసేపట్నుంచీ అంత బాధించక పోయినా, సిగిరెట్ ఇప్పుడు కావాలి. యేదో పెద్ద ప్లాన్ వేసేవాడిలా దృష్టి భూమ్మీదికి తిప్పి యేదో ఆలోచిస్తున్నట్టు నటిస్తూ క్రింది పెదవి మునిపళ్లతో నొక్కుతూ, నిల్చుండి పోయాను.

"ఇంకా నిల్చున్నారేం?"

ఆమె ప్రశ్నించింది.

"హా...ఏమిటి అంటున్నారు?"

తల పైకెత్తి అన్నాను. అప్పుడే యీ ప్రపంచంలోనికి వచ్చినవాడిలా.

"బండి కదలటానికి సిద్ధమవుతోంటే, ఇంకా సావకాశంగా నిలబడ్డ కారణం అడుగుతున్నాను."

అన్నది మళ్లా. విసుగుదల చూపకుండా.

"మీవద్ద చిల్లర ఏమయినా ఉందా?"

నావద్ద నోట్లు యేడిసినట్లు!

"ఎంత కావాలేం?"

"నాలుగు అణాలు."

అన్నాను, మొహం యింకోవైపుకు తిప్పుకుని.

"ఇవిగో..."

తీసుకున్నాను. హృదయం సిగ్గుపడుతోంటే.

"మీరు వెళ్లి ఎక్కండి! ఇప్పుడే వస్తున్నాను."

సిగరెట్ నిమిత్తం ప్రదర్శింపబడ్డ పాట్లివన్నీ.

## ౪

వెధవపెట్టె పోతేపోయిందిగాని, ఆమె పుణ్యమా అంటూ విల్సుసిగిరెట్టు దగ్గాగా కాల్చుకుంటూ కదులుతూన్న బండెక్కి యథాస్థానంలో ఆమెప్రక్కనే ఆసీనున్నయాను.

"యిందాకట్నించే పరిశీలిస్తున్నాను. మీవ్యవహారమంతా పరధ్యానంగా కన్పిస్తోంది."

గెడ్డానికి చెయ్యి నానించుకుని అన్నదామె. సిగిరెట్టు ఒక్కసారి గట్టిగా పీల్చి పొగను తమాషాగా బయటికి వదిలాను.

"ముందుచూసిన కళ మీ మొహంలో కనుపించడంలేదు."

మళ్లా పెదవులెత్తి ఆమె అన్నది. నేను వినిపించుకోనట్టు, ఒకటొకటే పరుగెడుతున్న టెలిగ్రాఫ్ స్తంభాల్ని లెక్కపెడుతూ బయటికి చూస్తున్నాను, ఆమె ఇంకా ఏమంటుందో అని.

"ఈవల నేను మాట్లాడుతున్నది నా సూటుకేసుతో కాదన్న సంగతి తమరు గ్రహించాలి."

యీసారి ఆమెగొంతులో కోపమూ, దాంతో కలిసిన చిరునవ్వూ వినిపించినై. అప్పుడు సిగిరెట్టు ముక్క బయటికి విసరి ఆమెవంకకు తిరిగాను. నిజానికి నాగొడవ నాది. మావూరు దగ్గరకు వస్తోంది. అన్నిటి మాటా యెలా ఉన్నా ముందుసంగతి టికెట్టలేదు. ఎక్సెసు అడిగితే డబ్బూ లేదు. ఇంటికెళ్లి పంపుతానయ్యా అంటే వూరుకునే మాస్టరూ కాదు. యీగొడవ తల్లో మెదుల్తో నేను అవస్థపడుతున్నాను.

"మీ రేదో తీవ్రసమస్యలో మునిగి అవస్థపడుతున్నట్టు తోస్తోంది."

అని అందుకుంది మళ్లా. ఇక వినిపించు కోనట్టు ప్రవర్తించటం మోటగా ఉంటుంది. అన్నాను—

"ప్రస్తుతం ప్రాణంకంటెకూడ విలువైన వొక వస్తువు పోగొట్టుకున్నా."

"రైల్లోనే?"

"ఆహా! బండిలోనే."

"మరేమిటో ఆవస్తువు?"

"ఏమయితే నేం? పోయింది. మూడు రోజులు నిరాహారదీక్ష పూనినా మరిరాదు."

"చిత్రంగానే వుంది. మీ భార్య గాని మీతో చెప్పకుండా ఏస్టేషనులో అయినా వుడాయించలేదుగదా?"

"ఇంటివద్ద కులాసాగా ఉంది. అలా వెళ్లేదికాదు."

"ప్రాణంకంటె కూడ విలువైన దంటిరి. ఇంకేమిటి?"

"ఏమిటని చెప్పను? నామొహం."

"మీ మొహం మీ మొహంలోనే ఉందిగా."

"యేడ్చేవాళ్లని చూస్తే నవ్వేవాళ్లకి మహాసరదా."

"ఏమీ పోనప్పుడు, పోయిందని చెప్పుకోవటం దేనికంట?"

ఇంకో సిగిరెట్టు తీసి నిప్పు ముట్టించాను.

"నన్నెప్పు డయినా ఇదివరలో చూసినట్టు జ్ఞాపకమా?"

నేను త్రుళ్లిపడ్డాను. అందు గురించి అడగా లనే, పెట్టెపోయిన గొడవలో, మర చాను.

"అదే నేనూ అడగాలనుకుంటున్నా. ఎక్కడో చూచినట్టు గుర్తే. ఎక్కడ చూశానో జ్ఞాపకం రావటం లేదు. దయవుంచి వివరించమని నాకోరిక."

"వివరిస్తాగాని, మగవాళ్లు ఇంత త్వరగా మరిచిపోతా రేమని, నాకు తెలీక అడుగుతాను."

"క్షమించాలి. మరుపనేది ప్రతివారికీ సహజం. మిమ్మల్ని ఎక్కడో చూశాను."

"ఇంకా జ్ఞాపకం రాలా?"

"దాని దుంప తెగ, అది రావటంలేదు."

"సరే చూదాం. ఎప్పటి కొస్తుందో?"

"పోనీగాని, మీరు చెప్పరాదూ?"

"సమయం రానీండి, నేనే చెబుతాను"

బావుంది. నాకు జ్ఞాపకంరాదు; తను చెప్పదు. యేమిటో సమయం రావాలంటుంది. తెలుసుకోవాలని నాకాతృత, హడావిడీని. మళ్లా అన్నాను:

"మీరు మాకేమయినా బంధువులా?"

"బంధువులో, స్నేహితులో, అంతకంటెకూడ మెక్కువో చెబుతానుగా"

"ఆ చెప్పేదేదో కొంచెం తొందరగా చెప్పాల్సిందని నాకోరిక"

"మీరు దిగే దెక్కడ?"

"వచ్చే స్టేషన్"

"బెజవాడ?"

"అవును. బెజవాడే, నే దిగేది"

ఆమె మొహంలో యెందుకో చిరునవ్వు అంకురించింది. ఇంతలో బెజవాడ రావటం, బండి ఆగటం జరిగింది. ఆమె పెట్టెతో ముందూ, ఉన్న వొక్క బెడ్డింగూ చంకను

పెట్టె నేను వెనుకా దిగాం. ఆమె నాచెయ్యి పట్టుకుని-

"తమరు ఇక్కడ్నే నిలబడిఉండండి. మీ పెట్టె ఎక్కడికీ పోలేదు"

అంటూ పరిగెట్టింది. నేను నిర్ఘాంత పోయి చూస్తూ నిల్చున్నాను. పెట్టె పోలేదంటూఉంది. నా కర్థంకాదు. అయోమయం గా ఉంది. పెట్టె ఉందనగానే నాలో వెయ్యి సూర్యులు ప్రతిఫలించారు. అమ్మాయి నాకు తెలిసున్నదే. కాని ఎవరో ప్రస్తుతం మరిచాను. నేను చూస్తూఉండంగానే వెళ్లి మూడుపెట్టెలకు ఆవలనున్న ఆడాళ్లపెట్టెలో ఎక్కింది. వెంటనే దిగింది. నాపెట్టెతో- నా పెట్టెతోనే. ఆమెకూడా ఇంకో నలభైయేళ్లావిడకూడ ఉంది. ఆ పెద్దావిడ మా మేనత్తలా ఉంది. ఉండటమేకాదు, స్వయంగా మా మేనత్తే. యీామెకు ఆవిడతో సంబంధం యేమిటో? ఆవిడకూతురు జానకి ఇలా ఉంటుంది. జానకిని చూసి అయిదేళ్లయిన మూలాన మరచిపోయాను. జానకేగనక అయితే అప్పుడే ఇంతవుతుందా అని? అసలు నాకిచ్చి పెళ్లిచేదా మనుకున్నదికదూజానకిని.

"యేమోయ్ రఘూ, అంతాకులాసా?"

"బావా! మరిచిపోయావుగా నన్ను? ఇదిగో, నీపెట్టెదొంగను పట్టాను. నీదవునో కాదో చూడు"

పెట్టె నాచేతి కందించి అమ్మచాటుకు తప్పుకుంది. అసలు నాకు తలేదో, తోకేదో బోధపడలేదు.

"అత్తయ్యా! యేమిటిది?"

వెర్రిగా ప్రశ్నించాను. అత్తయ్య నవ్వుతూ—

"ఇదంతా నీమరదలు కొంటెతనానికి చేసిన పని. మేం రైలు ఎక్కగానే ముందుగా నువ్వున్న పెట్లో ఎక్కాం. కాలీ యెక్కడా లేదు. నిద్రపోతున్న నిన్ను గుర్తుపట్టాను. 'బావఇదుగోనే' అని దీనికి చూపాను. నేను ఆడాళ్ల పెట్లోకి వెళ్లాను. ఇ దక్కడే కూచుంది. మరి కాస్సేపటికి నీపెట్టె తీసుకువచ్చి నావద్ద పెట్టింది. నువ్వు బావకు కనుపించ వద్దని నాతో చెప్పింది. ఇదీ సంగతి"

అంటూ అత్తయ్య విశదీకరించింది. ఇంతకూ జానకిని మరిచిపోయినమూలాన ఇంతగొడవ కలిగింది. అన్నా :

"అమ్మదొంగా, ఎంతపని చేశావ్ జానకీ! బుర్రంతా పాడుజేశావ్ కదా! ఎక్కడ నేర్చుకున్నా వీపన్లు?"

"వెడతామోయ్, గంట కొట్టారు"

"పంపన్లు చేశానేం? పెట్టెఇచ్చిందికాకుండా—బావా! గుడ్ బై"

వాళ్లిద్దరూ ఎక్కారు. బండీ కదిలింది. కనుపించేంతవరకు చెయ్యి విసురుతూనేఉంది జానకి. మాజానకి ఎంతపని చేసిందా అనుకుంటూ పెట్టెతాళం తీసి టిక్కట్టు యిచ్చి బయటపడ్డాను.

---



# విమర్శనము

## ఆంధ్రధ్వన్యాలోకము (ప్రథమభాగము)

గ్రంథకర్త: సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ, కవితావిశారద పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, శ్రీ విజయనగర మహారాజ కళాశాలాంధ్ర పండితులు.

ఇది ప్రఖ్యాతసంస్కృతాలంకారికుడైన ఆనందవర్ధనుని 'ధ్వన్యాలోక' గ్రంథమునకు తెలుగు. 'ధ్వన్యాలోక' వ్యాఖ్యాతలలో నొకరైన అభినవగుప్తపాదుల 'లోచన' వ్యాఖ్యకూడ ఈగ్రంథమునందు ఆంధ్రీకృతమైయున్నది. మాతృకలోని లక్ష్యశ్లోకములు దీనిలో పద్యరూపముగా నున్నవి.

శబ్దమును ఆశ్రయించి యుండునది అర్థము. ఆయర్థమేగాక మరియొకటి స్ఫురించిన దానిని 'ధ్వని' యనియు, 'వ్యంగ్య'మనియు అందురు. 'ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర' అను మనుచరిత్రపద్యము చదివినప్పుడు పద్యమునకు గల యర్థమొకటి, స్ఫురించెడి యర్థము వేరొకటి. దీనినే ధ్వని యందురు. ఉత్తమకావ్యములు ధ్వనిద్యోతకములుగా నుండును.

ధ్వని యనునది వేరే లేదనియు, కల యర్థమంతయు శబ్దమందే యున్నదనియు పూర్వపక్షము. తత్ఖండనము, సిద్ధాంతము, ధ్వనినిరూపణము, దానిని సాధించు రీతులు మొదలైన విషయము లీగ్రంథములో వివరింపబడి యున్నవి.

సంస్కృతభాషాపరిచయము గలవారికి ఈ గ్రంథము బోధపడునట్లు ఇతరులకు బోధపడదేమో యని తోచుచున్నది. తెలుగుపద్యములు సంస్కృతపదభూయిష్ఠములుగా నుండుటయు, ఆంధ్రవివరణము అట్లే యుండుటయు దానికి కారణములు.

ఆంధ్రీకృతికర్తలైన లక్ష్మీనారాయణశాస్త్రిగారి గురువులు కళాప్రపూర్ణ తాతా సుబ్బరాయశాస్త్రిగారు వ్రాసిన యభిప్రాయములో గ్రంథప్రాశస్త్యమును జెప్పుచు "బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు మొదలైన మహావిద్వాంసులు సంతోషపూర్వకముగా యిచ్చిన యభిప్రాయములుపయికము ఈగ్రంథముయొక్క ఘనతను సాకల్యముగా చెప్పలేకపోయినవేమో యని తలచుచున్నా"నని వ్రాసిరి. ఇతరుల విషయము చెప్పనక్కరలేదు.

ఈ గ్రంథముయొక్క ద్వితీయభాగమును త్వరలో ప్రచురించి పండితుల కృతజ్ఞతకు పాత్రులగుదురని నమ్ముచున్నాను.

X

---

## కథలు - గాథలు (మొదటి భాగము)

రచయిత: దిగవల్లి వేంకటశివరావుగారు, వకీలు, బెజవాడ. డెమ్మీసైజులో ౧౫౦ పుటలు. వెల రూ. ౧-౮-౦.

భారతి, ఆంధ్ర వారపత్రికాపాఠకులకు చిరపరిచితమైన దిగవల్లివారి రసవచ్చరిత్రరచనలు అలతి అలతి మార్పులతో ప్రస్తుతగ్రంథరూపము దాల్చినవి. చక్రవర్తికి శిక్ష విధించిన దివానులు, తురకల దశావతారములు, సీతారాముల శాపం, కాశీమజిలీలో శివ

లింగం మొదలైన వింతవింత శీర్షికలతో శివరావుగారు తాము పాతపురాణములను, పాతకవిలెక్కట్టలను అనన్య సామాన్యమైన ఓర్పుతో పరిశోధించి బయటికిలాగిన అనేక యథార్థచరిత్రలను చక్కని కథలరూపమున ఈ గ్రంథమున చిత్రించియున్నారు. నిజమున కిది చరిత్ర గ్రంథమైనను కథలసంపుటివలె జనసామాన్యమునకు సయితము చదువ నింపుగా నున్నది. ఈగ్రంథమందు ప్రతిపుటలోను శివరావుగారి పరిశోధన ప్రావీణ్యము, సత్యాన్వేషణతత్పరత ద్యోతక మగుచున్నవి.

---

# గ్రంథ స్వీకారము

## గోవిందరామాయణము - ఉత్తరరామచరితము

గ్రంథకర్త: ఆత్మకూరి గోవిందాచార్యులుగారు, ఎం. యల్. సి., ఏలూరు. ౧౫౮ పుటల పద్యకావ్యము. వెల రూ. ౨-౦-౦.

## రత్నసానువు

రచయిత: వారణాసి వెంకటేశ్వర్లుగారు. ప్రకాశకులు: సుందరరాం అండు సన్సు, తెనాలి. క్రౌను సైజులో ౮౮ పుటల ఖండకావ్య సంపుటి. వెల ౧౦ అణాలు.

## ఘంటారావం

రచయిత: అన్నూరి అయోధ్యరామకవిగారు. ప్రాతిష్ఠానము: భారతీయసదనం, ఖమ్మంమెట్టు(నైజాము). క్రౌనుసైజులో ౩౬ పుటల ప్రబోధగీత సంపుటి. వెల ౪ అణాలు.

## మంజీరము

రచయిత: కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారు, సారస్వతనికేతనము, వేటపాలెము. క్రౌను సైజులో ౨౦ పుటల ఖండకావ్యము. వెల తెలియదు.

## గాంధీజీ!

రచయిత: మునగపాటి విశ్వనాథశాస్త్రిగారు. ప్రాతిష్ఠానము: వెంకటరామా అండ్ కో., తెనాలి. డెమ్మీ ౧౬ పుటల సైజులో ౩౮ పుటల పద్యకావ్యము. వెల ౩ అణాలు.

## బాలభారతి

నేటి బడులలోని ౬, ౭, ౮ తరగతుల విద్యార్థుల ఉపయోగమునకై వ్యాకరణ, వ్యాసరచనాది విషయములను సంకలించి కూర్చిన గ్రంథము. రచయిత: రామదుర్గుల సుబ్బారావుగారు. ప్రాతిష్ఠానము: బాలభారతి ఆఫీసు, కానూరగ్రహారము, వయా నిడదవోలు. డెమ్మీసైజులో ౧౨౦ పుటలు. వెల ఒక రూపాయి.

## లక్ష్మణరాయవర్ధంతి సంచిక

'తెలుగు తల్లి' మాసపత్రిక ప్రత్యేక సంచికగా వెలువడినది. సంపాదకురాలు: రాచమల్ల సత్యవతీదేవిగారు. కార్యాలయము: కింగ్సువే, ఇమాంబాడి వీథి, సికిందరాబాదు. వెల ౧౮ అణాలు. కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారి మహత్తరజీవిత విశేషములకును, వారి సారస్వత చరిత్ర పరిశోధన ప్రజ్ఞాప్రాభవములకును ఇది దర్పణప్రాయముగా నున్నది. లక్ష్మణరావుగారితో తమకు గల పరిచితి విశేషములను పలువురు పెద్దలు ఇందులో వివరముగా వ్యక్తీకరించి యున్నారు.

## దీపావళి సంచికలు

ఢంకా దీపావళిసంచిక — సంపాదకుడు: వి. టి. నరసింహాచార్యులుగారు, ౬, సుంకురామచెట్టి వీథి, జి. టి., మద్రాసు. వెల ఒక రూపాయి.

సూర్యప్రభ దీపావళిసంచిక — సంపాదకుడు: డాక్టరు డి. అప్పారావుగారు, ౫౩, గోవిందప్ప నాయక వీథి, మద్రాసు. వెల ౪ అణాలు.

యథాపూర్వమయిన ఆకర్షణలకును, సినిమా చిత్రములకును, కథలూకబుర్లకును ఆకరములై యుండి, ఈ రెండును దేని ప్రత్యేకత్వము నదే స్పష్టముగా నిలుపుకొన్నవి.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.



సయించని సాపాటు

చిత్రకారుడు:

శ్రీ మాధవపెద్ది గోపాలకృష్ణగోఖలే.